

# మినీ కతల పోటీ ఫలితాలు

మననిత్య జీవితం సవాలక్షసమస్యల మయంగా, పరుగుపందెంగా మారి మనసారా ఒక్షణం నవ్వగల వ్యవధి కూడా లేకుండా పోయింది. అందుకే ఆ క్షణంలో నగకాలంలోనే చదివేసి హాయిగా నవ్వుకునే అవకాశం కల్పించగల "మినీకత"ల పోటీని నిర్వహించింది చతుర. "అందంగా విస్తరింపజేసిన కొత్తతరహా జోక్కూడా చక్కని మినీకతగా రూపొందుతుందని రచయితలకు మేమిచ్చిన సూచనను అందుకుని, ఎందరో తమ రచనలను పంపి ఈ పోటీలను విజయవంతం చేశారు. విజేతల వివరాలు ఈ దిగువన ఇస్తున్నాం. ఇవిగాక, సాధారణప్రచురణకు స్వీకరించిన మినీకతల గురించి ఆయారచయితలకు నేరుగా తెలుపుతున్నాం. బహుమతులు పొందిన రచనల్లో మూడింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

**ప్రథమబహుమతి రు : 100/-**

1. అమ్మచేతికాఫీ- కోనే నాగవెంకట ఆంజనేయులు

**ద్వితీయ బహుమతి రు : 75/-**

2. ఇంటర్వ్యూ- కె.వి.సుబ్బారావు

**పది తృతీయబహుమతులు ఒక్కొక్కటి రు.50/- చొప్పున.**

3. దొంగగారు- చిరుమామిళ్ళ మనోహర్
4. శిక్ష- ప్రహరాజురాధాకృష్ణ
5. అప్పు- శ్రీకంఠమూర్తి
6. యాత్రానుభవాలు పి.ఉమామహేశ్వరరావు
7. సామెత- ఎన్.హరప్రసాద్
8. బిజినెస్- సోమయాజుల సాయిప్రసాద్
9. చిట్కా- చిలుకూరి దేవపుత్ర
10. గుడ్మాణింగ్‌సార్- జి.వి.రమణ
11. అతిథిదేవోభవ- కె.హరిబాబు
12. తీర్పు- ఎస్.వి.సురేష్


అందం – ఆరోగ్యం
JEEVANTONE
బలహీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.
ఒక సీసా తాగింతర్వాత ఇంకా ఎన్ని సీసాలు తాగాలో మీరే నిర్ణయిం చేసుకోగలరు
ఆరోగ్యంగా లేకపోతే రోగాలపాలవుతారు
మంచి ఆరోగ్యం, బలం, శక్తి పుష్టిగా కండరాలు పొందిన తర్వాత ఈ మందును ఆపివేయడం మంచిది
'' MFG, LICENCE No. AUS 59/75''
Contact our new sole Distributors
M/S. New Shakti Pharma,
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
Phone: 2866
JEEVANTONE
450 Grams Rs. 36/-
ఏ.పి.పి కొరకు
జీవన్‌టోన్ ప్రాడక్ట్స్
పి.బి.నం. 880 17/2
కెంప్రిడ్జి రోడ్
బెంగుళూర్-580 008
SINDU

# చెప్తాం కతలు



## అమ్మచేతి కాఫీ

**మొదటిబహుమతి**
**రు. 100/- పొందిన మినీకథ.**

చాలారోజులనుండీ మాపిల్లలు 'సినిమా సినిమా' అని గోలపెడుతుండటంతో ఆరోజు సినిమాకి బయలుదేరక తప్పలేదు. సాయంత్రం ఆరుగంటలయ్యేసరికి తయారై పోయాం నేనూ, మా పిల్లలూ. మరో అయిదు నిముషాల్లో మా ఆవిడ ముస్తాబుకూడా పూర్తయిపోయింది (ఒట్టు... నిజం).

సినిమాహాలు దగ్గరే అయినా, బస్సు మీద అయిదునిముషాల ప్రయాణమే అయినా ఆటోని పిలిచాను ఆరోజింకా మూడో తేదీనే కావడంతో. ఎప్పుడు సినిమాకి వెళ్ళినా వీలైనంత త్వరగా వెళ్ళడం, ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ దగ్గర నుండి అన్నీ చూడటం మాకిష్టం. అందుకనే ఆరూపదికల్లా సినిమా హాల్లో వాలిపోయాం.

టికెట్స్ తీసుకుని లోపలికి వెళ్ళిన పదిని ముషాలకు లైట్లారిపోయి తెరపై ఎడ్వర్టయిజ్‌మెంట్స్ మొదలయ్యాయి.

మాధవి తన దేహసౌందర్యానికి ఏ సబ్బు కారణమో వివరించిన తరువాత 'సన్‌సెట్' కాఫీపొడర్ ఎడ్వర్‌టైజ్‌మెంట్ మొదలయింది.

సూర్యాస్తమయ సౌరభంతో కూడిన 'సన్‌సెట్' కాఫీ ఎంతో రుచిగా వుంటుందట. తాగినకొద్దీ ఇంకా ఇంకా తాగాలనిపిస్తుందట. ఎంత తాగినా అజీర్తి చేయదట. కడుపునొప్పి రాదట. ఇంట్లో అమ్మ తయారుచేసిన కాఫీలాగే వుంటుందని స్కూల్ పిల్లలు మరీమరీ చెప్పేరు. ఆ కాఫీ తాగుతున్న మరో యువజంట ఇద్దరి మొహాల్లో ఎంతో ఆనందం, ఆహ్లాదం వెల్లివిరుస్తోంది.

ఎలాగైనా ఆ మరునాడు ఆ కాఫీ పొడర్‌కొని తాగి సదరు యువజంట పొందిన ఆ ఆనందానుభూతిని అనుభవించి తీరాలని నిర్ణయించుకున్నాను.

మరునాడు ఉదయం మా ఆవిడఇచ్చిన సామాన్ల లిస్టులో 'సన్‌సెట్' కాఫీ పొడర్ పేరు కూడా చేర్చాను. ఆ చీటీ, డబ్బులూ మా చిన్నబ్బాయికిచ్చి మా వీధి చివరే వున్న పచారీ కొట్టుకు పంపించాను.

అరగంట తరువాత తిరిగొచ్చాడు మావాడు సామాన్లతో. ఆత్రంగా లెక్కచూసుకున్న నాకు 'సన్‌సెట్' కాఫీ బదులు వేరే బ్రాండ్ కాఫీ పొడర్ సీసా కనిపించింది సంచిలో.

నాక్కోపం నషాళానికంటింది.

"ఏరా బాబూ! నిన్ను 'సన్‌సెట్' కాఫీ పొడర్ తెమ్మని రాసి మరీ పంపితే మరేదో రకంకాఫీ తెచ్చావేమిట్రా?" అనడిగాను సౌమ్యంగానే.

"మరేమో నాన్నగారూ... ఆ కాఫీ ఇంట్లో అమ్మ చేసిన కాఫీలాగానే వుంటుందని రాత్రి సినిమాలో చెప్పేరుగా... ఆమాత్రానికి ఎందుకని తీసుకురాలేదు" అన్నాడు వాడు బిక్కముఖం వేసుకుని.

**—కోనే నాగవెంకట ఆంజనేయులు**

# ఇంటర్వ్యూ

**రెండవ బహుమతి**
**రు. 75/- పొందిన మినీకథ.**




రోడ్డు చాలా రద్దీగా ఉంది. అసలు ఆ రోడ్డుతీరే అంత. సాయంత్రమయితే రద్దీ మరీ ఎక్కువ. పేవ్‌మెంట్లమీద రకరకాల వస్తువులు. విదేశీ సరుకనే పేరుతో చలామణి అవుతున్న దేశ వాళి కల్తీ నకిలీసరుకు. వాటివెనుక రంగు రంగుల విద్యుత్‌దీపాలతో మిలమిల మెరి సిపోయే అందమైన గ్లాసుడోర్లు. వాటివెనుక రకరకాల చీరలు, సూటింగులు వగైరా వగైరా.

అంత తొడతొక్కిటలో చాలా జాగ్రత్తగా ఆడ వాళ్లకు తగలకుండా మగవాళ్లను గుద్దుకో కుండా నడుస్తూ వెళుతున్నాను. ఇంతలో పాంటు జేబుదగ్గర మెత్తని స్పర్శతగిలి అప్ర మత్తుడనయ్యాను. ఎవరోగానీ జేబు తడుము తున్నారు బహు సున్నితంగా. నేను వాడిమీద జాలేసి వెనక్కి తిరగకుండానే స్లోగా నడవసా గాను.

పాపం, ఎంత ప్రయత్నించినా లాభంలేక పోవడంతో వాడెవడోగానీ తనలో తాను గొను క్కుంటున్నాడు. "జనానికి చావు తెలివితేటలు ఎక్కువయ్యాయి. అంతుచిక్కనిచోట్ల పర్సులు, డబ్బులు దాచేస్తున్నారు" అని. నాకు జాలే సింది. ఉండబట్టలేక వెనక్కుతిరిగి అన్నాను-

"అయ్యా పి.పి. గారూ! నేనో రచయితని. నా దగ్గరేముంటుంది బూడిద తప్ప"

అతడు ఖంగుతిన్నాడు. పదినిమిషాల్లో తెప్పరిల్లి అన్నాడు- "మీరు మరీ ముఖ్య మంత్రుల్లా డైలాగ్స్‌చెప్పకండి సార్! మీ రచ యితలదగ్గర బూడిదెక్కడిది. అదంతా పత్రిక లవాళ్లకిచ్చి డబ్బు తెచ్చుకుంటున్నారుగదా. అయినా ఆ పి.పి. అనే సంబోధన ఏమిటండీ? సినీ డైలాగులా" అన్నాడు స్పీడుగా.

"పి.పి. అంటే పిక్ పాకెటర్ అని మీకు తెలుసనుకున్నాను. క్షమించండి. నేను మీరను కున్నట్టు సీరియల్ రచయితనుకానులెండి. అయినా సాహిత్యబూడిద అమ్ముకొని బతికేవా డి జేబులు కొట్టడమేమిటి? ఎంచక్కా ఏ మహానాయకుడి జేబులో కొట్టక. ఎలక్షన్‌టైం గదా" అన్నాన్నేను.

"సార్! మీరు చాలా అన్యాయంగా మాట్లా డుతున్నారు. ఎంత పి.పి. గాళ్లమయినా మాకూ కొన్ని వృత్తిధర్మాలున్నాయి. రాజకీయ నాయకులు మాకు పెద్దన్నల్లాంటి వాళ్ళు. వాళ్ళూ, మేమూ కలిసి దోచుకునేది జనా న్నేగా! మరి మా మధ్య ఆ మాత్రం ఐక్యతలేక పోతే ఎలా"!

అతని వాక్చాతుర్యానికి ఆశ్చర్యపోయాను. ఎంత లాజిక్!

"ఇంత చక్కని భాష నువ్వు ఎలా నేర్చుకోగ లిగావు నాయనా" అన్నాను?.

అతడు నావంక ఎగాదిగా చూశాడు.

"మా సోదరులు మీటింగులు పెడతారు. మామూలుభాష వినివిని వినుగెత్తిపోయిన మన జనానికి వెరైటీకోసం భయంకరమైన పదజాలంతో ఉపన్యాసాలిస్తారు. దాంతో ప్రజ లకు మైకం వచ్చేస్తుంది. అదే సందనుకుని మేం వాళ్ల జేబులు తడిమేస్తాం. ఇలా ఒకరికొ కరం సాయపడుతుంటాం"

"అయ్యా పి.పి. గారూ! మీకు విద్యలో ఇంత ప్రావీణ్యం ఎలా అబ్బింది?" అన్నాను.

నా అజ్ఞానానికి చిరునవ్వు నవ్వాడతను.

"అదేంటిసార్! ఈమాత్రం తెలియదా! మా బ్రదర్స్ శిక్షణశిబిరాలు నడిపినట్టే మా అసోసియేషన్‌వాళ్ళూ పి.పి. ట్రయినింగ్ సెంటర్లు నడుపుతారు. రాజకీయ నాయకులు రిగ్గింగ్ ఎలా చెయ్యాలి, ప్రతిపక్షాలపై బురద ఎలా చల్లాలి, ప్రజల్ని ఎలా నమ్మించాలి అనేవి నేర్పితే మా వాళ్ళు జేబులు ఎలా కత్తిరించాలో, ఎప్పుడు కట్‌చెయ్యాలో నేర్పుతారు"

అతణ్ని చూస్తే నాకు జాలివేసింది. పాపం! అనవసరంగా నా మాటల్లోపడి టైంపాడుచేసుకుంటున్నాడు. అందుకే అన్నాను- "పాపం! మేం డబ్బుదాచుకునే కొత్తచోట్లు నీకు తెలియక ఇందాకట్నుంచి తికమకపడుతున్నావు. ఇదిగో ఇలా లోపలకనిపించని జేబులు పెడుతున్నారు ఇప్పటి టైలర్లు" అన్నాను జాలిగా.

"థాంక్సండీ" అంటూ వెళ్ళిపోయాడతను.

ఆశ్చర్యం! అయిదునిమిషాల తర్వాత చూస్తే జేబులో డబ్బు లేదు.

--కొచ్చర్లకోట వెంకటసుబ్బారావు

# దొంగగారు

**మూడవబహుమతి**

**రు. 50/- పొందిన మినీకథ.**

ఢంగున లేచి కూర్చున్నాడు సుబ్బారావు.

...ఏదో అలికిడి!

అసలే వేసవికాలం ఆరుబయటపడక. భయంభయంగా చుట్టూ చూశాడు.

ఈసారి మళ్ళీ చెవులు రిక్కించి విన్నాడు — నిజమే... ఏదో చప్పుడే! తనెప్పుడూ పొరబడడు.

నెమ్మదిగా మంచం దిగాడు. పక్కనే సతీమణి, మరో మంచంపై పిల్లలు పోటీలుపడి గురకలు తీస్తున్నారు.

పిల్లిలా వెళ్ళి పరిసరాలు పరికించాడు. — సరిగ్గా అదే సమయానికి ఓ మానవాకృతి ఏదో వస్తువుతో కాంపౌండ్‌వాల్ దూకి నిశీథ రాత్రిలోకి అదృశ్యమయ్యింది.

ఆ మర్నాడు...

మళ్ళీ ఉలిక్కిపడి లేచాడు సుబ్బారావు.

ఏదో... అలికిడి...

వాచీ చూసుకున్నాడు సరిగ్గా ఒంటిగంట.

నిన్న ఇదే సమయానికి అదే అలికిడి! క్రితంరోజు ఇల్లంతా గాలించి, శోధించి చూశాడు అనుమానం తీరక – కానీ ఏమీ పోయినట్టు, కనీసం స్థానభ్రంశం చెందినట్టుగానీ కనపడలేదు.

ఇహ ఉపేక్షించకూడదనుకొని బటన్‌నైఫ్, పెన్‌టార్చితోసహా బయటకొచ్చాడు.

ఆ ఆకారం పిల్లిలా తన ఇంటి వెనుకభాగానికి వెళ్తోంది.

వడివడిగా ఆ ఆకారాన్ని అనుసరిస్తున్నాడు సుబ్బారావు ఆ ఆకారానికి ఏమాత్రం అనుమానం రాకుండా!

నడుస్తున్న సుబ్బారావుకు ఓ బ్రిలియంట్ ఐడియాతట్టింది. అసలీరోజు వాడు దొంగిలించేదేంటో కనిపెట్టాలి రేపు వాడిపనిపట్టాలి. ఒకవేళ తన ఇంటివెనుక నిధులు గట్రా ఏమన్నా ఉన్నాయేమో?

ఆ మానవాకృతి చటుక్కున ఆగి ఓసారి దిక్కులు చూసింది.

"సిటీబస్సు" స్పీడులో పక్కనేవున్న చెట్టు వెనక్కి నక్కాడు సుబ్బారావు.

ఆ తరువాత అక్కడే ఏదో తీసుకుని వడివడిగా వెళ్ళిపోయిందా ఆకారం.

వెళ్ళేవరకూ ఊపిరి బిగబట్టి చూస్తుండిపోయాడు సుబ్బారావు. అతనికి టెన్షన్‌గా వుంది— ఆ దొంగ తీసుకెళ్ళింది ఏమై వుంటుందో?...

అతను పూర్తిగా అదృశ్యమవ్వగానే పరిగెత్తుకెళ్ళి ఆ దొంగ ఆ ఏదో తీసుకున్నచోటు చూశాడు.

— అంతే! గుండెలు బాదుకుంటూ బిగ్గరగా అరవసాగాడు సుబ్బారావు.

"బాబోయ్ నా నీళ్ళు!" — మంచినీళ్ళు— బిందెడు నీళ్ళు దేవుడోయ్"! అంటూ!

-- చిరుమామిళ్ల మనోహర్



# మీ డబ్బుకి

# మరింత మేలైన రక్షణ అవసరం!

మీ కష్టార్జితాన్ని ఎక్కడ దాచాలా అని ఆలోచించినపుడు "ఉదయతార"లో పొదుపు చేస్తే మీ డబ్బుకి పూర్తి రక్షణ ఉంటుందని గ్రహించిన వందలాది సభ్యులతో మీరూ పాలు పంచుకోండి.

"ఉదయతార" మీ ఆర్థిక జీవితానికి నిజంగా ఉదయ తారేనని గ్రహించండి.

అన్ని ఆదాయ వర్గాల వారికి అనుకూలమైన, అందరి అవసరాలకు సరిపడే వివిధ రకాల చిట్లు "ఉదయతార"లో మీకు అందుబాటులో ఉన్నాయి.

దీనికితోడు ఆకర్షణీయమైన డివిడెండ్లు తోడై మీ పొదుపు ఏ పెద్ద మొత్తంగా రూపు దిద్దుకుంటుంది.

"ఉదయతార"లో పొదుపు చేస్తే ధనానికి అమిత భద్రత. అధిక ఆదాయంతో పాటు, సత్వర పేమెంటు సమకూరుతుందని తెలిసి ఎందరెందరో మా సంస్థలో సభ్యులయ్యారు.

—ఒకసారి మా సంస్థలో చేరండి.
మరి మీకే తెలుస్తుంది.

**ఉదయతార'తో పొదుపు  మీ ఆర్థికాభివృద్ధికి మదుపు**

# ఉదయతార

ఫైనాన్స్ & చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీస్: 7-75, పటమట, విజయవాడ-6

ఫోన్: 52065

# 'డోబి' నవలపై చతుర సమీక్షలు

చతుర నవలల పోటీలో ప్రత్యేక నవలగా ఎన్నికై జూన్ సంచికలో ప్రచురితమైన డోబి పై మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగా వున్న ఆరింటిని 'ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు. బహుమతులు పొందినవారికి మా అభినందనలు!

## లోపాలెన్నో.....

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

**నే**టి సామాజిక సమస్యల్లో ప్రధానమైన సమస్య ను ఇతి వృత్తంగా తీసుకోవటం ప్రసంశ నీయం. సందర్భాన్ని కావాలని కల్పించుకుని శృంగార వర్ణన చేసే నేటి రచయితల్లా కాక కృష్ణమూర్తిగారు పద ప్రయోగంలో నిగ్రహం కన్పరచడం 'చతుర ప్రమాణాల'ను నిలబెట్ట డమని చెప్పాల్సి ఉంది. 'నిరంతరం రాపిడివ ద్ద శరీరభాగాన్ని మాత్రం కాపాడుకోలేకపో యింది' వంటి ఉదాహరణలెన్నో అందుకు తార్కాణం. సినిమా మోజుగల యువతులకు పర్యవసానం ఇలా ఉంటుందని హెచ్చ రించటం హర్షణీయం. కొత్తపట్టణం జాతరలో కారు వెనకనుండి చంద్రం, సుమలత-లను గమనిస్తూ రేఖ అసూయ కన్పరచడం స్త్రీ సహజమైతే, లాడ్జిలో చంద్రం రేఖను అనుభ వించడం పురుమడిలో సహజమైన మానసిక బలహీనత ఫలితం. అటువంటి సహజ లక్ష ణాల ప్రస్తావన నవలయొక్క వాస్తవ సామీప్యా నికి, రచయిత యొక్క పరిశీలనా శక్తికి నిద ర్శనం.

అయితే ఇన్ని సుగుణాలున్న ఈ రచనలో అంతకుమించి లోపాలుండటం విచారకరం. సినిమాలను దృష్టిలో పెట్టుకుని రాసే నవల

లకు ఈ నవల ఏమాత్రం మినహాయింపు కాదు. సామర్లకోటలో రైలు ఆగినప్పుడు వెతుకుతున్న రేఖ కన్పించగా 'రేఖా... రేఖా' అని చంద్రం పిలుస్తుంటే' కామిని కలలో కూడా చంద్రం అలాగే పిలుస్తున్నాడు, జాతరలో రేఖ కారు వెనుకనుండి చంద్రం, సుమలతల్ని గమనిస్తూ ఆశలు అడుగంటాయని బాధపడటం, సింబాలిక్‌గా బూరపేలిపోవడం-వంటి హంగులనెన్నింటినో ఈ సందర్భంగా ఉదహరించవచ్చు. నవలలో ఒక చోట రాజమండ్రి స్టేషన్‌లో 'ఉత్తర దిక్కుగా వెళ్ళే రైలు ముందు వచ్చింది' అని ఉంది. రాజమండ్రికి 'ఉత్తరదిక్కుగా రైల్వే లైనంటూ లేనేలేదు. అలా రైలు వెళ్ళి సామర్లకోట చేరుకుందిట. కాని రాజమండ్రికి తూర్పుగావుంది సామర్లకోట. విమల చుట్టూ అంతకుముందు 100 పేజీల రచన సాగించిన రచయిత 117వ పేజీలో ఆమెను కేవలం రెండు మూడు మాటల్లో చంపేయడం సహించరానిది. ఇలాంటి సందర్భాల్లో వర్ణన దృష్ట్యా రచయిత వెనకబడ్డారనే చెప్పాలి.

రచయిత కథావస్తువును ఎన్నుకోవడంలో చూపిన నేర్పు కథాకథనంలో కన్పరచలేకపోయారు. కథనం ముక్కలుముక్కలుగా ఉందే తప్ప సంవిధానంలో, సమన్వయం గోచరించదు. "ఊబి"లో పడినవారు సాధారణంగా బయటపడటానికే శతవిధాల ప్రయత్నించారు. కాని గవిరి- మనోహరిగా, శంపాగా, కామినిగా, రేఖగా కూడా తిరిగి వ్యభిచరించడానికే మొగ్గుచూపిందిగాని ఆ 'ఊబి' నుండి బయటపడే ప్రయత్నంచేయలేదు.

— డి. హరనాథబాబు,
చోడవరం

## సందేశాత్మక నవల

**(ద్వితీయ బహుమతి రూ. [illegible]/- పొందిన సమీక్ష)**

**ఒక బాధాతప్తురాలి దీనగాథను, కన్నీటివ్యథను హృద్యంగా చిత్రీకరించారు రచయిత.** వడుపువృత్తిలో జీవితాన్ని గడుపుకొనే యువతి సాధారణ జీవితాన్ని గడపాలని ప్రయత్నిస్తే ఆమె చివరకు దారుణంగా చంపబడటం, సమాజంలో పెచ్చుపెరిగిపోయిన హింసాకాండకు, అమానుషత్వానికి నిదర్శనమన్పించింది.

వేశ్యగా జీవితం గడుపుతున్న యువతి శంప జీవితం వేశ్య శరీరంతోనేగానీ మనసుతో నిమిత్తం లేదనుకొనే మనుషులను కొంత ఆలోచింపజేస్తుంది. కానీ మొట్టమొదటగా ఆమె మనసును, ఆరోగ్యాన్ని గురించి ఆలోచించి, ఆమెకోసం తపనపడిన డాక్టర్ చంద్రశేఖరం, చివరకు నగటు మగవాడిలాగే ప్రవర్తించి ఆమె జీవితాన్నుండి తప్పుకున్నతీరు బాధాకరం. మొదటినుండి అతని పాత్ర చిత్రణను బట్టి చివరకు అతడు రేఖగా మారిన శంపను ఆదర్శప్రాయంగా వివాహం చేసుకుంటాడని ఎదురుచూసిన పాఠకులకు ఇది గట్టిదెబ్బ. జాతరలో తప్పిపోయిన రేఖ, చంద్రంను కలుసుకున్న తరువాత హోటల్లో ఆమె తన అంతరంగమథనాన్ని అతనికి వివరించినతీరు చక్కగావుంది.

చంద్రశేఖర్, సుమలతల పాత్రలు అర్థాంతరంగా ముగిసినా కథ ప్రధాన పాత్రధారిణి రేఖ చుట్టూ తిరుగుతుంది కాబట్టి ఈ విషయం అంత పట్టింపులోకి రాదు. కథలో వేశ్యా జీవితాల్లోవున్న చీకటికోణాలు బాగానే వివరించబడ్డాయి. అయితే రేఖ తను చేస్తున్న వృత్తిని తప్పుగా తలవడంగానీ, దానిని వదలివేయాలనుకోడంగానీ ఎక్కడా జరగకపోవడం ఆశ్చర్యకరం. ఆగ్రా నుండి ఆంధ్రా వచ్చిన తరువాత ఆమె తన వృత్తిని వదిలేసివుంటే బావుండేది. చంద్రశేఖర్‌ను ప్రేమించి, అతనిపై ఆశలుపెంచుకుని అవన్నీ చెదిరిపోయిన తరువాత మాత్రమే ఆమె తన వృత్తిని వదలివేస్తుంది.

రేఖ విమలగా మారిన తరువాత సరియైన మార్గంలో జీవితాన్ని గడపబోతే, ఒక పోలీస్ ఇన్‌స్పెక్టర్ మూలంగానే ఆమె మరణించడమన్నది కలవరపాటును కలిగించే ముగింపు.

వేశ్యల జీవితాలను ఉద్ధరించడానికి కంకణం కట్టుకోలేకపోయినా, కనీసం ఆ వృత్తిని వదలి వేసి గౌరవంగా బతుకుతున్న స్త్రీలను వారి మార్గాన వారిని వెళ్లనిస్తే చాలు.... అదే గొప్ప ఆదర్శం అన్పించింది.

—కె.పద్మ
గూడూరు-524101

## మరింత ఊబిలోకి...

(మూడవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు "ఊబి" ఏ ఆశయంతో రాసారో అర్థంకాదు.

మూలిగే నక్కపై తాటిపండు సామెతగా అనలే సమాజంలో అతిహేయమైన వుద్యోగులుగా ముద్ర వేయబడుతున్న పోలీసులపై మరో తీవ్రమైన నిందాస్త్రం ప్రయోగించబడింది. సమాజంలో పోలీసు అత్యాచారాలు మిన్నుముట్టిన మాట నిజమేకాని ఆ దుండగీడులు పోలీసులుగా కాక వ్యక్తులుగానే ఆ అకృత్యాలను సాగిస్తున్నారన్నది గ్రహించాల్సిన విషయం. కాకపోతే ఆ ఉద్యోగం వారికి మరింత స్వేచ్ఛను, అవకాశాలను ఇస్తున్నది. మరిన్ని పోలీసు పాత్రలువున్నా సబిన్స్పెక్టర్ నాగేశం పాత్రే ప్రాముఖ్యత కలిగి పాఠకుల మనసులపై ప్రభావం కల్పించేలా రచించబడిందీ నవల. మౌలిక విలువలలో అధఃపాతాళానికి విసిరి వేయబడుతున్న పోలీసు వ్యవస్థను ఈ "ఊబి"లో నుండి బయటికి లాగాల్సిన అవసరం ఎంతైనా వుంది.

విలక్షణమైన పాత్రగా చిత్రించబడాల్సిన చంద్రాన్ని ఖూనీ చేశారనక తప్పదు. నవల చివరివరకు అందుకున్నట్లేవుండి చివరకు రేఖను వదిలివేయడం చంద్రాన్ని దుర్బలుడిగా భావింపజేస్తుంది.

సాహసవంతంగా వ్యభిచారవృత్తిని నవలాంశంగా చేపట్టిన రచయిత అంతకు రెట్టింపు పిరికితనం నవలాగమ్యంలో చూపించాను. ఈవాళ్టి పరిస్థితుల్లో రేఖను, చంద్రాన్ని దంపతులుగా చిత్రించటం ఊహాజనితంగా వుంటుంది కాబట్టి కనీసం వారిని లాడ్జి కాబిన్‌లో కలయిక అనంతరం అయినా వేరుచేసి జీవనపర్యంతం ఒకరిపట్ల మరొకరికి ప్రేమానురాగాలు కలవారిగా చిత్రీకరించి వుంటే ఈ నవల ఇంతవరకు వచ్చిన ఈ రకం నవలలకే తలమానికమై ఉండేది.

— కొంగర గంగాధరరావు
నిజామాబాద్

## ఇదికాదు ముగింపు

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

'దేవుళ్ళకి దేవదాసీలు, మనుషులకి ఉంపుడు కత్తెలు రద్దు' అని విజయనగర రాజులనాడే శాసనాలు చేసినా మనుషుల మనస్సులో మార్పు లేకపోవడం మూలాన పూర్వం ఒక వీధికి, ఒక కులానికి పరిమితమైన వేశ్యావృత్తి ఇప్పుడు ఎక్కడపడితే అక్కడ కనిపిస్తుంది. ఇది సమాజానికి పట్టిన రాచపుండు. దీన్ని కథావస్తువుగా తీసుకున్నపుడు రచయిత చాలా జాగ్రత్తగా రాయాలి.

సైకియాట్రీ, సైకోథెరపీ అభిమాన విషయాలుగావుండి, రెండుతరాలు కూర్చునితిన్నా తరగని ఆస్తివున్నవాడు చంద్రం. రేఖ తన మనస్సుని ఆకట్టుకుందుకు ఆమె అందం కారణంకాదు అని తననితాను మోసం చేసుకుని చివరికి మామూలు మగాడిలాగే ప్రవర్తించాడు. ఆదర్శాలు ఆచరించడం వల్లించినంత సులువుకాదు. శాస్త్ర దృష్ట్యా పరిశోధన చెయ్యడానికి, ఉద్ధరించడానికి అతనికి రేఖే దొరికిందా? అలాంటివాళ్ళు బోలెడుమంది వుంటారు. వాళ్ళకి ఉచితంగా వైద్యం చెయ్యవచ్చు. వాళ్ళకి జీవనోపాధి చూపించవచ్చు. తరగని ఆస్తి తనకి ఉందికనుక. ఎవరైనా ముందుకి వచ్చిన యువకులతో వాళ్ళకి పెళ్ళిళ్ళు జరిపించవచ్చు సంస్కరణాభిలాష వుంది కాబట్టి. కాని అతను ఇందులో ఏదీ చేయడు.

యవ్వనం వచ్చినప్పటినుంచీ వేశ్యావృత్తిలో వుంటూ, ఎన్నో చేదు అనుభవాల్ని చవిచూచిన రేఖ తనకి కొన్నాళ్ళు వైద్యంచేసినంత మాత్రాన అతను "ఐలవ్‌యు" అనగానే ఒళ్ళు మరిచిపోతుంది. ఏమాత్రం వివేకం ఉన్నట్టు ప్రవర్తించదు. తర్వాత మాత్రం 'కార్లే

మీ అమ్మగారి పక్కన కూర్చోబెట్టుకుని తీసుకు వెళ్తారు కదూ!' అంటూ చాలా తెలివిగా చాలా విషయాలు అడుగుతుంది.

పాత్రల చిత్రీకరణలో, ముగింపు విషయంలో రచయిత పరాజయం పొందినట్టే అనిపిస్తుంది. చదివే వాళ్ళకి స్ఫూర్తి, చైతన్యం కలిగించి కొంతమందైనా వాళ్ళ జీవితాల్ని బాగు చేసుకోడానికి లేక బాగుచెయ్యడానికి సాహిత్యం ఉపయోగపడాలి. కాని ఒకసారి ఆ ఊబిలోకి దిగితే మరిపైకి రావడం అనేదే ఉండదు అన్న అభిప్రాయాన్ని కలిగించి నిరాశ పరిచేలావుంది నవల. వాస్తవానికి దూరమైనా సరే ముగింపు మరోలావుంటే బాగుండేది.

— అయ్యల సోమయాజుల రాధాకృష్ణ
కాకినాడ.

## సహజ 'చిత్రం'

(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)

స్త్రీని విలాసవస్తువుగా మార్చిన నేటి సమాజపు స్థితిగతుల్ని స్పష్టపరుస్తున్నదీ నవల. బ్రోతల్స్ జీవిత పరిణామాలను గూర్చిన సహజచిత్రీకరణ జాలిగొలిపేలా ఉన్నా కథలోని కొన్ని సంఘటనలు, పైగా ముఖ్యపాత్రల ప్రవర్తన, మలచిన తీరు అసహజంగా ఉంది. పడుపు వృత్తి చేసుకునే వాతావరణంలో పెరిగి, ఆ వృత్తినే స్వీకరించే మనోహరి పరిణతి చెందిన ఆమె అసహజపు ఆలోచనలు ఆ పాత్రను ఇరుకునపెట్టాయి. ఆమెను పేషెంట్‌గా చూస్తూ ఆకర్షణలోపడి, చనువు పెంచుకున్న డాక్టర్ చంద్రశేఖర్‌పై ఆశలు పెంచుకుని పాఠకులదృష్టిలో అత్యాశపరురాలిగా మిగిలింది.

అందం, చదువు, ధనంతోపాటు అతన్ని ప్రేమిస్తూ అతనికై అన్ని సరదాలు వదిలేసుకున్న సుమలత నచ్చకపోవడం, వ్యాధిగ్రస్తురాలైన మనోహరికోసం ప్రాకులాడటం- ఇటువంటి హీరోగా డాక్టర్ చంద్రశేఖర్‌ను ప్రవేశపెట్టి, అతనికి ఆదర్శభావాలు అంటగట్టి ఏదో చేయబోయారుకాని, అందరు మగవాళ్ళలాగే ఆమె శరీరాన్ని వాడుకోవటంతో అతని పాత్ర ఔచిత్యం దెబ్బతిన్నది. ఒక వ్యభిచారిణిని పెళ్లి చేసుకునే ధైర్యం నగటు మగవాడైన అతనికిలేదు. వారి సంగమం గుర్తుగా 'దశమి' పాత్రను ప్రవేశపెట్టినా ఆ పాత్ర ప్రత్యేకత ఏమీలేదు.

మనోహరిలాంటి పతితలను ఉద్ధరించే ప్రయత్నం ఎవరూ చేయటంలేదు. చివరకు ఈ నవలలో కూడా మనోహరి 'ఊబి'వంటి పడుపు వృత్తి మూలంగానే బలైపోయింది. ఫలితం... ప్రజల ఉద్రిక్తత మూలంగా ధ్వంసం చేయబడ్డ పోలీస్‌స్టేషన్. అంతే... ఈ వ్యవస్థలో, ఈ సమాజంలో బాధా సర్పద్రష్టులైన స్త్రీల జీవితాలకు పరిష్కారం లేదా? ఒక మంచి సబ్జెక్టు ఎన్నుకొని రాసిన రచయిత ముగింపులో తగిన పరిష్కారం చూపించకుండా పాఠకులు అసంతృప్తికి గురయ్యేలా చేశాడు.

—వై. భారతి
సిరిసిల్ల.

## అభాగినులకు అద్దం

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

సమాజంలోని చీకటి కోణాల్లో దౌర్భాగ్య జీవితాలు గడుపుతున్న వ్యభిచారిణుల వాస్తవిక జీవన చిత్రణ సమగ్రంగా గోచరిస్తుందీ నవలలో. కానీ, రేఖను ఆరోగ్యవంతురాల్ని చేసిన తర్వాత ఆమె జీవితానికి శాశ్వత పరిష్కారం చూపక పదివేల డ్రాఫ్ట్‌తో సరిపెట్టజూడటం ఎంతో ఉత్కంఠతో చదివే పాఠకులకు అసంతృప్తి కలిగించింది.

సుమలత, మంగపతి, చందూ, అగ్రాజైలర్, సునందలాంటి పాత్రలు చిన్నవైనా సహజంగానూ, వాస్తవికంగానూ చిత్రించబడ్డాయి. అయినా చివరన టీకొట్టు పెట్టుకొని నిర్మలంగా బతుకీడుస్తున్న విమల పోలీసుల చేతిలో రేప్ చేయబడి చావడం, "ఇటువంటి అభాగినుల జీవితాల ముగింపు ఇంతే" అనేట్లుగా ముగియడం మాత్రం ఆనందాన్ని కలిగించదు.

ఏదేమైనా సమాజపరంగా వెలుగుకు నోచుకోక అలమటిస్తున్న అభాగినుల జీవితాలకు అద్దంపట్టిన చక్కని నవల ఊబి.

— బి. పురుషోత్తమరావు
వడూర్.

# చతుర

సంపుటి: 10　　ఆగస్ట్ '87　　సంచిక: 7

## ఈ నెల సమగ్ర నవల

"మగ పుటక్కీ, మీ దిగులుకీ సంబంధమేమిటండీ! ఇప్పుడు మీకేం తక్కువైందని బాధపడుతున్నారు?" అన్నాడు ఆనంద్.

"దిగులు కాకేముందండీ... అర్జంటుగా డబ్బుకావాలని నా మొలతాడు తీసుకెళ్లి తాకట్టు పెట్టుకున్నారు మావారు. పక్క వీధిలో మా బంధువులు రేపు పేరంటానికి రమ్మన్నారు. ఈ వసుపుతాడుతో ఎలా వెళ్లేది? ఎంత అవమానం? వీధిలోకి రావాలంటేనే సిగ్గేస్తోంది" అంటూ కంట తడిపెట్టుకున్నాడు ప్రసాద్.

మగడు తాళిబొట్టు తీసుకెళ్లి తాకట్టు పెట్టుకొంటే ఆడవాళ్లు ఏడవటం మామూలే. మరి పెళ్లాం తన మొలతాడు తాకట్టు పెట్టిందని ఏడ్చే మగవాళ్లు ఏ లోకంలో ఉన్నారు?

ఆనంద్ ఆ వింతలోకంలోకి ఎలా వెళ్లాడు?

అతనికి ఎదురయిన అనుభవాలేమిటి?

సరదా సరదాగా నవ్విస్తూనే సీరియస్‌గా ఆలోచింపజేసే పి.యస్.వి. ప్రసాద్ రచన 'ప్రమదావని' ఈ నెల 'చతుర' సమగ్రనవల. ఈనాటి మన సమాజంలోగల ద్వంద్వ నీతిని సున్నితంగా విమర్శిస్తూనే కడుపుబ్బ నవ్వించేలా రూపొందించిన 'ప్రమదావని' 'చతుర' నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన సరికొత్త తరహా నవల.

'సామాజిక సమస్యలను చర్చించటమేగాక, వాటికి సరి అయిన పరిష్కారాన్ని కూడా సూచించగలిగేదే సాహిత్యం' అని నమ్మే పి.యస్.వి. ప్రసాద్ తన తొలి రచన 'ప్రమదావని' తోనే సాహిత్య రంగంలోకి విజయవంతంగా అడుగుపెట్టారు. గుంటూరులో పుట్టిపెరిగిన శ్రీ ప్రసాద్ ప్రస్తుతం చిలకలూరిపేట నుండి రంగనాయకులు కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.



రాత్రి తొమ్మిది గంటలైంది. చీకటికి తోడన్నట్లు ఆకాశం మేఘావృతమైంది. గాలి, వాన కలిసికట్టుగా భూమ్మీద దాడి ప్రారంభించాయి. కరెంటు పోవడంతో కొవ్వొత్తి వెలిగించి కిటికీ తలుపులన్నీ బిగించి తన ఆరునెలల పాప పక్కన పడుకుంది పార్వతి. ప్రకృతి భీభత్సానికి భిన్నంగా అతి ప్రశాంతంగా ఉన్న పాప ముఖంచూసి తృప్తిగా నిట్టూర్చిందామె.

హఠాత్తుగా ఆకాశాన్ని చీల్చుకుని భూమిని బద్దలుచేయడానికన్నట్లు ఫెళ ఫెళ విరుచుకు పడిన పిడుగుపాటుకు అదిరిపడి కళ్ళు తెరిచింది ఆ చిన్నారి పాప. పక్కనే పడుకున్న తల్లిని, అభయమిస్తున్నట్లుగా జోకొడుతున్న చేతిని ఒకసారి చూసి మళ్లీ నిద్రలోకి జారుకుంది.

పార్వతికి అర్థంకాని ఆలోచనలతో మనస్సంతా చికాగ్గావుంది. తల నొప్పిగా వుంటే లేచివెళ్ళి కణతలకు అమృతాంజనం పట్టించింది. నిద్రమత్తుతో రెప్పలు బరువుగా మూతలుపడుతుంటే ఆపుకోవటానికి బలవంతాన ప్రయత్నించసాగింది.

తొమ్మిది దాటందే సాధారణంగా ఆనంద్ ఇంటికి రాడు. మరి ఇప్పుడు వర్షం మూలంగా అతనెప్పటికొస్తాడో ఊహించటం కష్టంగా వుంది. పోనీ నిద్రపోదామంటే అతను తలుపు తట్టగానే లేచి తలుపులు తెరవకపోతే పెద్ద రభసవుతుంది. ప్రతి చిన్న విషయానికి అనవసరంగా గొడవపెట్టుకుని తిట్టటం, హేళనగా మాట్లాడటం అతని తత్వం. అర్థరాత్రి పూట ఆ గొడవ భరించే ఓపిక పార్వతికి లేదు.

నిద్రపోతున్న పాపవంక మరొకసారి చూసి లేచి తలుపులు తీసుకొని వరండాలో నిల్చుంది పార్వతి. రివ్వున వీచే చల్లని ఈదురుగాలి శరీరాన్ని వణికించింది. గాలితెమ్మెర మోసుకొచ్చిన నీటితుంపరలు ముఖం మీదపడి వళ్ళు పులకరించింది.

వర్షపు జల్లుకి తడుస్తున్న కాళ్ళుతుడుచుకునే పట్టాని వెనక్కు జరిపి వీధివంక చూసింది.

వీధి దీపాలు వెలగటం లేదు. చిమ్మచీకటిగా వుంది. చుట్టుపక్కల ఇళ్ళలోని కొవ్వొత్తుల వెలుతురు కిటికీల గుండా గుడ్డిగా కనబడుతోంది. చీకటినీ, వర్షాన్నీ లెక్కచెయ్యకుండా ఒకారు రోడ్డుమీద సర్రున దూసుకుపోయింది. కారు హెడ్‌లైట్ల కాంతితో వెలిగిన రోడ్డు మళ్ళీ చీకటిలో అదృశ్యమైంది.

పార్వతి చలిగాలికి వణుకుతూ గోడకానుకుని రోడ్డువంక చూసింది. ఆనంద్ వస్తున్న జాడలేదు. అయినా ఆ వర్షంలో ఆనంద్ స్కూటర్‌మీద రావటం అసాధ్యం. పూర్తిగా తడిసి ముద్దైపోతాడు. వాన తగ్గేట్టులేదు. అసలు అతను వస్తాడో రాడో నమ్మకం లేదు. వెళ్ళి పడుకుని నిద్రపోతే బాగుండుననిపించింది పార్వతికి.

రాత్రిపూట ఒక్కతే ఇంట్లో బిక్కుబిక్కుమంటూ వుండటానికి భయంగా వుందనీ, పెందలాడే ఇంటికి రమ్మనీ చాలాసార్లు నచ్చజెప్పటానికి ప్రయత్నించింది. కానీ ఆనంద్ ఆమె మాటల్నెప్పుడూ లక్ష్యపెట్టలేదు. ఆమె పిరికితనాన్ని గురించి అవహేళనగా మాట్లాడేవాడు.

కళ్ళు మిరుమిట్లు గొల్పుతూ మెరిసిన మెరుపు కాంతిలో రోడ్డుమీద ఇంటి గోడవారగా ఏదో నల్లని ఆకారం అస్పష్టంగా కనబడింది. ఒళ్ళు ఝల్లుమంది పార్వతికి. భయంతో గుండెలు గుబగుబలాడాయి. రెండంగల్లో లోపలికొచ్చి తలుపులు గడిపెట్టింది. కిటికీలోంచి బయటకు చూద్దామనిపించినా భయం మూలంగా ఆ ప్రయత్నాన్ని విరమించుకుని పాప పక్కన పడుకుంది.

కొవ్వొత్తి వెలుగులో నిశ్చలంగా నిద్రపోతున్న పాప పెదవుల మీద విరిసిన చిరునవ్వు గమనించింది. హఠాత్తుగా ఆమె హృదయం తెలియని బాధతో బరువెక్కింది. చీకూ చింతాలేని బాల్యం ఎంత మధురమైనదీ!

తన బాల్యం కూడా ఎంత ఆనందంగా గడిచిపోయింది. ఆరోజులు తిరిగివస్తే ఎంత బాగుంటుంది. తల్లిదండ్రుల ఆప్యాయత, అన్నయ్యతో స్నేహితులతో ఆడిన ఆటలు, పాడిన పాటలు, స్కూల్లో కాలేజీలో చదివినరోజులు, స్నేహితురాళ్ళతో కలిసి భవిష్యత్ జీవితాన్ని గురించి కన్నకలలూ, ఒక్కక్షణం మదిలో

మెదిలాయి.

ఆ స్వేచ్ఛ, ఆ ఆనందం, ఆ బంగారు కలలు ఏమయ్యాయి? మూడు ముళ్ళ ఉచ్చులో బిగిసి ఊపిరాడక నలిగి మాయమయ్యాయా? రెండు సంవత్సరాలకాలం తనలో ఎంతమార్పు తీసుకొచ్చిందో!

చిన్నతనం నుంచీ వాగుడుకాయని పేరుపడ్డ తనిప్పుడు నోరు తెరవటానికే భయపడుతోంది. స్నేహితురాళ్ళతో కాలేజీకి, సినిమాలకీ, షికార్లకీ ఒక్కక్షణంకూడా తీరికలేకుండా తిరిగిన తనిప్పుడు గడపదాటి అడుగువెయ్యటానికి ధైర్యం, స్వేచ్ఛ లేకుండా పంజరంలో బంధించబడింది. ఇంటెడు చాకిరీ చేసి, పిల్లల్ని కనిపెంచటానికేనా ఈ పెళ్ళి?

మంచిమొగుళ్ళు దొరికారనుకున్న ఆడవాళ్ళ జీవితాల్లో మటుకు ఇంతకంటే ఏముంది? కాకపోతే తిట్లూ తన్నులూ వుండవు. వాటి బదులు చీరలు, నగలు, సినిమాలు, అమ్మలక్కలతో పిచ్చాపాటి.

ఇంత విశాల ప్రపంచంలో ఆడదాని జీవితం ఈ అల్పమైనవాటికే మురిసి, ఇదే స్వర్గమని భావించటం ఎంత హీనం!

అప్రయత్నంగా పార్వతి కళ్ళు చెమ్మగిల్లాయి. తలనొప్పి మరింత ఎక్కువైంది. వంటగదిలోకెళ్ళి స్టవ్ ముట్టించి నీళ్ళు పెట్టింది. ఆనంద్ వచ్చేసరికి కరెంట్ రాకపోవచ్చు. హీటర్ పనిచెయ్యకపోతే స్నానానికి వేడి నీళ్ళుండవు. నీళ్ళు కాయకపోతే ఆనంద్ తిట్లు భరించాలి. నీళ్ళు కొంచెం వెచ్చబడ్డాక వత్తులు తగ్గించి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది.

ఆకలిగావున్నా అన్నం తినబుద్ధి కాలేదు. టైమ్ పదకొండు గంటలైంది. ఆనంద్ జాడలేదు. బయటికెళ్ళి చూసే ధైర్యం లేదు. ముందుగదిలో తలుపు వారగా చాపపరచి మెత్తగా వుండటానికి రెండు దుప్పట్లు మధ్యకి మడిచివేసి పాపను తెచ్చి పడుకోబెట్టి తనూ పడుకుంది.

బయటినుంచి సన్నగా గాలిహోరు, వర్షం చప్పుడూ వినబడుతున్నాయి. అలసిన తనువు, మనస్సు నిద్రలోకి జారుకున్నాయి. కొవ్వొత్తి నెమ్మదిగా కరిగి ఆరిపోయింది. చీకటి ఒడిలో తల్లీకూతుళ్ళు ఆదమరచి నిద్రించసాగారు.

ఉన్నట్లుండి తలుపులు దబదబ మోగటంతో ఉలిక్కిపడి లేచింది పార్వతి. కరెంటు ఎప్పుడు వచ్చిందోగాని ట్యూబ్‌లైట్ వెలుగుతోంది. పవిట సర్దుకొని తలుపు గడియతీయబోయింది పార్వతి. మళ్ళీ ఆగి అనుమానంలో పడింది.

తలుపు తడుతున్నదెవరు? ఆనందేనా? అంతకుముందు గోడవారగా చీకట్లో చూసిన ఆకారం గుర్తుకొచ్చి భయపడింది.

"ఎవరది?" బిగ్గరగా అరిచింది పార్వతి.

"నేనేలే... తలుపు తెరిచిచావు" అసహనంగా ధ్వనించింది బయటిగొంతు.

ఆ స్వరం ఆనంద్‌దే.

తలుపు గడితీసి పాపను ఎత్తుకెళ్ళి బెడ్‌రూమ్‌లో పడుకో పెట్టింది. ఆనంద్ మౌనంగా బట్టలు మార్చుకుని తడిచిన తలని తువ్వాలతో తుడుచుకుంటున్నాడు. బయట వర్షం తగ్గలేదు.

"వేడి నీళ్ళున్నాయి. స్నానం చేద్దురుగాని రండి" అన్నది పార్వతి ఆవులింతను ఆపుకుంటూ.

"అక్కర్లేదు. ఇప్పుడు స్నానం చెయ్యను" అన్నాడు ఆనంద్ అటువంక చూడకుండానే.

"భోజనం....?"

"తినొచ్చాలే!" అతని మాటలు ముద్దగా వున్నాయి. మనిషి తూలుతున్నాడు.

అతని పరిస్థితి అర్థమైంది పార్వతికి. ఆ సమయంలో అతన్ని ఎక్కువగా మాట్లాడించటం ప్రమాదమని ఎన్నోసార్లు అనుభవపూర్వకంగా తెలుసుకుంది. మౌనంగా వంటింట్లోకెళ్ళి నీళ్ళు దించి స్టవ్ ఆర్పింది. ముందుగది తలుపువేసి లైట్‌తీసి బెడ్‌రూమ్‌లోకెళ్ళింది. బెడ్‌లైట్ వుంచి పాప పక్కన మంచంమీద పడుకుంది.

"దాన్నెవరూ ఎత్తుకుపోరుగాని ఇటురా" అన్నాడు ఆనంద్.

అతని గొంతు కర్కశంగా వుంది. కళ్ళలో ఎరుపుజీరలు బెడ్‌లైట్ కాంతిలో కూడా స్పష్టంగా కనబడుతున్నాయి. అతన్ని చూస్తుంటే

# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి



# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

### ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

### బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పియన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూరోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట ఏలూరు.

డబ్బుకోసమేనా మీ చింత! మార్గదర్శి ఉన్నది మీ చెంత!!

## మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిడ్స్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-3

భయం వేసింది పార్వతికి.

"ఇవ్వాళ ఇక్కడ పడుకుంటానండి... వంట్లో బాగుండలేదు..." అస్పష్టంగా గొణిగింది.

"చెముడా ఏం? చెబుతున్నది నీకే! ఇట్రా" అసహనంగా అరిచాడు ఆనంద్.

"ప్లీజ్... తలనొప్పిగా వుందండి. మీరు నిద్రపోండి" అర్థించింది పార్వతి.

"తిన్నదరక్కపోతే తలనొప్పేవస్తుంది" లేచి జబ్బపట్టుకులాగాడు.

పార్వతి మనస్సు చివుక్కుమంది. అన్నం తిన్నదో లేదో ఆప్యాయంగా కనుక్కోవలసిన భర్త అట్లా మాట్లాడితే ఏభార్య మటుకు నొచ్చుకోదు? నెమ్మదిగా అతని పట్టునుండి విడిపించుకోవాలని ప్రయత్నించింది. వీలుకాలేదు. అభ్యర్థనలు, కన్నీళ్ళు అతన్ని కరిగించలేవు. కోపాన్ని, దుఃఖాన్ని దిగమింగి మౌనంగా కళ్ళు మూసుకొని అతనికి లొంగిపోయింది పార్వతి.

"మంచినీళ్ళు పట్టుకురా" సగం నిద్రలోకి జారుకుంటూనే అరిచాడు ఆనంద్.

యాంత్రికంగా లేచివెళ్ళి కూజాలో నీళ్ళు గ్లాసులోకి ఒంపుకొని వచ్చింది పార్వతి. మంచంమీద లేచి కూర్చుని గ్లాసందుకున్నాడు ఆనంద్.

"వెధవ నీళ్ళు! చల్లని నీళ్ళు తాగే గతి కూడా లేదు. ఒక ఫ్రిజ్‌కోసం ఆర్నెల్లుగా అడుగుతున్నా దిక్కులేదు. నేనేం ముష్టడుగుతున్నాననుకుంటున్నాడా మీబాబు?" ఖాళీ గ్లాసు విసిరేస్తూ అరిచాడు ఆనంద్.

ఆ మోతను ఉలిక్కిపడింది పాప. పార్వతి మనస్సు కోపంతో ఉడికిపోయింది.

"అంత మాటలెందుకులెండి. వీలుచూసుకుని కొంటానన్నారు" కొంచెం కోపంగానే అన్నది.

ఆనంద్ ముఖం జేవురించింది. కళ్ళు మరింత ఎరుపెక్కాయి. తనమాటకు భార్య ఎదురు చెప్పటం సహించలేని మనస్తత్వం అతనిది. ఆ విషయం పార్వతికి తెలిసినా కోపంలో నిగ్రహించుకోలేకపోయింది.

"ఏం తిక్కతిక్కగా వుందా? నాక్కావాల్సినవి పట్టించుకోవుగాని మీ బాబుని వెనకేసుకురావటం బాగా చేతవును" వెటకారంగా ధ్వనించాయి అతని మాటలు.

మాటలు పెంచటం అనవసరమని తెలిసినా ఏదో తెలియని ఆవేశం, అసహనం పార్వతిని ఆవహించాయి.

"తిక్కతిక్కగా వుంటానికి నేనేమీ తాగిలేను. బోడిఫ్రిజ్ కూడా కొనుక్కోలేని..."

ఆమె మాటలు పూర్తిగా వినబడనీకుండా ఓ మేఘం భయంకరంగా ఘర్జించింది.

బలమంతా ఉపయోగించి ముందుకు విసిరిన అతని చెయ్యి ఆమె చెంపను ఛెళ్ళుమనిపించింది.

చిట్లిన పెదవినుంచి వెచ్చని రక్తం వుబికింది.

కళ్ళు బైర్లుకమ్మి స్పృహకోల్పోయి నేలకొరిగిందామె.

బిడ్డ ఏడ్పు అచేతనావస్థలోవున్న ఆ తల్లిప్రేగును కదిలించింది. మెల్లగా కళ్ళు విప్పిచూసింది పార్వతి. ఒక్కక్షణం ఆమెకు తన పరిస్థితి అర్థంకాలేదు. మండుతున్న పెదవి, కమిలిన చెంప కలిగించే బాధ ఆమెకు జరిగిన వాస్తవాన్ని గుర్తుతెచ్చాయి.

శక్తినంతా కూడగట్టుకొని నెమ్మదిగా లేచి పాపని ఒళ్ళోకి తీసుకుంది. తన ఆకలితప్పు తల్లి బాధని అర్థం చేసుకోలేని ఆ పసికందు గుక్కపట్టి ఏడుస్తోంది. వాళ్ళిద్దర్నీ పట్టించుకోని ఆనంద్ గురకపెట్టి నిద్రపోతున్నాడు. మృగంకన్నా క్రూరంగా ప్రవర్తించే మొగుడనే ఆ మగవాడివంక అసహ్యంగాచూసి బిడ్డ ఆకలి తీర్చటానికి పాపని గుండెలకదుముకుంది పార్వతి.

అవమానభారంతో ఆమె హృదయం భగ్గున మండిపోతోంది. ఏమీ చెయ్యలేని నిస్సహాయత ఆమె నయనాల్ని సజలం చేసింది. తనేం చెయ్యాలి? ఏం కావాలి తన బతుకు? యాంత్రికంగా భర్త కోర్కెలు తీరుస్తూ, అతని కోపాన్ని, చేసే అవమానాలను సహిస్తూ, ఏ పండక్కో పబ్బానికో కొని ముఖానకొట్టే చీరనో, నగనో చూసి మురిసిపోతూ జీవితాన్ని వెళ్ళబు

చ్చాల్సిందేనా? అంతకంటే ఏం చెయ్యగల దు? అట్లాంటి జీవితంకంటే చావునయం కదూ!

కాని చచ్చి సాధించేదేముంది? చావే పరిష్కార మైతే దేశంలోని ఎంతమంది స్త్రీలు చావాలి? ఊఁహు... తను చావకూడదు. అతనికి విడాకు లిస్తేసరి పీడ వదుల్తుంది.

లోకులు కాకుల్లా పొడుస్తారు.

కాని ఇప్పుడు భరిస్తున్న బాధకన్నా అది భరించటం కష్టమేమీ కాదు. అయితే విడాకు లవల్ల ఒరిగేదేముంది? ఎంచక్కా మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడతను. తను అనుభవిస్తున్న బాధ లు మరో స్త్రీకి కలుగుతాయి. నో... అలా జరగటానికి వీల్లేదు. తను మరో స్త్రీకి ద్రో హంచెయ్యకూడదు.

మరి సమస్యకు పరిష్కారం? సమస్యకు మూలమైన ఆ వ్యక్తి లేకుండా వుండటమే! భర్త చావుని తను కోరుకుంటుందా? అటు వంటి ఆలోచన పార్వతికి భయం కలి గించింది. నిద్రపోతున్న భర్తవంక చూసింది. ఆమెలో అతనిపట్ల ఏమాత్రం జాలి కలుగలే దు. ఏం చెయ్యాలితన్ని?

హఠాత్తుగా పార్వతికి తన స్నేహితురాలైన శాంతి గుర్తొచ్చింది. అవును... తన బాధలన్నీ విన్న శాంతి, ఆనంద్‌ను వదిలి తనతోపాటు వచ్చెయ్యమని చాలాసార్లు చెప్పింది. ఆమె ఆహ్వానంలో ఎలాంటి దురుద్దేశం లేదు. తన ప్రాణస్నేహితురాలు తన కపకారం చేస్తుందా? ఏదో దృఢనిశ్చయానికొచ్చినట్లు లేచి నిలబ డింది పార్వతి. కడుపునిండి నిద్రలోకి జారుకు న్న పాపను పడుకోబెట్టి ముందు గదిలోని ఫోన్ దగ్గరకెళ్ళింది.

అంత రాత్రివేళ తను ఫోన్‌చేస్తే అవతల రిసీవ్ చేసుకుంటారో లేదోననే అనుమానం కలిగినా నంబర్ డయల్‌చేసి రిసీవర్ చెవిద గ్గర పెట్టుకొని వినసాగింది. అవతల ఫోన్ రింగ్‌అవుతున్న శబ్దం స్పష్టంగా వినబడు తోంది. క్షణాలు దొర్లిపోతున్నాయి. రిసీవర్ ఎవ రూ ఎత్తటం లేదు. రాత్రిళ్ళు కూడా వాళ్ళ హాస్టల్‌కి ఫోన్‌చేసే అవకాశముంటుందని శాంతి చెప్పింది.

మరి ఈరోజు ఆపరేటర్ రాలేదా లేక నిద్ర పోతోందా? రిసీవర్ పెట్టేసి మళ్ళీ డయల్‌చే సింది. మళ్ళీ ఫోన్ రింగ్ అవుతున్న మోత వినబడింది. ఉన్నఒక్క అవకాశాన్ని ఆమె వదులుకోదల్చలేదు. అలానే రిసీవర్ చెవికా న్చి కుర్చీలో కూర్చుని ఓపిగ్గా ఎదురుచూడసా గింది. ఐదు నిమిషాలు ఐదు యుగాల్లా గడి చాయి. హఠాత్తుగా అవతలి ఫోన్ కనెక్టయింది. పార్వతి గుండె ఒక్కక్షణం కొట్టుకోవటం మానే సింది.

"హలో! దిసీజ్ ఉమెన్స్ హెూమ్. ఆపరేటర్ యట్ యువర్ సర్వీస్" అవతలి నుండి ఆపరేటర్ నిద్రమత్తు పూర్తిగా వదిలించుకో కుండానే అన్నది.

"హలో! దయచేసి శాంతిగార్ని పిలి పిస్తారా? ఈ సమయంలో మీకు ఇబ్బంది కలిగిస్తున్నాను. కానీ చాలా అర్జంటుగా మాట్లా డాలి" ఆత్రుతగా అన్నది పార్వతి.

"మీ పేరు?" నిద్రమత్తు వదలిన ఆపరే టర్ కుతూహలంగా అడిగింది.

"పార్వతి పిలుస్తోందని చెప్పండి"

"ఓకే... ప్లీజ్ హేంగ్ ఆన్"

మళ్ళీ ఓపిగ్గా ఎదురుచూడసాగింది పార్వతి. మధ్యలో ఓసారి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి చూసింది. ఆనంద్ ఈ లోకంలో లేడు. పాప ప్రశాంతంగా నిద్రపోతోంది. మనస్సులో కలుగు తున్న ఉద్వేగాన్ని భరించటం ఆమెకు కష్టంగా వుంది. మరో ఐదు నిమిషాలకు ఫోన్ కనక్టయింది.

"హలో... పార్వతీ!"

శాంతి గొంతును గుర్తుపట్టిన పార్వతి భారంగా నిట్టూర్చింది.

"శాంతీ! నాకు సహాయపడగలవా?" నెమ్మ దిగా అన్నది.

"ఏయ్ పార్వతీ... ఏమయింది? సహాయమే మిటి?"

"ప్లీజ్ శాంతి... ప్రామిస్‌మి. నాకు సహాయం చెయ్యవా?" అత్యంత దయనీ యంగావుంది ఆమె స్వరం.

"ఓ.కే... ప్రామిస్. నీకోసం నాప్రాణాలయినా ధారపోస్తాను. అసలు విషయమేమిటో చె

ప్పు?''

''నేను... నేనీ నరకంలోనుంచి బయటపడాలి శాంతీ! ఇప్పుడే... ఈ క్షణమే! నువ్వు ఆహ్వానించినప్పుడల్లా నేను సందేహిస్తూ వచ్చాను. ఇప్పుడు నాకేసందేహాలూ లేవు. నాకే బంధాలూ, మమతలూ అక్కర్లేదు. నేను నేనుగా, మనిషిగా, స్వేచ్ఛగా జీవించాలి. చెప్పు... నాకు సహాయం చెయ్యగలవా?'' మహోద్వేగంగా మాట్లాడింది పార్వతి.

''డోంట్‌బి ఎక్సయిటెడ్! టేకిట్ ఈజీ! నువ్వు ఆనంద్‌ని వదిలేసి మాలో కలిసిపోవాలనుకుంటున్నావు... అంతేగా?'' లాలిస్తూ అడిగింది శాంతి.

''అవును... ఖచ్చితంగా అంతే!''

''ఆల్‌రైట్. కావాల్సిన ఏర్పాట్లు చేస్తాను. దేశంలో ఏ మూల ఏ స్త్రీ సహాయం కావాలని అడిగినా మేం సిద్ధంగావుంటాం. ఓ గంటలో మీ ఇంటికి కార్లో వస్తాను... సిద్ధంగావుండు. ఇంకేమైనా వుందా?''

ఓక్షణం ఆలోచించి నెమ్మదిగా అన్నది పార్వతి.

''వీలైతే ఆనంద్ మరే స్త్రీ జోలికీ వెళ్ళకుండా మంచి గుణపాఠం నేర్పాలి''

''ఆనంద్ ఇంట్లోనే వున్నాడా?'' పార్వతి కోర్కెవిని నవ్వుకుంటూ అడిగింది శాంతి.

''ఉన్నాడు. తాగిన మైకంలో వళ్ళు తెలియకుండా నిద్రపోతున్నాడు''

''వెరీగుడ్! అతని విషయం నాకొదిలెయ్. నువ్వు మాత్రం సిద్ధంగావుండు. నేను బయల్దేరుతున్నా!'' అవతలి ఫోన్ డిస్‌కనెక్టయింది.

ఫోన్ పెట్టేసి కుర్చీలో కూలబడి ఎందుకో తనకే తెలియకుండా వెక్కి వెక్కి ఏడ్చింది పార్వతి. పావుగంట తర్వాత మనస్సు కాస్త కుదుటపడ్డట్లయింది. నెమ్మదిగా లేచివెళ్ళి చన్నీళ్ళతో స్నానం చేసింది. ఓ సూట్‌కేస్‌లో తన బట్టలు, పాపబట్టలు సర్దింది. పుట్టింటివాళ్ళు పెట్టిన బంగారు నగలన్నీతీసి మూటకట్టి బట్టల అడుగున పడేసింది. ఓ కాగితం తీసుకొని ఉత్తరంరాసి బెడ్‌రూమ్‌లోని టేబుల్‌మీద పెట్టింది. సూట్‌కేస్ ముందు గదిలో పెట్టి పాపను ఎత్తుకొచ్చి కుర్చీలో కూర్చుని వళ్ళో పడుకోబెట్టుకుంది. ఏ ఆలోచనలూ లేకుండా ప్రశాంతంగా స్నేహితురాలి కోసం ఎదురుచూడసాగింది.

★ ★ ★

కొండచిలువలా వంపులుతిరిగిన ఘాట్‌రోడ్డుమీద వేగంగా జీప్ డ్రైవ్ చేస్తున్నాడు ఆనంద్. పైకివెళ్ళేకొద్దీ గాలి మరింత చల్లగా అతని శరీరాన్ని తాకసాగింది. అందమైన ప్రకృతి కనులకు విందుచేస్తోంది. ఒకదానితో ఒకటి పోటీపడి ఆకాశాన్నందుకోవటాని కన్నట్లు ఏపుగా పెరిగిన రకరకాల చెట్లు, సూర్యకిరణాలకుసైతం సందివ్వకూడదన్నట్లు దట్టంగా అలముకున్న పొదలూ, కాలాన్ని వెక్కిరిస్తూ కదలక మెదలక నిబ్బరంగా నిల్చిన పర్వతశ్రేణులూ, ప్రపంచంలోని స్వేచ్ఛంతా తమ సొంతమేనన్నట్లు రెక్కలువిప్పి నింగికెగసే పక్షులూ, నాగరిక ప్రపంచానికి కరువైన ప్రశాంతత-- రాక్షసులకు కూడా సాధుతత్వం సంతరింపజేసేటట్లుగా వుంది అనంతగిరి ప్రకృతి.

అంతటి ఆహ్లాదకరమైన వాతావరణం కూడా ఆనంద్ మనస్సుకు ఏమాత్రం ఊరట కలిగించటంలేదు. అతని ఆలోచనలన్నీ పార్వతి గురించే. ఆలోచించేకొద్దీ అతనిలో కోపం, అసహనం మరింత పెరగసాగాయి. ధైర్యంచేసి పార్వతి అలా వెళ్ళిపోవటం అతని అహాన్ని బాగా దెబ్బతీసింది.

ఒక ఆడది, అందులో కట్టుకున్న పెళ్ళాం తనని లక్ష్యపెట్టకుండా వెళ్ళిపోవటం భరించలేని అవమానంగా తోచింది. ఏవిధంగానైనా ప్రతీకారం తీర్చుకోవాలని తీవ్రంగా ఆలోచించసాగాడు. పురుషాధిక్య సమాజంలో స్త్రీని తన చెప్పుచేతల్లో వుంచుకోవటానికి, కాళ్ళదగ్గరకు రప్పించుకోవటానికి పురుషునికి రెండు ఆయుధాలున్నాయి. ఒకటి విడాకులు, రెండు పిల్లలు. ఆ రెండు ఆయుధాలూ ఒక్కసారే పార్వతి మీద ఉపయోగించాలనుకున్నాడు ఆనంద్.

మొగుడొదిలేశాడని సమాజం పార్వతిని అవహేళనచేస్తుంది. అది ఆమె భరించగలదా? పోతే పిల్లలంటే పార్వతికి ప్రాణం. స్వంత బిడ్డఅంటే ఇహ చెప్పనక్కర్లేదు. పిల్లని

తననుంచి వేరుచేస్తే అసలు భరించలేదు. ఏడ్చి ఏడ్చి, కుళ్ళికుళ్ళి చస్తుంది.

అంత కోపంలోనూ అతని పెదవులమీద చిరునవ్వు మెరిసి సంతృప్తి కలిగించింది ఆ ఆలోచన. అనాదిగా పురుషుడు స్త్రీని తన ఆలోచనలకు, ఆదర్శాలకు అనుకూలంగా మలచుకుంటూవచ్చాడు. మంచిగాని, చెడుగాని భర్త అభిప్రాయాలను, కోర్కెలను ఆమోదించే స్త్రీ సాధ్వి... లేనిపక్షంలో రాక్షసి. అటువంటి స్త్రీలను అదుపులోపెట్టటానికి కావలసిన ఆయుధాలు కూ[illegible]న్నాయి. తనతో జీవితాన్ని పంచుకోవటానికి వచ్చిన పార్వతి ఏ పరిస్థితుల్లో తనని కాదని వెళ్ళిపోవాల్సివచ్చిందోనని ఆలోచించే ఓపిక, ఆలోచించాల్సిన అవసరం ఆనంద్‌లాంటివాళ్ళకుండవు. ఒక వస్తువు పోతే మరో వస్తువు కొనుక్కోవచ్చు. ఒక స్త్రీ పోతే మరో స్త్రీని తెచ్చుకోవచ్చు. అది ఆనందించదగ్గ విషయం వాళ్ళకు.

సాయంత్రం ఆరుగంటలకు అనంతగిరి గెస్ట్‌హౌస్ చేరుకున్నాడు ఆనంద్. కొండలమాటున దాక్కోవాలని ప్రయత్నంచేస్తున్నట్లున్నాడు పడమటి సూర్యుడు. గూళ్ళను చేరిన పక్షులు వింతధ్వనులు చేస్తున్నాయి. గెస్ట్‌హౌస్‌బయటవున్న పెద్ద రావిచెట్టుకింద జీప్ ఆపాడు ఆనంద్. అతన్ని గుర్తుపట్టిన నౌకరు పరుగెత్తుకుంటూవచ్చి సామాన్లందుకున్నాడు.

"గెస్ట్‌హౌస్‌లో ఎవరైనా వున్నారా?"

"లేరండి... అంతా ఖాళీగానే ఉంది" వినయంగా జవాబిచ్చాడు నౌకరు కొండయ్య.

"నాల్రోజుల్దాకా ఎవరినీ రానివ్వకు" అధికారం తొణికిసలాడింది ఆనంద్ కంఠంలో.

"అట్టాగేనండి"

లోపలికెళ్ళి మంచంమీద వాలిపొయ్యాడు ఆనంద్. అలసటగా, ఆకలిగా అనిపించింది. సామాన్లు వేరే గదిలోపెట్టి వచ్చి చేతులు కట్టుకు నిల్చున్నాడు కొండయ్య.

"ఆకలిగా వుంది... త్వరగా భోజనం సిద్ధంచేయించు"

"మీరు తానంచేసి అట్టా కూకోండి బాబు. ఓ గంటలో పట్టుకొచ్చేత్తా" స్నానానికి ఏర్పాటు చేసి భోజనం సంగతి చూడటానికి వెళ్ళాడు కొండయ్య.

వేడినీళ్ళస్నానం అలసటను సగం తగ్గించింది ఆనంద్‌కు. లాల్చీ, పైజమా ధరించి వరండాలో కూర్చున్నాడు. చీకటిపడింది. వెన్నెల పరుచుకుంటోంది. భోజనం వచ్చేసరికి ఆలస్యం కావచ్చనుకున్నాడు. లోపలికివెళ్ళి తనతోపాటు తెచ్చుకున్న విస్కీబాటిల్ తీశాడు. కూజాలో నీళ్ళు చల్లగా వున్నాయి. గ్లాసు నింపుకుని వరండాలో కూర్చుని మెల్లగా సిప్‌చేయసాగాడు.

సమయం గడిచిపోతోంది. గ్లాస్ ఖాళీఅయింది. కొండయ్య వస్తున్న జాడలేదు. లోపలకువెళ్ళి మళ్ళీ గ్లాసు నింపుకొచ్చాడు. ఉండేకొద్దీ ఆకలి ఎక్కువకాసాగింది. ఆకలితోపాటు కోపం పెరుగుతోంది. రోడ్డుమీదకు వెళ్ళి ఎవరైనా కనబడితే కొండయ్యకోసం కబురు పంపించాలనుకున్నాడు. కానీ లేవబుద్ధికాలేదు. కుర్చీలో వెనక్కుజారబడి కళ్ళు మూసుకున్నాడు. ఉన్నట్లుండి హఠాత్తుగా గాజుల గలగల వినబడింది. కళ్ళుతెరిచి చూశాడు. ఎదురుగా ఓ యువతి నిలబడి వుంది. ఒక చేతిలో టిఫిన్ కేరియర్, రెండవ చేతిలో విస్తరాకు వున్నాయి. మసకవెలుతుర్లో ఆమె ముఖం స్పష్టంగా కనబడటంలేదు.

"కొండయ్య రాలేదా?" మత్తు వదిలించుకుని ఆమెను పరిశీలించటానికి ప్రయత్నిస్తూ అడిగాడు.

"కూడుతినొచ్చి ఈడ తొంగుంటానన్నాడు. లోనికిరండి వడ్డిస్తా" వయ్యారంగా నడుస్తూ లోపలికి దారితీసింది.

కన్నార్పకుండా ఆమెవంకే చూస్తూ లోపలికి నడిచాడు ఆనంద్. విస్తరాకు కడిగి టేబుల్ మీద పరిచి వరండాలోని కుర్చీ తెచ్చివేసింది. కేరియర్ విప్పి అన్నం, కూరలు వడ్డించసాగింది. కుర్చీలో కూర్చుని దీపం వెలుతుర్లో ఆమెవంక చూశాడు ఆనంద్. పసిడిఛాయలో మెరిసిపోతోంది ఆమె. విశాలనేత్రాలు, కొనదేలిన ముక్కు, అద్దాల్లాంటి చెక్కిళ్ళు, ఎర్రని పెదవులు-- కావ్యనాయికలా వుంది. మతిపోయినట్లయింది ఆనంద్‌కు. అంతకుముందు చాలాసార్లు అతనక్కడికొచ్చాడు. కానీ ఎప్పు

డూ ఆమె కనబడలేదు. మరిప్పుడెక్కడినుంచి వచ్చింది?

"కొండయ్య నీకేమవుతాడు?" అన్నం కలుపుకుంటూ సందేహం తీర్చుకోవటానికి అడిగాడు.

"నా మావ" టేబుల్ పక్కగా గోడకానుకుని నిలబడి సమాధానం చెప్పింది.

"పెళ్ళిచేసుకున్నారా?"

"మా అయ్య మనువాడమంటున్నాడు. నాకే మనసుకావటంలా" బాధపడుతున్నట్లుగా అంది.

"ఎందుకని?"

సమాధానం చెప్పకుండా నేలచూపులుచూస్తూ నిలబడ్డది.

"నీ పేరేమిటి?"

"చండిక"

"బాగుంది. చక్కటిపేరు..." ఇంకా ఏదో అనాలని ఉన్నా బలవంతాన నిగ్రహించుకున్నాడు.

చటుక్కున తలెత్తి అతనివంక చూసింది చండిక. ఏం కలుపుకుంటున్నాడో, ఏం తింటున్నాడో గమనించకుండా ఆమెవంకే చూస్తున్న ఆనంద్ కొంచెం కలవరపడి చూపు మరల్చాడు.

"ఏంటి... అట్టాగే సూస్తుండారు?" కొంటెగా ప్రశ్నించింది.

మౌనం ఈసారి ఆనంద్ వంతయింది.

"పేరేనా చక్కటిది? నే చక్కగాలేనా?" మూతి విరుస్తూ అంది.

అర్థంకాని చిక్కుసమస్యేదో హఠాత్తుగా అర్థమైనట్లనిపించింది ఆనంద్‌కు. ఇప్పుడు నిర్భయంగా సూటిగా ఆమె కళ్ళలోకి చూశాడు. ఆమె తేలిగ్గా తనకందుతుంది. చొరవ ఆమెవైపునుండే వస్తోంది. తను వెనకాడకూడదు.

"నీకేం... అప్సరసలాగున్నావ్!"

"మరి మావలాంటి బండోన్నెలా మనువాడను?" అమాయకంగా అడిగింది.

"మరెలాంటివాణ్ని మనువాడతావు?"

"మీలాంటి దొరబాబుని"

చటుక్కున చెయ్యి కడుక్కున్నాడు ఆనంద్. తడిచేతిని లాల్చీ అంచుకు తుడుచుకుంటూ రెండంగల్లో ఆమెను చేరుకుని దగ్గరకు లాక్కున్నాడు.

"అమ్మో... మావొచ్చేవేలయింది. ఈడకాదు... ఓ గడియాగి చింతలకుంట కాడికి రండి" అతన్ని విడిపించుకుని గబగబా కేరియర్ సర్దేసింది.

"చింతలకుంట యాడుందో తెలుసా?" ఎందుకైనా మంచిదన్నట్లు వెళ్ళబోతూ అడిగింది.

"తెలుసు"

"తప్పకుండా రావాల" కన్నుగీటుతూ ముసిముసిగా నవ్వుతూ వయ్యారంగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది చండిక.

సిగరెట్ కాల్చుకుంటూ వరండాలో అటూ ఇటూ పచార్లుచెయ్యసాగాడు ఆనంద్. తనకు అందబోయే ఆనందాన్ని తల్చుకుంటూ సంబరపడిపోసాగాడు. దాదాపు అరగంటతర్వాత వచ్చాడు కొండయ్య.

"అరె... తమరింకా నిద్రపోలేదా? అలిసిపొయ్యి ఈకాడికి కునుకుతీసుంటారనుకున్నా" ఆలస్యంగా వచ్చినందుకు కొంచెం భయపడుతున్నట్లుగా అన్నాడు. మనిషి బాగా తాగివున్నాడని చూడగానే అర్థమైంది ఆనంద్‌కు. మరీ మంచిదనుకున్నాడు.

"నిద్ర రావటంలేదురా! కాస్త అట్లా వాగుదాకా షికారుకెళ్ళొస్తా. జాగ్రత్తగా తలుపులేసి నువ్వు పడుకో. ఎక్కడికీ వెళ్ళకు"

"ఈయాళప్పుడు షికారేందిబాబు... తొంగోండి! రేపెల్లొచ్చు" చుట్టవెలిగించుకుంటూ మెట్లమీద చతికిలబడ్డాడు కొండయ్య.

"ఇప్పుడే వెళ్ళాలిరా. కాస్త చల్లగాలికి అట్లా తిరిగొస్తే బాగా నిద్రొస్తుంది. వీలయితే మంచి కుందేలుపిల్లని కొట్టుకొస్తా."

ఆనంద్‌కు వేటంటే మహాప్రీతి. ఎప్పుడు క్యాంపుకువచ్చినా తనతోపాటు తేలికపాటి తుపాకి, పవర్‌ఫుల్ బ్యాటరీలైట్ తెచ్చుకుంటాడు.

లోపలికెళ్ళి స్వెట్టర్ వేసుకున్నాడు. తలకి

మఫ్లర్ చుట్టుకుని, తుపాకి భుజానికి తగిలించుకుని బ్యాటరీలైట్ ఊపుకుంటూ బయలుదేరాడు.

"బద్రం బాబూ... గమ్మునొచ్చెయ్యండి" చల్లటి బండలమీదే నడుంవాలుస్తూ హెచ్చరించాడు కొండయ్య.

గబగబా అడుగులేస్తూ వేగంగా నడవసాగాడు ఆనంద్. ఆ చుట్టుపక్కల పరిసరాలూ, కాలిబాటలూ అతనికి క్షుణ్ణంగా తెలుసు. చింతలకుంట పెద్ద దూరంలో లేదు. గట్టిగా నడిస్తే పదిహేను నిమిషాలు పడుతుంది. పరుగులాంటి నడకతో పదినిమిషాల్లోనే అక్కడికి చేరుకున్నాడు. చింతలకుంట చిన్న నీటిమడుగు. ఎండాకాలంలో కూడా ఎండిపోదు. బ్యాటరీలైట్ వెలుతుర్లో చుట్టూచూశాడు. మనిషి ఉన్న జాడలేదు. వేగంగా నడవటంవల్ల ఆయాసంగా వుందతనికి. రొప్పుతూ ఓ చెట్టు నానుకుని కూర్చున్నాడు. ఎప్పటికొస్తుందో చండిక అనుకుంటూ సిగరెట్ నోట్లోపెట్టుకుని అగ్గిపుల్ల వెలిగించాడు. ఉఫ్‌మని ఊదిన శబ్దమైంది. అగ్గిపుల్ల ఆరిపోయింది. ఉలిక్కిపడి వెనక్కు తలతిప్పి చూశాడు. కిలకిల నవ్వుతూ చెట్టుచాటునుంచి వచ్చింది చండిక.

ఒక్క ఉదుటున చెయ్యిపట్టుకుని వళ్ళోకి లాక్కున్నాడు ఆమెను. పెదవులమీద ముద్దు పెట్టుకోవటానికి విఫలప్రయత్నం చేశాడు. అతడి పట్టు విడిపించుకొని దూరంగా జరిగింది చండిక.

"ముందీ సంగజెప్పండి. నన్ను మనువాడతారా?" మోకాళ్ళమీద కూర్చుని అతని ముఖంలోకి చూస్తూ ఆశగా అడిగింది.

"తప్పకుండా పెళ్ళిచేసుకుంటా. అనుమానం ఎందుకు?"

"ఒట్టెయ్యండి" అరచెయ్యి ముందుకు చాపింది.

"ఒట్టు" అరచేతిలో చెయ్యివేసి పట్టుకుని ముందుకు లాగాడు.

మళ్ళీ తప్పించుకుంది చండిక. బొడ్లో దోపుకున్న పసుపుతాడొకటి బయటికి తీసింది.

"అయితే ముందీ పసుపుతాడు నా మెళ్ళో కట్టండి. అప్పుడు మీదాన్నవుతా" తాడు ఆనంద్ చేతిలో పెట్టింది.

ఒక్కక్షణం ఆనంద్ తటపటాయించాడు. తనని చూడగానే వచ్చి వళ్ళో వాలుతుందనుకున్నాడుగానీ ఇటువంటి ఆశలు పెట్టుకుంటుం దనుకోలేదు. ఆ పసుపుతాడు మెళ్ళో కడితే ముందు ముందు ఎలాంటి ఇబ్బందులొస్తాయోనని భయపడ్డాడు. ఎలాగైనా ఆమెను లాలించి మాయజేసి తన కోరిక తీర్చుకోవాలనుకున్నాడు.

"చూడు చండీ... నీ మెళ్ళో ఇట్లాంటి తాళ్ళుకాదు వుండాల్సింది. బంగారుగొలుసులు. నువ్వు ముచ్చటపడ్డ నగలన్నీ కొనిపెడతా... నామాట విను. నేను మోసంచేస్తానని భయంగా ఉందా? మరి నా సంగతి కూడా కాస్త ఆలోచించు. నీకేమో చదువురాదు. పట్నంపిల్లల్లాగా వుండటం చేతకాదు. నిన్ను పెళ్ళిచేసుకుని పట్నం తీసుకెళితే అందరూ నన్నుచూసి నవ్వరూ?"

"మరి నన్ను పెళ్ళిచేసుకోవా?"

"పెళ్ళిదేముంది. చూడు... ఈ పసుపుతాడు కడితేనేనా పెళ్ళయినట్లు? మనస్సులు కలవాలి. ఒకళ్ళంటే ఒకళ్ళకి ఇష్టముండాలి. నువ్విక్కడే మీవాళ్ళతో హాయిగా వుండు. నేను ప్రతివారం నీదగ్గరకొస్తుంటా"

"అంటే... అంటే నన్ను నీ ఉంపుడుకత్తెగా వుంచుకుంటావా?"

"ఉంచుకోవటం తప్పనుకోకు..."

అతని మాటలు పూర్తవకముందే చండిక చెయ్యి ఆనంద్ చెంపని ఛెళ్ళుమనిపించింది.

"యదవ నచ్చినోడా! మాయమాటల్తో మోసం చేస్తావా?" అపరచండికలా గర్జించింది.

ఆనంద్ ఒక్కక్షణం బిత్తరపోయాడు. మరుక్షణం వివేచన కోల్పోయి మృగంలా ఆమెమీద పడ్డాడు.

"దొంగముండ! నీ అంతట నువ్వు పిల్చి నన్ను చెంపదెబ్బ కొడతావా? చూడు... నిన్నేం చేస్తానో? నీయబ్బ ఎవడొచ్చి నిన్ను రక్షిస్తాడో చూస్తా" భుజానికున్న తుపాకీ కిందపడేసి బలవంతంగా ఆమెననుభవించటానికి ముందుకురికాడు.

చండిక భయంతో పెద్దగా కేకలు పెట్టలేదు. పరుగెత్తి పారిపోవటానికి ప్రయత్నించలేదు. తనవైపే వస్తున్న ఆనంద్‌వంక రెప్పవెయ్యకుండా చూస్తూ నిబ్బరంగా నిలబడ్డది. ఆనంద్ తనకి అందుబాటులోకి రాగానే అడవి దద్దరిల్లేలా పొలికేకవేస్తూ మెరుపువేగంతో పైకెగిరి ఆనంద్ గుండెలమీద తన్నింది. వేగంగా వస్తున్న కారు గుద్దుకున్నట్లు ఎగిరి అంతదూరాన పడ్డాడు ఆనంద్. తనకేం జరిగిందో మొదట అర్థంకాలేదు. మెదడు మొద్దుబారిపోయి నట్లయింది. శ్వాస ఆడలేదు. ప్రక్కటెముకలు విరిగినట్లు ఛాతీఅంతా విపరీతమైన నొప్పి పుట్టింది.

చండిక వచ్చి జుట్టు పట్టుకొని లేపి మొహంమీద బలంగా గుద్దింది. దవడ విరిగినట్లు ఫీలయ్యాడు. పెదవి పగిలి రక్తం కారసాగింది.

అతను కిందపడేసిన తుపాకి అందుకొని గురిపెట్టింది.

అతనిలో లేచే శక్తిలేదు.

"యు డర్టీ బాస్టర్డ్" తుపాకి మడమతో బలంగా అతని తలమీద ఒక దెబ్బవేసింది చండిక.

అంత బాధలో కూడా ఆమె అన్న మాటలు విని నివ్వెరపోయాడు ఆనంద్.

మరుక్షణం కళ్ళుబైర్లు కమ్మాయి. స్పృహతప్పి అచేతనంగా పడిపోయాడు.



2

మెల్లగా కళ్ళుతెరిచి చూశాడు ఆనంద్. సూటిగా కళ్ళలో పడుతున్న ట్యూబ్‌లైట్ వెలుతురు ఇబ్బంది కలిగించింది. తలంతా బరువుగా, దిమ్ముగా అనిపించింది. కళ్ళకి చెయ్యి అడ్డంపెట్టుకొని తనున్న గదివంక చూశాడు.

ఆ గదిని అతనెప్పుడూ చూడలేదు. మరి ఆ గదిలోకి తనెలా వచ్చాడు? కళ్ళు మూసుకొని జరిగిన సంగతులు జ్ఞాపకం తెచ్చుకోవటానికి ప్రయత్నించాడు. అతని మెదడు పనిచేయటం ప్రారంభించింది. నెమ్మదిగా ఒక్కొక్క విషయమే గుర్తుకు రాసాగింది. అనంతగిరి వెళ్ళటం, చండిక, తనను కొట్టడం, ఆ తరువాత? ఏం జరిగింది?. తనిక్కడికి ఎలా తీసుకురాబడ్డాడు?

ఉన్నట్లుండి ఉలిక్కి పడ్డాడు. హఠాత్తుగా అతనికి చండిక అన్న ఆఖరి మాటలు గుర్తుకొచ్చాయి. అవును... ఆ మాటలింకా స్పష్టంగా గుర్తున్నాయి.

డర్టీ బాస్టర్డ్-

ఆ ఇంగ్లీషు మాటలు ఆటవిక స్త్రీ అయిన చండిక ఎట్లా అనగలిగింది? అంటే ఆమె ఆటవిక స్త్రీ కాదా? కాకపోతే మరెవరు? తనతో ఆమెకేం పని? తను కిడ్నాప్ చెయ్యబడ్డాడా? కిడ్నాప్ చెయ్యవలసిన అవసరం ఎవరికుంది?-- అతని మనస్సంతా గందరగోళంగా తయారయింది. నెమ్మదిగా లేచి మంచంమీద కూర్చున్నాడు. అతను వున్నగది విశాలంగా వుంది. అందంగా అలంకరించబడివుంది. మంచానికి ఎదురుగా ఒక తలుపు మూసివుంది. ఎడమ పక్కగా మరొక తలుపువుంది. మంచాన్ని ఆనుకొని పెద్ద కిటికీవుంది. తెరచివున్న రెక్కల్లోనుంచి బయట అందమైన పూల మొక్కలు కనబడుతున్నాయి. గదిలో చక్కని కుషన్ చైర్లు, వాటిముందు టీపాయ్ వున్నాయి. వాటి పక్కగా డ్రస్సింగ్ టేబుల్ వుంది.

నెమ్మదిగా మంచందిగి డ్రస్సింగ్ టేబుల్ అద్దంముందు నిలబడ్డాడు ఆనంద్. తలకి బేండేజ్‌వుంది. పగిలిన కింద పెదవివాచి ఎర్రగావుంది. మూడు అదిమి చూశాడు. నొప్పిగా అనిపించింది. ఎదురుగావున్న తలుపు దగ్గరకెళ్ళి హేండిల్ తిప్పిచూశాడు. లాక్ చెయ్యబడివుంది. రెండవ తలుపు దగ్గర కెళ్ళి దాన్ని తెరవటానికి ప్రయత్నించాడు. అది తెరుచుకొంది. కానీ అది అటాచ్ బాత్‌రూమ్ తలుపు. మూసేసి మళ్ళీ మంచంమీద కూర్చుని ఆలోచించసాగాడు. ఎవరో తనని

బంధించారు. బంధించిన వ్యక్తి చండిక అయినా ఆమె ఒక్కర్తే ఈ పని చేసి వుండదు. ఆమె వెనుక మరెవరోవుండి వుంటారు. వాళ్ళెవరు? ఏ ప్రయోజనాన్నాశించి తనని కిడ్నాప్ చేశారు?

వాచ్‌వంక చూసుకున్నాడు. పదిన్నర అయింది. అంటే దాదాపు పన్నెండు గంటల పాటు తను స్పృహలోలేడు. ఈపాటికి కొండయ్య తనకోసం వెతకటం ప్రారంభించి వుంటాడు. బహుశా పోలీస్ కంప్లయింట్ ఇవ్వవచ్చు. కానీ పోలీసులు తన ఆచూకీ తెలుసుకోవటానికి ఆధారాలేమున్నాయి?

హఠాత్తుగా అతని దృష్టి ఎదురుగావున్న స్విచ్ బోర్డుమీద పడింది. లేచి దాని దగ్గరకెళ్ళాడు. ఉన్నస్విచెస్‌లో ఒక కాలింగ్ బెల్ స్విచ్ కూడావుంది. దాన్ని నొక్కి కాస్సేపు ఎదురుచూశాడు. బెల్ మోగిందికానీ బదులులేదు. ఈసారి మరింతసేపు నొక్కాడు. బయట ఏదో అలికిడయింది. తలుపు తీస్తున్న శబ్దం--నెమ్మదిగా తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా లోపలికి ప్రవేశిస్తున్న వ్యక్తినిచూసి నిశ్చేష్టుడయ్యాడు ఆనంద్. వస్తున్న వ్యక్తి స్త్రీ అయిందీ, పురుషుడయిందీ అర్థంకాలేదు. ముఖంమీద ఏపుగా పెరిగిన గడ్డం, మీసాలు ఆ వ్యక్తి పురుషుడని తెలియజేస్తున్నా మిగతావేషం అలాలేదు. తెల్లటి గౌను, పొడుగాటి తెల్లటి స్టాకింగ్స్ ఆ వ్యక్తి వంటిమీద వున్నాయి. గౌను బిగుతుగా మోకాళ్ళవరకు వుండటంతో చిన్న చిన్న అంగలువేస్తూ నడవాల్సివస్తోంది. కాళ్ళకి హైహీల్సు వున్నాయి. కానీ అవి చిన్నపిల్లల పాదాలకు వేసేవాటిలా మరీ చిన్నవిగా వున్నాయి. అన్నిటికన్నా ఆశ్చర్యం ఆ వ్యక్తి పొడవాటి జుట్టు అందంగా ముడివేయబడి వుంది.

"ఇప్పుడెలావుంది?" లోపలికొచ్చిన ఆ వ్యక్తి ప్రశ్నించాడు.

ఫరవాలేదు. మగగొంతుకే ననుకున్నాడు ఆనంద్.

"మీరెవరు?" ఆనంద్ ప్రశ్నించాడు సందేహంగా.

"నాపేరు త్యాగి. ఈ ఇంట్లో పనిమనిషిగా వుంటున్నాను. ఏదీ, జ్వరమేమన్నావుందేమో చూడనివ్వండి" త్యాగి అనబడే ఆ వ్యక్తి ఆనంద్ చెయ్యి పట్టుకున్నాడు.

"మీరు...మీరు పురుషులేనా?" కొంచెం బెరుగ్గా అడిగాడు ఆనంద్.

"మీకా సందేహం ఎందుకొచ్చింది?" కొంచెం అఫెండ్ అయినట్లు ముఖం పెట్టాడు త్యాగి.

"మీరు పురుషులైతే మరి ఆ జుట్టేమిటి... అట్లా పెంచుకుని ముడివేసుకున్నారు? ఏదైనా మొక్కుబడా?"

"నిన్ను చూసి రాత్రినుంచి నేనూ అదే ఆశ్చర్యపడుతున్నాను. నువ్వు మగాడివే. కానీ నీజుట్టేంటి, అట్లా కత్తిరించబడింది? నీ మీసాలు, గడ్డాలు పొడవుగా లేవేం? నీభార్య చనిపోయిందా? కానీ భార్య చనిపోతే నీ జుట్టు పూర్తిగా తీసివెయ్యబడాలికదా?" తీరని సందేహాన్ని తీర్చుకోవాలన్నట్లు గబగబా అడిగాడు త్యాగి.

త్యాగి ధోరణి ఆనంద్‌కి అర్థం కాలేదు. తను త్యాగిని చూసి ఎంత ఆశ్చర్యపడుతున్నాడో త్యాగి తనని చూసి అంతే ఆశ్చర్యపడుతున్నాడని మాత్రం స్పష్టమైంది.

"మీరు వింతగా మాట్లాడుతున్నారు. మగాళ్ళెక్కడైనా జుట్టు పెంచుకుంటారా?" ఆశ్చర్యపడుతూ అడిగాడు ఆనంద్.

"భలేవారేమీరు. జుట్టనేది మహాభగవతి పురుషుడికిచ్చిన వరంకదా. దాన్ని కత్తిరించటం మహాపాపం" అంత పాపకార్యం చేసిన ఆనంద్ పట్ల సానుభూతి వ్యక్తంచేస్తూ అన్నాడు త్యాగి.

త్యాగి మాటలు వింటుంటే జుట్టు పీక్కోవాలనిపించింది ఆనంద్‌కు. "జుట్టు వరంగా ఇవ్వడమేమిటి? అసలు మహాభగవతి ఎవరు?"

త్యాగి ఆనంద్‌వంక తేరిపారచూశాడు. అప్పటివరకూ కలగని కొత్త అనుమానం అతనికి కలిగింది. మహాభగవతి ఎవరని ప్రశ్నిస్తున్నాడు. ఇతను పిచ్చివాడు కాదుకదా! అదే నిజమయివుంటుంది. ఏవో పిచ్చిపిచ్చి వేషాలు వేసివుంటాడు. అందుకే అతని భార్య



# తల్పగిరి కాలనీలో

6 మాసములలో సొంత గృహమును పొందుగోరువారు రూ॥ 30,000/-లు ముందుగా చెల్లించిన మిగిలిన పైకము మీకు అనువైన రీతిలో వాయిదాల పద్ధతిలో చెల్లించుటకు లోను ఏర్పాటు చేయబడును.

కేవలం నెలకు రు. 500/-లు మాత్రమే వాయిదాల పద్ధతిలో చెల్లించి, సొంత గృహమును పొందుటకు నెల్లూరు పట్టణములో చక్కని అవకాశం.

నెల్లూరు - మద్రాసు G.N.T. రోడ్డు కుడిప్రక్కన, ఆటోనగర్‌వద్ద స్వామి అయ్యప్ప దేవాలయము సమీపంలో, టౌన్‌కు అనుకొని "లే అవుట్" చేయడమైనది.

1. $33^1/_3$ అంకణములు /267 చ. గల ప్లాటులో $5^1/_2$ అంకణములు /400 చ.అ. సింగిల్ బెడ్ రూం గృహము కేవలం రు. 55,000/-మాత్రమే.
2. వాయిదాల పద్ధతిలో గృహము పొందగోరువారు ముందుగా 15,000/- చెల్లించి మిగిలిన పైకము నెలకు రు. 500/-ల చొ॥న 120 నెలలు చెల్లించవలెను.
3. డ్రైనేజ్, రోడ్లు, కరెంటు వసతులు కల్పించబడును. ప్రతి ఇంటికి ఒక బావి త్రవ్వి నీటి వసతి ఏర్పాటు చేయబడును.
4. కేవలం ప్లాటు మాత్రమే కొనుగోలుచేయుటకు కూడా అవకాశం కలదు.
5. మొదటి గ్రూపులోచేరిన 50 మందికి 18 మాసములలో గృహ నిర్మాణము పూర్తిచేయబడును.
6. ప్లాటు కొనుగోలు చేయువారికి మొదటి వాయిదా రు. 5,000/- చెల్లించిన, మిగిలిన పైకం వాయిదాల పద్ధతిలో చెల్లించుటకు లోను ఏర్పాటు చేయబడును.
7. ప్లాటు కొనుగోలు చేయువారు రు. 500/- లేదా గృహనిర్మాణ స్కీములో చేరువారు రు. 1000/- టోకను అడ్వాన్సు చెల్లించి వచ్చిన ప్లాటును వెంటనే రిజర్వు చేసుకొనవచ్చును.
8. ప్రతి ఆదివారము ఉదయం 8 గం. నుండి 12.30 గంటల వరకు స్థల సందర్శనము కొరకు మా ఆఫీసునుండి ఉచిత వాహన సౌకర్యం ఏర్పాటుచేయబడును.

వివరములకు :

ఫోన్ : 6729

**J.L. నారాయణ & కంపెనీ**

14/291, ఊర్వశి కాంప్లెక్స్ - కాపువీధి - నెల్లూరు

OM ADS. NLR.

కొట్టివుంటుంది. ఆ దెబ్బల్తో పూర్తిగా మతిపోయివుంటుంది అనుకున్నాడు మనసులో.

పైకిమాత్రం జాగ్రత్తగా వివరించాడు. "చూడండి... మీరేదో పీడకలనుంచి మేల్కొని వుంటారు. మహాభగవతి ఎవరని ప్రశ్నించవచ్చా? అపచారం కదూ! ఈ సృష్టికీ, లయకూ మూల స్వరూపిణి ఆ తల్లి మహాభగవతి. ఈ జుట్టు పురుషుడికి ఆమె ప్రసాదించినదే. స్త్రీకి మూతిమీదా, గడ్డంమీదా, ఛాతీమీదా, కాళ్లకీ, చేతులకీ దట్టంగా జుట్టు వుంటుందా? ఉండదు. మనకివ్వబడిన ఈ పవిత్రమైన జుట్టుని మనం జాగ్రత్తగా పెంచి కాపాడుకోవాలి"

ఆ వివరణతో నిజంగానే మతిపోయినట్లయింది ఆనంద్‌కు. కాదని ఆ వాదనని ఎలా వ్యతిరేకించాలో అర్థం కాలేదు. నిజమే! స్త్రీ కంటే పురుషుడికే ఎక్కువచోట్ల జుట్టు వుంటుంది. జుట్టు పెంచుకోవటానికి వాళ్లే ఎక్కువ అర్హులు. తన ఆలోచనలు తనకే నవ్వుపుట్టించాయి. త్యాగివంక వెర్రిచూపులు చూస్తూ చిన్నగా నవ్వాడు.

కొంపదీసి ఈ పిచ్చోడు మీదపడి పీకిపెడతాడేమోనని మనస్సులో భయపడ్డాడు త్యాగి. పైకి మాత్రం నిబ్బరంగా, "చూడండి... మీకు పూర్తి విశ్రాంతి కావాలి. ఇట్లా మాట్లాడుతుంటే అలసట వస్తుంది. వెళ్లి పడుకోండి" అంటూ ఆనంద్‌ని భుజం పట్టుకుని మంచం దగ్గరకు తీసుకెళ్లాడు.

"ఆకలిగా ఉందా? తినటానికి ఏమైనా తీసుకురానా?" అడిగాడు త్యాగి.

నిజంగానే ఒక్కసారిగా ఎక్కడలేని ఆకలి పుట్టుకొచ్చింది ఆనంద్‌కు. "బాగా ఆకలిగా వుంది" అన్నాడు మెల్లగా.

"వంటింట్లో పండ్లు వున్నాయని చెప్పారు మీవారు. తెస్తా నుండండి" అంటూ కదిలాడు త్యాగి.

"మావారెవరు?" విస్తుపోతూ అడిగాడు ఆనంద్.

'వీడి మతిమండ. భార్యనే మర్చిపోయినట్లున్నాడు. అందుకే బుర్రపగలగొట్టి వుంటుంది' అనుకున్నాడు త్యాగి.



"మీవారేనండి... చండికగారు" సరిగ్గా గుర్తుతెచ్చుకోమన్నట్లు చూస్తూ అన్నాడు త్యాగి.

ఆనంద్ పరిస్థితి గందరగోళంగా వుంది. అయినా చండిక పేరు వినగానే పట్టరాని కోపం వచ్చింది. "ఏదీ... అది ఎక్కడ?" కోపంగా చూస్తూ అడిగాడు.

"ఏదో పనిమీద వెళుతున్నానన్నారు. సాయంత్రం ఆరింటికి వస్తానన్నారు" భయపడుతూ సమాధానం చెప్పాడు త్యాగి.

"ఈ ఊరి పేరేమిటి?"

"ప్రమదావని"

"నీకు పెళ్లయిందా?" అనాలోచితంగా అడిగాడు ఆనంద్.

"అయింది. మగాడై పుట్టినాక పెళ్లిచేసుకోక తప్పుతుందా? మగాడిగా పుట్టటంకంటే మరుభూమిలో మానై పుట్టడం నయం" అన్నాడు త్యాగి.

త్యాగి సమాధానాలు వింటూ మతిపోగొట్టుకోదల్చుకోలేదు ఆనంద్. మౌనంగా కిటికీలోనుంచి బయటకు చూస్తూ కూర్చున్నాడు. త్యాగి వంటింట్లోకెళ్లి రెండు యాపిల్ పండ్లు, నాలుగు అరటిపండ్లు ట్రేలో పెట్టుకొచ్చాడు.

"ఇవి తింటూ వుండండి... పాలున్నాయి. వెచ్చబెట్టి తీసుకొస్తా" అంటూ వెళ్లాడు.

ఆనంద్ తీవ్రంగా ఆలోచించసాగాడు. 'ప్రమదావని' అనే వూరిపేరు అతనెప్పుడూ విని వుండలేదు. ఆ పేరు, త్యాగి మాటలు, ప్రవర్తన తరచి చూస్తే ఇదేదో ఆడమలయాళంలా వుందనిపించింది. ఏదెట్లావున్నా ఆవూరు అనంతగిరికి దగ్గర్లోనే వుండివుండాలి. లేకపోతే తననిక్కడికి అంత త్వరగా చేర్చటం సాధ్యంకాదు. ఓ కారుగానీ, మోటార్‌బైక్‌గానీ చేతిలో వుంటే ఒకటి రెండు గంటల్లో ఇక్కడినుంచి బయటపడొచ్చు. చండిక తిరిగి రాకముందే తప్పించుకోవాలి. ఇప్పుడున్న గాయాల్తో ఆమెతో తలపడి పోరాడటం కష్టం.

ఇంట్లో వుంది త్యాగి ఒక్కడే. చూడటానికి అతను బలహీనంగా, పిరికిగా వున్నాడు. అతన్ని లొంగదీయటం పెద్ద కష్టం కాకపోవచ్చు. అయినా జాగ్రత్తగా వుండటం మంచిది. లేచి నిశ్శబ్దంగా నడుస్తూ తలుపు దగ్గరకెళ్లాడు. త్యాగి వస్తున్న చప్పుడులేదు. మెల్లగా తలుపు

తెరిచి చూశాడు. అవతల విశాలమైన హాలుంది. అందులోకెళ్లాడు. దానికి రెండు ద్వారాలున్నాయి. ఒకటి తెరిచి వుంది. బహుశా త్యాగి వెళ్లిన వంటగది అదే కావచ్చనుకున్నాడు. అడుగులో అడుగేస్తూ ఆ ద్వారం వద్దకెళ్లి తొంగిచూశాడు.

త్యాగి గ్యాస్‌స్టవ్ వద్ద వున్నాడు. డైనింగ్ టేబుల్‌మీద త్యాగి అంతకుముందు యాపిల్ పండ్లు కొయ్యటానికి వుపయోగించిన చిన్న కత్తి వుంది. నిశ్శబ్దంగా వెళ్లి దాన్నందుకున్నాడు. చిన్నదే అయినా బాగా పదునుగా వుంది. ఫర్వాలేదనుకున్నాడు. కత్తి పట్టుకుని త్యాగి వైపు వేగంగా కదిలాడు.

అడుగుల చప్పుడుకి త్యాగి వెనక్కి తిరిగే లోపలే ఆనంద్ ఎడమచేయి త్యాగి గొంతుచుట్టూ బిగిసింది. కత్తి పట్టుకున్న కుడిచేయి పైకిలేచింది. కానీ హఠాత్తుగా ఆనంద్‌కి త్యాగిని చంపటం అనవసరమనిపించింది. కత్తి వదిలేసి మెడచుట్టూ చేతిని మరింత బిగించాడు. ఊపిరాడక త్యాగి గుడ్లు తేలవేశాడు. విడిపించుకోటానికి అతడు చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి.

ఒక్క నిమిషం తర్వాత ఆనంద్ పట్టువదలి స్పృహ కోల్పోయిన త్యాగిని నేలమీద పడుకోబెట్టి అతన్ని కట్టివేయటానికి తాళ్లకోసం వెతికాడు. అలాంటివేమీ కనబడలేదు. తీరిగ్గా వెదకటానికి సమయంలేదు. వేగంగా బెడ్‌రూమ్‌లోకి పరిగెత్తి బెడ్‌షీట్‌ని సన్నని పేలికలుగా చించాడు. వాటిని మెలిదిప్పి త్యాగి చేతులు, కాళ్లు కట్టేశాడు. త్యాగి పరిస్థితి ఎలా వుందోనని వంగి అతని గుండెమీద చెవి ఆన్చాడు. ఫర్వాలేదు... అతను బాగానే వూపిరి తీస్తున్నాడనిపించింది. త్యాగి నోట్లో గుడ్డలు కుక్కి బయటకు వచ్చాడు. జాగ్రత్తగా తలుపులన్నీ వేసి ముఖద్వారానికి మాత్రం తాళంవేశాడు. తాళం చెవి జేబులో వేసుకుంటూ వీధిలోకి నడిచాడు. అతను బయటకు రావటం చుట్టుపక్కల ఇళ్లవాళ్లెవరూ చూడలేదు.

తలవంచుకుని గబగబ నడవటం ప్రారంభించాడు ఆనంద్. పొరపాటున వీధిలో ఎక్కడైనా చండిక కనబడుతుందేమోనని మనస్సులో భయపడసాగాడు. త్యాగి చెప్పినమాట నిజమైతే తప్పించుకోటానికి కావలసినంత టైమ్ వుందనిపించింది. ఆ వూళ్లో చండిక తప్పించి తనని గుర్తించగలిగేవాళ్లెవరూ వుండకపోవచ్చు. అయినా తన జాగ్రత్తలో తనుండటం మంచిది. మొట్టమొదట అతను సరాసరి పోలీస్‌స్టేషన్‌కెళ్లి జరిగిందంతా చెప్పి కంప్లయింట్ రాసి ఇవ్వాలనుకున్నాడు. కానీ ఆ పనిచెయ్యటానికి మనసొప్పలేదు. ఒక ఆడదానిచేత తన్నులు తిని బంధింపబడ్డానని చెప్పుకోవటం అవమానకర మనిపించింది. ముందు అనంతగిరి చేరుకోవాలి. చండిక గురించిన వాస్తవాలు కొండయ్యకు తెలిసుండాలి. వాడికి కూడా ఇందులో భాగం వుండి వుంటుంది. నాలుగు తగిలిస్తే వాడే నిజం చెబుతాడు. కాబట్టి సాధ్యమైనంత త్వరగా అనంతగిరి చేరుకోవాలి.

మెయిన్ రోడ్డుమీదకొచ్చాడు ఆనంద్. ఖాళీగా వస్తున్న ఆటో కనిపించింది. చెయ్యెత్తి ఆపాడు. ఆటో నడుపుతున్న వ్యక్తి ఒక స్త్రీ. ఎర్రటి యూనిఫారం ధరించి వుంది. ఆనంద్ ఆమెవైపు చూడలేదు. లోపల కూర్చుని బస్‌స్టేషన్‌కు పోనిమ్మన్నాడు. ఆమె ఒక్కక్షణం ఆనంద్ వంక వింతగా చూసింది. తరువాత నిర్లక్ష్యంగా భుజాలెగరేసి వేగంగా ఆటో పోనివ్వసాగింది.

ఆనంద్ ఆటోలో నుంచి బయటకు చూస్తూ కూర్చున్నాడు. ఆరోడ్డు చాలా విశాలంగా వుంది. రెండు పక్కలా రకరకాల షాపులున్నాయి. ట్రాఫిక్ అంతగా లేదు. ఎక్కువమంది నడిచి వెళుతున్నారు. వాళ్లని చూస్తుంటే ఆనంద్‌కి వింతగా అనిపించింది. వేషధారణ చూడటానికి పురుషులదిలాగా వున్నా పురుషులేనని నమ్మలేకపోయాడు. పైగా స్త్రీలలాగా చీరలు ధరించిన వాళ్ళు ఒక్కళ్ళు కూడా కనబడలేదు. చూడటానికి అది ఒక మహానగరంలా వుంది. కానీ అనంతగిరి పర్వతాల దరిదాపుల్లో చెప్పుకోదగిన చిన్న టౌన్ వున్నట్లు కూడా తను విని వుండలేదు. అతనికి తెలియకుండానే అతని మనస్సంతా ఆందోళనతో నిండిపోయింది.

ఐదు నిముషాల్లో బస్‌స్టేషన్ వచ్చేసింది. ఆటోదిగి జేబులో పదిరూపాయల నోటు తీసిచ

స్తూ డ్రైవర్ వంక చూశాడు. ఆవ్యక్తి స్త్రీ అని స్పష్టంగా పోల్చుకోగలిగాడు. అంటే ఇంతకు ముందు వీధుల్లో కనబడిన వాళ్ళందరూ స్త్రీలే అయివుండాలని నిర్ధారించుకున్నాడు. ఈ ఊళ్ళో పురుషులెవరూ వుండరా? త్యాగి పురుషుడే కదా! కానీ అతని వేషం, భాషా....! అదంతా ఓ పెద్ద పజిల్‌లా అనిపించింది. ఆటోడ్రైవర్ ఇచ్చిన చిల్లర తీసుకుని తల వంచుకుని క్రీగంటితో పరిసరాల్ని గమనిస్తూ లోపలికి నడిచాడు. వచ్చేపోయే వాళ్ళు ఒక్షణం ఆగి తనవంక విచిత్రంగా చూసి వెళుతున్నట్లనిపించింది. కొంచెం దూరంలో గుంపుగా నిలబడ్డ కొందరు పెద్దగా నవ్వటం వినిపించి అటు చూశాడు. నిజంగా వాళ్ళు అతనివైపే. చూస్తూ నవ్వుతున్నారు. వాళ్ళందరూ పురుషుల్లా కనబడుతున్న స్త్రీలే. చాలా అనీజీగా ఫీలయ్యాడు. కోపాన్ని దిగమింగుకుంటూ ముందుకు సాగాడు. బస్‌స్టేషన్ చిన్నదైనా అందంగా వుంది. బస్‌లన్నీ లేతనీలం రంగులో వున్నాయి. అట్లాంటి బస్‌లు అతనెన్నడూ చూడలేదు. వాటిమీద వున్న పేర్లు కూడా అతనికి పరిచయం లేనివి. ప్లాట్‌ఫారమ్ నంబర్లు, అక్కడి నుండి బస్‌లు వెళ్ళే ప్రాంతాల పేర్లూ జాగ్రత్తగా చూడసాగాడు. అనంతగిరి పేరెక్కడా కనబడలేదు. ఓ ఐదారుగురు అతని వెనకాలే నడుస్తూ ఏవో జోకులు వేసుకుని నవ్వుతున్నారు. పొరపాటుపడ్డానేమోనని మళ్ళీ ఓసారి ప్లాట్‌ఫారమ్‌లన్నీ తిరిగాడు. అనంతగిరి పేరు కనబడలేదు. నిస్సహాయంగా చుట్టూ చూశాడు. ఇప్పుడతని చుట్టూ దాదాపు ఇరవైమంది నిలబడి జూలో జంతువుని చూసినట్లు చూస్తున్నారు. ఒక యువతి అతని దగ్గరకొచ్చింది. చేతిలో సిగరెట్ వుంది.

పొగ వదులుతూ ఆనంద్ కళ్ళలోకి గుచ్చి గుచ్చి చూస్తూ అడిగింది. "ఎవరు నువ్వు?"

ఆనంద్‌కి సిగ్గుగా, అవమానంగా అనిపించింది. చూపు మరల్చుకున్నాడు. "అనంతగిరి వెళ్ళే బస్‌లు ఎక్కడాగుతాయి?" చిన్నగా అడిగాడు.

"అనంతగిరా... ఆ పేరెక్కడా వినలేదే?" ఆశ్చర్యపోయిందామె. చివరి దమ్ములాగి సిగరెట్ కిందపడేసి బూట్‌తో నలిపేసింది.

"అక్కడ ఎంక్వయిరీస్‌లో అడిగి చూడు" అంది కొంచెం దూరంలో వున్న కౌంటర్ చూపిస్తూ.

అటువైపు నడిచాడు ఆనంద్. అతని వెనకాలే బయల్దేరింది గుంపు.

"వీడెవరో ఆరకం గాడ్లా వున్నాడు" గుంపులో ఒకరన్నారు. గొల్లుమని నవ్వులు వినిపించాయి.

"ఓపికుంటే కదిలించి చూడ్రాదు" మరో గొంతు-

మళ్ళీ నవ్వులు.

కౌంటర్ చేరుకొని లోపలున్న వ్యక్తి వంక చూశాడు ఆనంద్. ఆ వ్యక్తి కూడా స్త్రీనే. నెత్తినున్న టోపీతీసి నున్నటి గుండుని ఓసారి చేత్తో తడుముకుని మళ్ళీ టోపీ పెట్టుకుంది. ఏం కావాలన్నట్లు ఆనంద్ వంక ప్రశ్నార్థకంగా చూసింది.

"అనంతగిరి వెళ్ళే బస్ ఎప్పుడుంది?" అస్పష్టంగా గొణిగాడు.

కౌంటర్లోని స్త్రీ మళ్ళీ టోపీ తీసి గుండు తడుముకుంది. ఓసారి అతన్ని ఎగాదిగా చూసింది. "ఎక్కడికెళ్ళాలి?"

"అనంతగిరి"

"అనంతగిరి ఏమిటయ్యా... అదెక్కడుంది?" కోపంగా అడిగిందామె.

"పోనీ హైద్రాబాద్" అసహనంగా అన్నాడు.

"పిచ్చాస్పత్రి నుంచి తప్పించుకొచ్చావా ఏంటి? ఎక్కడికెళ్ళాలంటే పిచ్చి పిచ్చి పేర్లన్నీ చెబుతావేం? అసల్నువ్వెవరు? ఈ బట్టలు, వేషం ఏంటి?" దబాయించిందామె.

ఆనంద్ భయపడ్డాడు. తెలుగు మాట్లాడుతూ ఆంధ్రరాజధాని హైద్రాబాద్ తెలియదంటుందేమిటి? కొంపదీసి వీళ్ళకి బయటి ప్రపంచంతో సంబంధం లేదా? ఇప్పుడేం చెయ్యాలి?

"మొద్దులా నిలబడి మాట్లాడవేం? సిగ్గులేకుండా ఆడాళ్ళలా బయల్దేరావ్...." ఇంకా ఏవేవో అంటోందామె.

చుట్టూ ఉన్నవాళ్ళు వెకిలిగా నవ్వుతూ తలా

# లైఫ్‌బాయ్ ఎక్కడో ఆరోగ్యం అక్కడ




## లైఫ్‌బాయ్
మురికిలోని క్రిములను వదలగొడుతుంది

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS L 98 1611 TL

ఒకమాట అనటం ప్రారంభించారు. ఆనంద్‌కి తల తిరిగిపోయింది. అతని అనుమానం దృఢపడింది. అక్కడ అలా నిలబడితే లాభంలేదు. ముందు ఏదోరకంగా అక్కడి నుంచి బయటపడాలి. ఎలా... ఎలా? అప్రయత్నంగా కాళ్ళు కదిలాయి. వేగంగా నడవటం ప్రారంభించాడు. అప్పుడే ఒక ప్లాట్‌ఫామ్ నుంచి ఒక బస్సు బయలుదేరుతోంది. అది ఎక్కడికి వెళుతుందో తెలియదు. దానివంక పరుగు తీసి లోపలికెక్కి ఒక సీట్లో కూలబడ్డాడు. జేబుగుడ్డతో మొహానికి పట్టిన చెమటలు తుడుచుకుని వగరుస్తూ చుట్టూచూశాడు. లోపల పదిమందికంటే ఎక్కువ పాసింజర్లు లేరు. అందరూ ఆడవాళ్ళే! అంధరూ అతని వంక ఆశ్చర్యంగా గుడ్లుమిటకరించి చూస్తున్నారు. అతని గుండె దడదడలాడింది.

''మీరక్కడ కూర్చోకూడదు. అవిగో! మగాళ్ళకి ప్రత్యేకంగా సీట్లున్నాయి. అక్కడ కూర్చోండి'' చేతితో చూపిస్తూ అంది యూనిఫారమ్‌లో ఉన్న కండక్టరు.

భయంభయంగా ఆమె వంక చూశాడు. తరువాత డ్రైవర్ వంక చూశాడు. డ్రైవర్ కూడా స్త్రీనే. మెల్లగా లేచి కండక్టర్ చూపించిన సీట్లవైపు నడిచాడు.

''ఎక్కడికెళ్ళాలి?'' టిక్కెట్ పాడ్ ఒకచేత్తో పట్టుకుని వచ్చింది కండక్టర్. ఏం చెప్పాలో తెలియలేదు ఆనంద్‌కు.

''ఎక్కడివరకూ వెళుతుంది ఈ బస్?'' నెమ్మదిగా అడిగాడు.

''వడముడి''

''టిక్కెట్టెంత''

''రెండ్రూపాయలు''

జేబులోంచి ఐదురూపాయల నోటుతీసిచ్చాడు ఆనంద్. టిక్కెట్ కొట్టి చిల్లర ఇచ్చి వెళ్ళి తన సీట్లో కూర్చుంది కండక్టర్.

కొంచెం నిబ్బరంగా ఊపిరి పీల్చుకున్నాడు ఆనంద్. వడముడి- పేరు గమ్మత్తుగా వుంది. ఆ పేరు కూడా ఎప్పుడూ వినలేదు. ఏదైతేనేం... ముందిక్కడ నుండి బయటపడితే చాలు. వీళ్లసంగతి తర్వాత తేల్చుకోవచ్చు. స్థానబలిమి లేనిచోట జాగ్రత్తపడాల్సిందే! కాని ఇదేంటి ఈ ఆడవాళ్ళు- వీళ్ళ వేషం ఇట్లా వుంది! అసలు మగవాళ్ళిక్కడ వుండరా? ఉంటారనటానికి సాక్ష్యం త్యాగి. క్రా[illegible] త్యాగి పిచ్చివాడిలా వున్నాడు. ప్రపంచంలో అసలు ఇలాంటి చోటుందని ఎప్పుడూ వినలేదే! నాగరిక ప్రపంచంలోని అన్ని హంగులూ ఇక్కడున్నాయి. కానీ ప్రపంచానికి ఇలాంటి చోటుందని తెలియదు. దీని రహస్యం బయట పెట్టే మొదటివ్యక్తి తనే అవుతాడు. అమెరికాను కనిపెట్టిన కొలంబస్ ముఖంలా వెలిగిపోయింది అతని ముఖం. మెల్లగా తనలోతనే నవ్వుకుంటూ పక్కకు చూశాడు.

అవతలి వరుసల్లోని సీట్లలో కూర్చున్న ఒకామె ఆనంద్ వంకే రెప్పవేయకుండా చూస్తోంది. వయస్సు ముప్పైదాటి వుంటుంది. అంటకత్తెర వేసిన ఉంగరాల జుట్టు, తెల్లటి ప్యాంటు, షర్టు. తనవంక చూసిన ఆనంద్‌కి కన్నుగీటి చిరునవ్వు నవ్వింది. ''దొంగముండ. ఇక్కడ కాకుండా మరెక్కడైనా తారసపడితే, నీపని పట్టేవాణ్ణి'' మనస్సులోనే కసిగా తిట్టుకుని కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చున్నాడు.

అప్పటికే బస్ ఊరి పొలిమేరల్లోకి వచ్చేసింది. ఉన్న కొద్దిమందీ మధ్యలో అక్కడక్కడా దిగిపోయారు. తెల్లడ్రస్‌లో ఉన్న యువతిమాత్రమే వుంది. ముందుకు వెళ్ళేకొద్దీ అదంతా అడవి ప్రాంతంలా కనబడసాగింది. దూరంగా పర్వతాలు కూడా వున్నాయి. అనుమానం లేదు... ఇవి అనంతగిరి పర్వతాలే అనుకున్నాడు ఆనంద్ కొంచెం హుషారుగా. మరో పదినిమిషాల్లో బస్ ఆగింది. తెల్లడ్రస్‌లో వున్నామె సీట్లోంచి లేచింది.

''ఇదే వడముడి... దిగండి'' అంది తను డోర్ వద్దకు వెళుతూ. ఆనంద్‌కూడా లేచి దిగాడు.

అక్కడ ఒక చిన్న బస్ షెల్టర్ మాత్రమే వుంది. బస్‌కోసం ఎదురుచూస్తున్న కొంతమంది గబగబా బస్‌వైపు వస్తున్నారు. ఎటు వెళ్ళాలో ఏంచెయ్యాలో అర్థం కాలేదు ఆనంద్‌కి. మెల్లగా బస్‌షెల్టర్ దగ్గరకెళ్ళి సిమెంట్ బెంచీమీద కూర్చున్నాడు. కొంచెందూరంలో నిలబడ్డ తెల్లడ్రస్ యువతి ఆనంద్ వంకే

చూస్తోంది. పాసింజర్లందరూ ఎక్కగానే మళ్ళీ బస్ కదిలి వెళ్ళిపోయింది.

"ఎన్నాళ్ళయింది ఇక్కడికొచ్చి?" తెల్లడ్రస్సామె వచ్చి ఆనంద్‌కి కొంచెం ఎడంగా కూర్చుంటూ అడిగింది.

ఆనంద్ ఆమెవంక బెరుగ్గా చూశాడు. చూడటానికి మంచిదానిలా సౌమ్యంగానే కనిపిస్తోంది. తనకి కొంచెం సహాయం చెయ్యవచ్చేమో.

"రాత్రి" జవాబిచ్చాడు.

"ఎవరు తీసుకొచ్చారు?"

"చండిక"

"చండిక చేత చిక్కావా. ఇహ ఆ భగవతే నీకు దిక్కు" చిన్నగా నవ్వుతూ అన్నదామె.

"చండిక మీకు తెలుసా? ఆమె నన్నిక్కడికెందుకు తెచ్చింది?" ఆత్రుతగా అడిగాడు.

"నీ భార్య పట్ల నువ్వు క్రూరంగా ప్రవర్తించేవాడివా?" ఆమె అడిగింది. ఆనంద్ జవాబు చెప్పకుండా తలదించుకున్నాడు.

"నీలాంటి మగాళ్ళకి తగిన శాస్తి జరగాల్సిందే. ఆ పనిచెయ్యటానికే చండిక నిన్నిక్కడికి తెచ్చింది"

"నా గురించి ఆమెకెలా తెలుసు?"

"మహాభగవతి అనుగ్రహం వుంటే అన్నీ తెలుస్తాయి"

"మహాభగవతెవరు?" అంతకుముందు త్యాగి చెప్పిన వివరాలు గుర్తు తెచ్చుకుంటూ అడిగాడు.

"ఈ జగత్తుకు మూలం" చేతులెత్తి ఆకాశంవంక చూస్తూ దణ్ణంపెట్టిందామె.

"అదేంటి... ప్రపంచాన్ని సృష్టించింది దేవుడుకదా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"పురుషులు పెత్తనంచేసే మీ సమాజానికి మూలం దేముడే. కానీ ఇక్కడ పెత్తనం మాది. మా సమాజానికి మూలం భగవతే. తొందరేముంది... కొద్దిరోజుల్లో నువ్వు కూడా ఆమెనే ఆరాధించటం మొదలుపెడతావులే" కొంచెం చులకనగా చూస్తూ అన్నదామె.

ఆ మాటల్తో అతనికి అసలు విషయం గుర్తుకొచ్చింది. తను పారిపోవాలి. ఈమేదన్నా సహాయం చేస్తుందేమో ప్రయత్నించాలి.

"అనంతగిరి ఎక్కడుంది?" ఆశగా అడిగాడు.

"ఆ పర్వతాలవెనక" చేత్తో పర్వతాల్ని చూపిస్తూ పెద్దగా నవ్వింది.

"అక్కడికెళ్ళే బస్సులులేవా?"

"బస్సులుకాదుకదా... మీ దేవుళ్ళు కూడా నిన్నక్కడికి చేర్చలేరు. చూడబోతే చండిక లేని సమయంచూసి నువ్వు పారిపోవాలని ప్రయత్నంచేస్తున్నట్లున్నావ్. అది వృధా ప్రయాసే. చుట్టూ పర్వతాలున్న లోయ ఇది. పర్వతాల్ని దాటిపోవటం అసాధ్యం. అన్ని సాధనాలూవున్న పర్వతారోహక బృందాలు మాత్రమే అతికష్టంమీద వీటిని అధిరోహించగలరు. పిచ్చిపిచ్చి వేషాలేయకుండా తిరిగి వెళ్ళటం మంచిది. చండికకి కోపంవస్తే నీ జీవితం దుర్భరమవుతుంది" మంచిగా చెప్పిందామె.

"మరి మీరెలా వెళతారు?"

"ఆ మహాభగవతి అనుగ్రహంఉండి మానవులు కలిసికట్టుగా కృషిచేస్తే సాధించలేనిదేముంటుంది. ఈ పర్వతాలను దాటటానికి మేం ఒక లిఫ్ట్ తయారుచేసుకున్నాం. మగవాళ్ళకు అక్కడ ప్రవేశం ఉండదు. సాయుధులైన స్త్రీలు ఎల్లప్పుడూ కాపలా కాస్తుంటారు. అసలలాంటి ఏర్పాటుందని ఇక్కడి పురుషులెవరికీ తెలియదు"

"చండిక నన్నేం చెయ్యాలని ఇక్కడికి తెచ్చింది?" ఆమె చెప్పిన వివరాల్తో నిస్పృహచెంది నీరసంగా అడిగాడు ఆనంద్.

"ఏంచేస్తుంది... పెళ్ళిచేసుకుంటుంది. చండికలాంటి శౌర్యవంతురాలు భార్యగా దొరకటం నీ అదృష్టమే! ఒకరకంగా చండికకూడా అదృష్టవంతురాలే. నువ్వు చాలా అందగాడివి" ఆ మాటలంటూ బరువుగా నిట్టూర్చిందామె. తరువాత జేబులోని పర్సుతీసి అందులోనుండి చిన్న కార్డుతీసి ఆనంద్‌కి అందించింది.

"ఏ పరిస్థితుల్లోనయినా చండిక నిన్ను పెళ్ళాడకుండా వదిలేస్తే నా దగ్గరకురా. నీ అందాన్ని చూస్తుంటే నాకు మనసౌతోంది.

ఇక్కడికి దగ్గర్లోనే చిన్న సరస్సు ఉంది. అక్కడ బోటింగ్ క్లబ్ నడుపుతున్నాను. ఆదాయం బాగానేవుంటుంది. నిన్ను సుఖపెట్టగలను'' చిరునవ్వుతో ఆనంద్ బుగ్గమీద చిటికవేసింది. జేబులోన్నుంచి సిగరెట్ పెట్టెతీసి ఓ సిగరెట్ వెలిగించుకుంది.

''నిన్ను నాకు దక్కించమని ఆ మహాభగవతిని ప్రార్థిస్తాను'' వెళ్ళటానికి సమాయత్తమైంది.

''నాకొక సిగరెట్ ఇస్తారా?'' సిగ్గుపడుతూ అడిగాడు ఆనంద్.

అయిష్టంగా చూసిందామె ఆనంద్ వంక.

''పురుషులు సిగరెట్లు కాల్చకూడదు. రాత్రే వచ్చానంటున్నావు కనుక నీకిక్కడి పద్ధతులు ఏవీ తెలియవు. నీ జీవితంలో నువ్వు కాల్చే ఆఖరి సిగరెట్టిదే''

ఆనంద్‌కి ఒక సిగరెట్టు, అగ్గిపెట్టె ఇచ్చి వడివడిగా వెళ్ళిపోయిందామె. సిగరెట్ కాల్చుకుంటూ చేతిలోని కార్డువంక చూశాడు ఆనంద్.

ఆర్. మాతంగి, ప్రొప్రైటర్, గ్రీన్‌లేక్ బోటింగ్‌హౌస్, వడముడి - అని వుంది దాని మీద.

ఆ కార్డు చించి ముక్కలు ముక్కలుచేసి కసిగా విసిరేశాడు. అతని హృదయం కోపంతో మండిపోతోంది. అదంతా ఓ పీడకలలా అనిపించింది. గిచ్చి చూసుకున్నాడు. నొప్పి పుట్టింది. ఇదంతా ఎలా నమ్మటం? ఈ ఆడ ముండలు తనని బంధించటమేమిటి - పెళ్ళి చేసుకోవటమేమిటి? వీళ్ళని చూసి తను భయపడటమేమిటి. నాన్సెన్స్... రాత్రి చండిక దొంగ చాటుగా దెబ్బతీసింది. ఎదురుగా వస్తే ఎముకలేరేస్తా ననుకున్నాడు. దూరంగా కనబడుతున్న పర్వతాలవంక చూశాడు. శ్రమ ఎక్కువ కావచ్చు కానీ వాటిని ఎక్కలేకపోవటమేంటి. తనని భయపెట్టి వెనక్కు పంపటానికి మాతంగి అలాచెప్పి వుంటుంది. కొండలెక్కటంలో తనకు మంచి అనుభవమేవుంది. మరి ఆలస్యం దేనికి? చండిక వెతుక్కుంటూ రాక ముందే సాధ్యమైనంత దూరం వెళ్ళటం మంచిది.

సిగరెట్ విసిరేసి లేచినడవటం ప్రారంభించాడు. మాతంగి వెళ్ళినవైపు వెళ్ళలేదు. అటు బోటింగ్‌క్లబ్ వుండికాబట్టి జన సంచారం వుంటుంది. కాలిబాట వదిలేసి అడ్డదిడ్డంగా నడవటం ప్రారంభించాడు. రకరకాల ఆలోచనలు మనస్సుని కమ్మేశాయి. పర్వతాలను సమీపించేసరికి సాయంత్రమైంది. దగ్గరనుండి చూస్తే మాతంగి చెప్పిన దాంట్లో అబద్ధంలేదనిపించింది. నున్నటిరాళ్ళను నిటారుగా నిలబెట్టినట్లున్నాయి పర్వతాలు. ఒక్కసారిగా అతని ఆశలన్నీ నిరాశలయ్యాయి. నీరసంగా ఒక రాతిమీద చతికిలబడి ముఖానికి పట్టిన చెమట తుడుచుకున్నాడు. అతని స్వేచ్ఛకు అవరోధంగా నిల్చిన పర్వతాలు ఛాలెంజ్‌చేస్తూ వెక్కిరిస్తున్నట్లనిపించాయి.

'అసాధ్యం... వీటిని దాటాలనుకోటం దుస్సాహసమే అవుతుంది' అనుకున్నాడు మనస్సులోనే. కానీ ప్రయత్నించాలి... తప్పదు. జీవితమంతా వీళ్ళకు బందీగా ఇక్కడ పడి వుండటం నరకప్రాయం. ఈ పర్వతాలు అంతటా ఇట్లాగే వుండకపోవచ్చు. అంతా తిరిగి పరిశీలించాలి. కానీ ఇప్పుడు వీలుకాదు. చీకటిపడుతోంది. ముందీ రాత్రి గడపాలి. చండిక ఈపాటికి ఇల్లుచేరి వుండొచ్చు. తలుపులు పగలగొట్టి త్యాగినుంచి నిజం తెలుసుకునే సరికి తెల్లగ్గా ఏడుదాటుతుంది. రాత్రివేళ తన గురించి ఆచూకీ తీసి వెతుక్కుంటూ రావటం జరగని పని. రేపు ఆమె ఆరాలు తియ్యటం మొదలుపెట్టేసరికే సాధ్యమైనంత వరకూ ఏదో ఒక మార్గం కనిపెట్టి తప్పించుకోవాలి. ఈ రాత్రి మాత్రం నిశ్చింతగా వుండొచ్చు.'

ఎత్తుగా ఉన్న ఒక కొండ మీదకెక్కి చుట్టూ చూశాడు. దగ్గరలో చిన్న నీటిమడుగు కనబడింది. అక్కడికెళ్ళి ముఖం కడుక్కుని కడుపు నిండా నీళ్ళు తాగాడు. ఆకలిగా అనిపించినా భరిస్తూ అంతకుముందెక్కిన కొండరాతిమీదకెక్కి పడుకున్నాడు. పైన అది విశాలంగా ఉండటంవలన దొర్లిపడతాననే భయంలేదు. అలసిన మేను అతి త్వరగా నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

అర్ధరాత్రి. నిర్మలమైన ఆకాశంలో తారలు


వేకువ ఝామున నేస్తం
జెమిని
పళ్లపొడి
మీదంత సౌభాగ్యానికి
సంపూర్ణ రక్షణ
స్పిరమెంటు, పిప్పరమెంటు, లవంగనూనెల అపూర్వ సమ్మేళనం.
Gemini
TOOTH POWDER
GEMINI
FOR STRONG GUMS AND HEALTHY TEETH
Blended with SPEARMINT CLOVE PEPPERMINT OIL
GEMINI
TOOTH POWDER
SPECIAL
SPEARMINT OIL
GEMINI
MENTHOLATED
GEMINI CHEMICAL PRODUCTS
MACHILIPATNAM 521 001 (AP)
జెమిని కెమికల్ ప్రొడక్ట్సు
P.B.No.7 మచిలీపట్నం-521001.

దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. అమావాస్యరోజులు కావటంవలన వెన్నెలలేదు. గాఢనిద్రలోవున్న ఆనంద్ హఠాత్తుగా ఉలిక్కిపడిలేచాడు. చిమ్మచీకటి. ఎదురుగా రాక్షసుల్లా పర్వతాలు. గుండె గుబగుబలాడింది. మనసెందుకో కీడును శంకించింది. తీవ్రమైన ఆందోళన కలిగింది. ఏమైవుంటుంది? ఇంత రాత్రివేళ ఈ నిర్జనప్రదేశంలో తనకే ఆపద కలుగవచ్చు? అడవిజంతువులా! చల్లనిగాలి వీస్తున్నా చిరు చెమటలు పట్టాయి. దూరంగా గాలివాటున ఏదో శబ్దం వినవచ్చింది. ఏమిటది? చెవులు రిక్కించి విన్నాడు. అలలు అలలుగా గాలితెరలు మోసుకొస్తున్న ఆ శబ్దం అస్పష్టంగా వుంది. నక్కలు...తోడేళ్ళు! ఊహు... అవికాదు! జాగ్రత్తగా... ఇంకా జాగ్రత్తగా విన్నాడు. అప్పుడర్థమైంది. అవును... అది ఖచ్చితంగా కుక్కలు మొరుగుతున్న శబ్దమే! వాటి గురించి పట్టించుకోవాలా? లేచి నిలబడి ఆ శబ్దం వస్తున్న దిక్కుగా చూశాడు. దూరాన గుడ్డిగుడ్డిగా నాలుగైదు లైట్లు కనబడ్డాయి. అతని కాళ్ళు వణికాయి. గుండె వేగంగా కొట్టుకుంది. అనుమానంలేదు... ఖచ్చితంగా చండిక వేటకుక్కల సహాయంతో తనకోసం వేటాడుతోంది. ఇప్పుడేం చెయ్యాలి? పరుగెత్తి పారిపోతే! లాభంలేదు... ఎంతదూరమని పరిగెత్తటం! ఎంత వేగంగా పరిగెత్తినా ఐదునిమిషాల్లో తనని చేరుకోగలవు ఆ వేటకుక్కలు. ఆశ వదలుకున్నాడు. నిస్సహాయంగా పడుకుని ఆకాశం వంక చూశాడు. భగవంతుడా నువ్వే రక్షించాలి!

ఉండేకొద్దీ మరింత పెద్దగా, భయంకరంగా వినబడుతున్నాయి మొరుగులు. వాటితోపాటే మరోరకమైన శబ్దం - గుర్రపుడెక్కల చప్పుడు కావచ్చు. అంతా అయిపోయింది. కొద్దిక్షణాల్లో మళ్ళీ తను బంధించబడతాడు. ఆ తరువాత? ఏమో! ధైర్యంచేసి ఈ కొండరాతి మీద నుంచి తల్లకిందులుగా దూకితే! మళ్ళీ మనసొప్పలేదు. బతికుంటే బలుసాకైనా... తన ఆలోచనలకి తనే నవ్వుకున్నాడు.

శబ్దాలు మరింత... మరింత దగ్గరకొచ్చాయి. కుక్కలు బండరాతిమీద కెగబాకలేక భయంకరంగా మొరుగుతూ చుట్టూ తిరుగుతున్నట్లున్నాయి. గుర్రపుడెక్కల చప్పుడు ఆగిపోయింది.

"పైన ఉండివుంటాడు" ఎవరిదో ఓ కంఠం.

"నేను పైకెక్కి చూస్తాను... మీరుండండి"

చండికదా ఆ గొంతు? ఎవరో పైకెక్కుతున్న చప్పుడు, రాతిమీద దుస్తుల రాపిడి శబ్దం.

హఠాత్తుగా అతని ముఖంమీద శక్తివంతమైన బ్యాటరీ లైట్ వెలుతురు పడింది. కళ్ళకు చేతులడ్డం పెట్టుకుంటూ లేచి నిలబడ్డాడు.

"దగ్గరకొస్తే చంపేస్తా. ఫో...వెళ్ళిపో..." పిచ్చిగా కేకలు పెట్టాడు.

లైటు మరింత దగ్గరకొస్తోంది. లాభంలేదు తెగించాలి. ఎటు తప్పించుకోవటానికీ వీలుకానప్పుడు మూర్ఖంగా ఎదురు దాడిచేసే జంతువులా పిడికిళ్ళు బిగించి భయంకరంగా అరుస్తూ ఆ లైటువంక పరుగెత్తాడు. మరుక్షణం అంతెత్తు ఎగిరి వెల్లకిలా కిందపడ్డాడు. గట్టిగా తల రాతికికొట్టుకుంది. అదే సమయంలో డొక్కల్లో బలంగా ఓ తన్ను. ఊపిరాడటంలేదు... నొప్పి... నొప్పి... భరించలేని యమబాధ. కదలి కలేకుండా అచేతనంగా పడిపోయాడు.



మెల్లగా కదులుతూ కళ్ళు విప్పి చూశాడు ఆనంద్. తను మంచం మీద పడుకుని ఉన్నాడు. ఎదురుగా కుర్చీలో కూర్చుని వుంది చండిక. చూపు మరల్చుకున్నాడు. వళ్ళంతా నొప్పిగా ఉంది.

"ఎలా వుంది?" లేచి దగ్గరకొచ్చి అడిగింది చండిక.

ఆనంద్ మాట్లాడలేదు. తిరుగుతున్న సీ

లింగ్ ఫ్యాన్‌వంక చూస్తున్నాడు. దానిలాగానే అతని తల తిరుగుతోంది.

"దున్నపోతులాగున్నావ్! చిన్న చిన్న దెబ్బలు నీకు లెక్కలోనివి కాదులే. లేచి ముఖం కడుక్కో" రెక్క పట్టుకుని లేపి కూర్చోపెట్టింది.

"నీకోసం నిన్న కొత్తబట్టలు తెచ్చాను. అవిగో ఆ బీరువాలో ఉన్నాయ్. స్నానం చేసి నీకు నచ్చినవి వేసుకో. త్వరగా తెమలాలి. త్యాగి బ్రేక్‌ఫాస్ట్ సిద్ధంచేస్తున్నాడు. పాపం...నిన్నంతా నువ్వేమీ తినలేదు. కానివ్వు." ఆమె మాటలు చాలా మృదువుగా ఉన్నాయి.

కొత్త టూత్‌బ్రష్, టంగ్‌క్లీనర్ తెచ్చిఇచ్చింది. యాంత్రికంగా వాటినందుకుని బాత్‌రూమ్ వైపు దారి తీశాడు. తలుపు దగ్గరకేసి ఆమె బయటికెళ్ళింది.

గోరువెచ్చని నీళ్ళతో స్నానం చేసేసరికి వళ్ళు, మనస్సు కాస్త తేలిక పడ్డాయి. వళ్ళు తుడుచుకొని టవల్ చుట్టుకొని గదిలోకొచ్చాడు. టేబుల్ మీద ఓ అరడజన్ పేకెట్లు ఉన్నాయి. ఒకటి తెరిచి చూశాడు. అది పసుపురంగు పూలున్న నీలంగౌను.. మరో ప్యాకెట్ తెరిచాడు. చర్చిలో ఫాదర్లు వేసుకొనే పొడవాటి గౌన్‌లా ఉంది. కాళ్ళదగ్గర మాత్రం సన్నగా ఇరుకుగా ఉంది. మిగతా ప్యాకెట్లు చూడాలనిపించలే దతనికి. ఏం చెయ్యటానికీ తోచక అలాగే నిలబడ్డాడు.

తలుపు తెరుచుకొని లోపలికొచ్చింది చండిక. ఒక్కక్షణం ఆచ్ఛాదనలేని అతని శరీరం వంక కాంక్షలు నిండిన కళ్ళతో చూసి చూపు మరల్చుకుంది.

"ఇవేనీ నచ్చలేదా? పోనీ సాయంత్రం నిన్ను కూడా షాపుకి తీసుకెళతాలే! నీకిష్టమైనవి సెలక్ట్ వేసుకుందువుగాని. ఇప్పటికిది వేసుకో" అంది అతని వంక చూడకుండానే.

"ఇవి ఆడాళ్ళేసుకునే గౌన్లు...నాకెందుకు" కోపాన్ని దిగమింగుకుంటూ అన్నాడు.

"ఆడాళ్ళవనీ, మగాళ్ళవనీ వేసుకునే వాళ్ళ పద్ధతుల్ని బట్టి ఉంటాయి. ఇక్కడి మగాళ్ళందరూ ఈ రకం దుస్తులే ధరిస్తారు. త్వరగా వేసుకో" కొంచెం అసహనంగా అంది చండిక.

"ఇలాంటి వెధవపద్ధతులు నాకొద్దు. ఊరికైనా మళ్ళీ నా ప్యాంటు, షర్టే వేసుకుంటా" బాత్‌రూమ్‌లోకి వెళ్ళబోయాడు ఆనంద్.

ఒక్క ఉదుటున జుట్టుపట్టుకుని వెనక్కిలాగింది అతన్ని.

"నీ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించటానికి ఇది నీ అబ్బఇల్లుకాదు. మర్యాదగా చెప్పినట్లు చెయ్!" అజ్ఞాపించింది.

కలబడి ఆమెను నెట్టివెయ్యటానికి ప్రయత్నించాడు. వాచి చెంప పగలకొట్టింది. కోపం పట్టలేక గుడ్లురుముతూ బెల్ట్‌తీసింది.

'నీలాంటి పందులకు మాటలు లాభంలేదు. నీ బోడి మొహానికి ప్యాంట్లు కావాలా? ఇవిగో తీసుకో'

బెల్టు అతని వంటిమీద నాట్యమాడింది. బాధతో అరుస్తూ మెలికలు తిరిగిపోయాడు. నడుము చుట్టూ వున్న టవల్‌జారిపోయింది.

"వద్దు...వద్దు! కొట్టొద్దు. నీమాటే వింటా" దీనంగా ప్రాధేయపడ్డాడు.

"నువ్వు కొట్టినప్పుడు నీ పెళ్ళానికికూడా ఇంత నొప్పిపుట్టి వుంటుంది. గుర్తుతెచ్చుకో" నీలంరంగు గౌను అతని ముఖానవేసి వడివడిగా బయటకెళ్ళింది చండిక.

అతని వళ్ళంతా వాతలతో కందిపోయింది. మెల్లగా అవస్థపడుతూ గౌను వేసుకున్నాడు. డ్రస్సింగ్ టేబుల్ అద్దంలో తన ప్రతిబింబం చూసుకొని అసహ్యించుకున్నాడు.

ఈ అవమానాన్ని సహిస్తూ బతకటం కంటే చావటంమేలు. కానీ చచ్చి సాధించేదేమిటి? అణిగిమణిగి ఉండి అవకాశం వచ్చినప్పుడు దెబ్బతియ్యాలి. వీళ్ళందర్నీ సమూలంగా నాశనం చెయ్యాలి. కాస్త ఓర్పు, పట్టుదల వుంటే ఏనాటికైనా సాధించవచ్చు. కసిగా మనస్సులోనే తిట్టుకుంటూ ఒట్టుపెట్టుకున్నాడు.

పది నిమిషాల తర్వాత తిరిగొచ్చింది చండిక.

"బాగుంది...చక్కగా సరిపోయింది. ఇప్పుడెంత అందంగా ఉన్నావో!" కన్నార్పకుండా అతనివంకే చూస్తూ అంది.

ఆమెవంక చూడకుండా బెడ్‌దగ్గరికి నడవబొయ్యాడు. గౌను బిగుతుగా ఉండటం వలన ఫ్రీగా నడవలేక అవస్థపడ్డాడు.

"కొన్నాళ్ళుపోతే నువ్వే నెమలికి నడకలు నేర్పేటట్లున్నావే" పకపకనవ్వుతూ అంది చండిక.

ఆ నవ్వు వింటుంటే అతనికి వంటిమీద చీమలూ, జెర్రులూ పాకుతున్నట్లనిపించింది.

"రా...టిఫిన్ తిందాం" అతని చెయ్యిపట్టుకు నడిపించింది.

ఇద్దరూ ఎదురుగా డ్రెసింగ్ టేబుల్





ముందు కూర్చున్నారు. త్యాగి వేడివేడి ఇడ్లీలు తెచ్చిపెట్టేడు. అయిష్టంగానే ఆవురావురు మంటూ తినసాగాడు ఆనంద్. తరువాత కాఫీ తాగుతూ మెల్లగా సంభాషణ మొదలుపెట్టాడు.

''నువ్వుచేస్తున్న పని ఎంత ప్రమాదకరమైందో నీకు తెలియదు''

''ఆగాగు...ఆడాళ్ళని 'నువ్వు' అని అనకూడదు. 'మీరు' అను. లేకపోతే 'ఏమండీ' అను'' సరిదిద్దింది చండిక.

ఇష్టం లేకపోయినా సంబోధన మార్చకతప్పలేదు ఆనంద్‌కి.

''నేను బాధ్యతాయుతమైన ఆఫీసర్ని. హఠాత్తుగా నేను కనబడకుండాపోతే నాకోసం పోలీసులు వెతకటం మొదలుపెడతారు. తీగ లాగితే డొంకంతా కదులుతుంది. మీ రహస్యం బట్టబయలవుతుంది,'' ఆమె వంక చూడకుండానే అన్నాడు.

''నీకంటే పెద్దపెద్ద ఆఫీసర్లే ఇక్కడ చాలా మంది వున్నారు. ఆ విషయాల గురించి మేం అన్ని జాగ్రత్తలూ తీసుకుంటాం. నువ్వేం ప్రత్యేకంగా హెచ్చరించవలసిన అవసరం లేదు'' సీరియస్‌గా అంది చండిక.

''మీరెవరో నాకు తెలియదు. నేను మీకెలాంటి అపకారం చెయ్యలేదు. నన్ను బంధించి నాస్వేచ్ఛ హరించటం మీకు సమంజసంకాదు. దయచేసి నన్ను వెళ్ళిపోనివ్వండి'' అర్థింపుగా అన్నాడు.

''నువ్వు నాకపకారం చెయ్యకపోయినా నాసాటి స్త్రీకి- పార్వతికి అపకారం చేశావు. నీతో జీవితం పంచుకోవటానికి వచ్చిన ఆమెకు నువ్విచ్చిందేమిటి? తిట్లు, తన్నులు, అవమానాలు తప్ప! అవేవీ నీకు తప్పుగా తోచలేదు. నీ హక్కుగా భావించావు. ఇప్పుడు నిన్ను నేను గెల్చుకున్నాను. నా ఇష్టప్రకారం నువ్వు నడుచుకోవాలి''

''పార్వతిని నేను చట్టప్రకారం వివాహం చేసుకున్నాను. ఆమె సక్రమంగా ఉండకపోతే శిక్షించే హక్కు నాకుంది. అయినా సమాజానికి విరుద్ధంగా నేను ప్రవర్తించలేదే! దాదాపు పురుషులందరూ నాలాగే వుంటారు''

''సమాజం, హక్కులూ ఎక్కడినుంచొ

వ్చాయి. తరతరాలుగా స్త్రీని బానిసగా మార్చుకోవటానికి ఏర్పరచుకున్న మీ హక్కులు ఇహ చెల్లవు. నేనూ స్త్రీనే. కానీ నాకంటే నువ్వు దేంట్లో అధికుడివి? నా సమాజం ప్రకారం, నా హక్కుల ప్రకారం నేను ప్రవర్తిస్తాను. మరికొద్దికాలంలోనే మీ సమాజాన్ని నాశనం చేసి మా ఆధిపత్యం నిరూపించుకుంటాం" కోపంతో ఆమె కళ్ళు నిప్పులు కురిపించాయి.

"మీరు ప్రకృతి విరుద్ధంగా మాట్లాడుతున్నారు. పిల్లల్ని కని పెంచటం స్త్రీకి నిర్దేశించబడిన పని. సంపాదించటం, కుటుంబాన్ని పోషించటం, సంరక్షించటం పురుషుడి పని" భయపడుతూనే అన్నాడు ఆనంద్.

"బోడి మీరు పోషించి రక్షించేదేమిట్రా తొత్తు వెధవల్లారా! నవమాసాలూ గర్భంలో పోషించి సంరక్షించే మేము ఆ తర్వాత పోషించలేమా... సంరక్షించలేమా? ప్రకృతి స్త్రీని జుట్టు పెంచుకోమందా? చీరలు కట్టుకోమందా? బొట్టు కాటుకలు పెట్టుకుంటేనే అతడి దాసివని,తాళి కట్టించుకుంటేనే పెళ్ళాన్నివని నిర్దేశించిందా? మాకూ జవసత్వాలున్నాయి. నీలాంటి దద్దమ్మల్ని పదిమందిని పెళ్ళిచేసుకుని పోషించి రక్షించగలను. ప్రకృతి మామీద పెట్టిన బాధ్యతల్ని మమ్మల్ని ప్రలోభపెట్టి మీరు చేజిక్కించుకున్నారు. మా తప్పేమిటో తెలుసుకున్నాం...మీ ఆటలు సాగవ్"

ఆమె మాటల్ని వినటం ఆనంద్‌కి చేతకాలేదు. ధైర్యం కూడా చాలలేదు. ఆమె ముఖం ఎర్రగా కందిపోయింది. పెదాలు వణుకుతున్నాయి. కోపాన్ని అతికష్టంమీద అదుపులో పెట్టుకుంటోందని స్పష్టంగా తెలుస్తోంది.

"మీరు మంచి బలవంతులు...కాదనను. కానీ ప్రపంచంలో మీలాంటివాళ్ళు అరుదుగా వుంటారు. పుట్టుకతోనే స్త్రీ పురుషుడి కంటే బలహీనురాలు....." ఇంకా ఏదో చెప్పబోయాడు.

"నోర్ముయ్!" పెద్దగా అరిచి కోపం పట్టలేక బల్లమీద గట్టిగా గుద్దింది. గ్లాసులు ఎగిరిపడి నీళ్ళు ఒలికాయి. వంటింట్లో నుంచి త్యాగి పరిగెత్తుకొచ్చాడు. చందిక బలవంతాన నిగ్రహించుకుని త్యాగిని వెళ్ళిపొమ్మన్నట్లు సైగచేసింది. అతను వెళ్ళిపోయాడు. మళ్ళీ తంతుందేమోనని భయపడ్డాడు ఆనంద్. కానీ చందిక ఆ ప్రయత్నం చెయ్యలేదు.

"నీతో మాట్లాడటం అనవసరం. నాలుగైదు నెలలాగు. నీ జుట్టు బాగా పెరిగి జడవేసుకోటానికి వీలైనంతర్వాత నిన్ను పెళ్ళిచేసుకుంటాను. మనకి పిల్లలు పుడతారు. ఎవరు బలవంతులవుతారో. ఎవరు బలహీనులవుతారో స్వయంగా నీ పెంపకంలోనే తెలుస్తుంది" కోపంపోయి హాస్యం ధ్వనించింది ఆమె కంఠంలో.

ఆనంద్ మ్రాన్పడిపోయాడు. తనచేత ఎలాంటి పనులు చేయించబోతుందో తల్చుకుంటే కంపరం పుట్టింది.

"నాకిష్టంలేకుండా నన్ను పెళ్ళిచేసుకోలేవు. నా జుట్టు వచ్చినా పెంచుకోను." పిచ్చిపిచ్చిగా అరవటం మొదలుపెట్టాడు.

అతని రెక్కపట్టుకుని బరబరా లోపలికి ఈడ్చుకెళ్ళింది.

"నోర్మూసుకుని పడుండు. మధ్యాహ్నం నీకో మంచి బహుమానం తెస్తాను" తలుపులు మూసి తాళం వేసివెళ్ళిపోయింది.

పది నిముషాలాగి గౌను తీసేసి తన ప్యాంటుషర్టు బాత్రూమ్‌లో నుంచి తెచ్చుకుని వేసుకున్నాడు. మంచంమీద పడుకుని తన పరిస్థితి అంచనా వేసుకోసాగాడు. ఎంత ఆలోచించినా అక్కడినుంచి బయటపడేమార్గం కానీ, చందికను ప్రతిఘటించే ధైర్యంకానీ లభించలేదు. ఆలోచనలతో సతమతమౌతూ నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాడు.

ఏవేవో కలలు

వింతవింత లోకాల్లో విహరిస్తున్నాడు.

ఒక పెద్ద హోమగుండం ముందు తన తండ్రి కూర్చుని వున్నాడు. వేషం భీకరంగా వుంది. ఏవేవో మంత్రాలు ఉచ్చరిస్తున్నాడు. తన తల్లికి విచిత్రమైన రెక్కలున్నాయి. ఆమె హోమగుండంచుట్టూ ఎగురుతోంది. ఆమె రెక్కలనుండి కన్నీరు ధారలై హోమగుండంలో పడుతోంది. కానీ అగ్ని చల్లారటంలేదు సరిగదా మరింత ఎక్కువై తల్లి రెక్కల్ని కాల్చింది. ఆమె పెద్దగా ఆర్తనాదం చేస్తూ మంటలోపడి మాడిపోయింది. తండ్రి వికటాట్ట

హాసం చేస్తున్నాడు.

దృశ్యం మారింది...

ఇప్పుడు తన ఎదురుగా పార్వతి వుంది. ఆమె చేతిలోని పిల్లని తను లాక్కోవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆమె ప్రాధేయపడు తోంది. తనామెను కొడుతున్నాడు. కాళ్ళతో తంతున్నాడు. చివరికి పిల్లని లాక్కుని ఆమెని జుట్టుపట్టుకుని వీధిలోకి గెంటి తలుపు మూసేశాడు. ఏడుస్తున్న పసిగుడ్డును చూసి వికటంగా నవ్వుతున్నాడు.

గది తలుపుల తాళం తీస్తున్న చప్పుడుతో ఆనంద్ మేల్కొన్నాడు. తలుపు తెరిచి చండిక వచ్చింది. నిద్రమత్తు వదిలించుకుని లేచి కూర్చున్నాడు. కాస్సేపు చండిక అతనివంక తీక్షణంగా చూసింది. తరవాత వచ్చి మంచంమీద కూర్చుని చేతిలో వున్న ప్యాకెట్ విప్పసాగింది.

"నీకో బహుమానం తెస్తానన్నాకదా... ఇదిగో తెచ్చాను. ఏంటో చెప్పు చూద్దాం" కవ్విస్తూ అంది.

ఆనంద్ బదులు చెప్పలేదు. ప్యాకెట్‌వంకే చూస్తున్నాడు. బహుశా మళ్ళీ ఏ చీరో, గౌనో తెచ్చి వుంటుందనుకున్నాడు.

"ఎప్పుడైనా సర్కస్ చూశావా?" అడిగింది.

అతను తల ఊపాడు.

"భయంకరమైన పులులూ, సింహాలూ కూడా రింగ్ మాష్టరు ముందు పిల్లులే! ఎందుకో తెలుసా?" అతని కళ్ళలోకి చూసింది.

తల అడ్డంగా ఊపి చూపు మరల్చుకున్నాడు.

"ఇందుకు" ప్యాకెట్‌లో నుండి చిన్న కొరడా తీసి ఝుళిపించింది.

"రెండు నిమిషాల్లో మళ్లీవస్తాను. నీవంటి మీద ఈ ప్యాంటుషర్టు కనబడితే వాటితోపాటు నీ చర్మాన్ని కూడా ఇది పేలికలు చేస్తుంది" విసవిసా నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

ఏం చేద్దామా అని ఆలోచించే టైమ్‌కూడా లేదు. యాంత్రికంగా గబగబా ప్యాంటుషర్టు తీసేసి మళ్ళీ గౌను వేసుకున్నాడు ఆనంద్. ఖచ్చితంగా రెండు నిమిషాల తర్వాత తిరిగొచ్చింది చండిక.

"వెరీగుడ్... నువ్వు సర్కస్ సింహానివే. రా భోంచేద్దాం!"

మౌనంగా ఆమె వెంట వెళ్ళి భోంచేశాడు. భోజనం తర్వాత మళ్ళీ గదిలోకినెట్టి తాళం వేసింది.

వారంరోజులు గడిచాయి. ఆనంద్‌కి పిచ్చెక్కినట్లయింది. గడ్డంమాసి దట్టంగా పెరిగి చికాకు కలిగిస్తోంది. మొదటి రెండుమూడు రోజులు సిగరెట్లు, విస్కీలేక వాటికోసం పరితపించాడు. తరువాత నెమ్మదిగా ఆ కోర్కెలు తగ్గిపోయాయి. రోజూ వేళకి తినటం, ఒంటరిగా గదిలో పడుకోవటం. చండికతో మాట్లాడటానికి అతను ప్రయత్నించలేదు. ఆమెకూడా చొరవివ్వలేదు. ఒంటరితనం- ఆలోచనలు అతనికి దుర్భరంగా అనిపించాయి. మొదట్లో తరచుగా కలలొచ్చేవి. వాటిలో పార్వతీ, పిల్ల కనిపించేవారు. ఒకరోజు అలాంటి కలగని లేచి వాళ్ళని తల్చుకుని విపరీతంగా దుఃఖించాడు. తర్వాత కలలు కూడా రావటం మానేశాయి. నిజంగానే అతని పరిస్థితి సర్కస్ సింహంలా వుంది. చివరికొక రోజు తెగించి చండికతో మాట్లాడాడు.

"నేనీ బందిఖానాలో ఉండలేను. నాకు స్వేచ్ఛకావాలి. ఇంత నరకయాతన పెట్టే బదులు ఒక్కసారిగా నన్ను చంపెయ్యండి"

చండిక అతనివంక నిదానించి చూసింది. మానసికంగా అలసినట్లు కనబడుతున్నా శారీరకంగా బాగానే ఉన్నాడు.

"ఫరవాలేదు. తొందరగానే దారికొచ్చావ్! ఎంతైనా కాబోయే మొగుడివి కదా! నువ్వంటే ప్రేమ, జాలి లేవనుకోకు. చెప్పినట్లు వింటే నీ జీవితానికే లోటూరాదు. ప్రస్తుతానికి నువ్వీ ఇంట్లో స్వేచ్ఛగా తిరగొచ్చు. జుట్టు పూర్తిగా పెరగందే గడపదాటటానికి వీల్లేదు. త్యాగి నీకు వంటపని, ఇంటిపని నేర్పుతాడు. శ్రద్ధగా నేర్చుకో. మన పెళ్ళి జరిగేలోపల బాగా అనుభవం గడించు" ప్రేమగా అతని గడ్డాన్ని నవరిస్తూ చెప్పింది.

ఆమె మాటలు అతన్ని మరింత బాధించాయి. కాదంటే ఖైదు. కోపగించుకుంటే కొరడాదెబ్బలు... ఏంచెయ్యాలి?

"నన్ను బానిసకంటే హీనంగా చూస్తున్నారు" దుఃఖంతో నిండిన జీర వుంది అతని కంఠంలో.

"వంటపనీ, పాచిపనీ చెయ్యటం బానిసత్వమైతే బయటి ప్రపంచంలోని స్త్రీలందరూ బానిసలేకదా? ఇంటెడు చాకిరీ చేసి నీకే కష్టము కలుగకుండా చూసుకున్న పార్వతిని నువ్వు బానిసలా చూడలా! అయినా దీంట్లో తప్పేముంది? ఇక్కడి మగాళ్ళందరూ ఆ పనులే చేస్తారు. నిన్ను చూసి వెక్కిరించేవాళ్ళెవరూ వుండరు. నలుడూ, భీముడూ మీ వాళ్ళే కదా! వాళ్ళ అడుగుజాడల్లో నడిచాననుకో"

"వద్దండీ. దయచేసి ఈ పనులు మాత్రం చేయించొద్దు" ప్రాధేయపడ్డాడు.

"ఇవే మాటలు కట్టిపెట్టు. నాకు తిక్కరేగితే మంచిదాన్నికాను" కోపంగా, కఠినంగా చెప్పింది.

ఆనంద్ మాట్లాడలేకపోయాడు. ఆరోజునుంచే అతని పనిమొదలైంది. ముందుగా ఇల్లు శుభ్రంగా ఊడ్చి తుడవటం చూపించాడు త్యాగి. వంటచేస్తున్నప్పుడు ప్రక్కనే నిలబడి కావలసినవి అందించాడు. గదిలో పెట్టి మూసివేయబడకుండా ఇల్లంతా తిరగటం కాస్త బాగుందనిపించింది. కానీ ఈ క్రొత్తపనులు చేయటం అవమానంగా తోచింది. కానీ చెయ్యగలిగిందేముంది? ఎన్ని అవమానాలైనా భరించాలి. అన్నిరోజులూ ఒకేలా ఉండవు. తనకూ ఓ అవకాశం రాకపోదు. అంతవరకూ వేచి వుండాల్సిందే.

ఆ సాయంత్రం [illegible] వరండాలో కూర్చున్నాడు. ఉన్నట్టుండి గేటుతీసిన చప్పుడైతే తలఎత్తి చూశాడు. ఎదురుగా ఓ అపరిచిత పురుషుడు వయ్యారంగా నడుచుకుంటూ వస్తున్నాడు. వయస్సు ఇరవైదాటి ఉండదు. లేత తమలపాకులా నున్నగా మృదువుగా ఉన్నాడు. మీసాలు, గడ్డాలు ఒత్తుగా పెరిగి ఉన్నాయి. జారెడు జడవుంది. మల్లెపూలు పెట్టుకుని ఉన్నాడు.

"మీవారున్నారా?" వరండాలోకి రాకుండా మెట్లదగ్గరే నిలబడి అడిగాడు. ఆనంద్‌కి ఆ ప్రశ్నలోని అంతర్యం అర్థమైంది. ఆ వ్యక్తిని చూస్తుంటే నవ్వు, కోపం, అసహ్యం అన్నీ ఒక్కసారిగా కలిగాయి.

"లేరు" ముక్తసరిగా సమాధానమిచ్చాడు.

అప్పుడతను వరండాలోకొచ్చి ఆనంద్ పక్కనే ఖాళీగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఆ ఎదురిల్లేనండి. డాబా మీద ఆరేసిన బట్టలు తీద్దామని వెళితే మీరు కనిపించారు. మిమ్మల్నెప్పుడూ చూడలేదు. కొత్తగా వచ్చారేమోననుకున్నా. ఓసారి పలకరించి పరిచయం చేసుకోవాలనిపించి వచ్చా"

అతను మాట్లాడేతీరు, హావభావాలు ఆనంద్‌కి విచిత్రంగా తోచాయి. అతనితో మాట్లాడాలంటే రోత పుట్టింది. కానీ మాట కలిపితే ముఖ్యమైన వివరాలేమైనా తెలియవచ్చనిపించింది.

"మీ పేరేంటి?" రెండు బియ్యపు గింజలు నోట్లోవేసుకుంటూ అడిగాడు.

"మహా భగవతి వరప్రసాద్" కులుక్కుంటూ చెప్పాడతను. "మరి మీ పేరో?"

"ఆనంద్"

"మీ పెళ్ళయి ఎన్నాళ్ళయింది? మండికగారు చెప్పాపెట్టకుండా పెళ్ళిచేసుకుంటారనుకోలా. అందర్నీ పిలిస్తే ఖర్చవుతుందనుకున్నారేమో?" అమాయకంగా అడిగాడు.

"మాకింకా పెళ్ళి కాలా" కొంచెం విసుగ్గా జవాబు చెప్పాడు ఆనంద్.

"బంగారు మొలతాడు కనబడకపోతే నాకూ ఆ అనుమానమే వచ్చింది. ఒకవేళ తీసి దాచారేమోననుకున్నా. అయితే మీరు మండికగారి బంధువులా?" మొగుడు కానందుకు విచారిస్తున్నట్టు ముఖంపెట్టాడు.

"ఎవరెప్పుడైనా ఆ పర్వతాలు దాటి అవతలికెవరైనా వెళ్ళారా?" అతని జవాబు కోసం ఆత్రంగా ఎదురుచూస్తూ అడిగాడు ఆనంద్.

"పర్వతాలు దాటి అవతలికి వెళ్ళటం ఏమిటి! చచ్చింతర్వాత వెళ్ళేదానికి బతికున్నవాళ్ళెలా వెళతారు?" ముఖం మాడ్చుకుని జవాబు చెప్పాడు ప్రసాద్.

తన ప్రశ్న అతని మనస్సుని కష్టపెట్టిందని గ్రహించాడు ఆనంద్.

"ఏదో సరదాగా అన్నాను.... మీరు బాధపడకండి" ఓదార్పుగా అన్నాడు. మరికాస్సేపు కూర్చుని రకరకాల పూలగురించి, దుస్తుల గురించి, ఆభరణాల గురించి మాట్లాడి వెళ్ళిపోయాడు ప్రసాద్.

ఆ రాత్రి చాలాసేపు ప్రసాద్‌ని గురించే ఆలోచించాడు ఆనంద్. ఒక పురుషుడు ఇలా ఎలా ఉండగలుగుతున్నాడు? జీవితంలో అతనికి మంచి దుస్తులకన్నా, ఆభరణాలకన్నా ఆలోచించదగ్గ విషయాలు లేవన్నట్లు మాట్లాడాడు. చక్కగా ఇంటి పనులు చేయటం అతని జీవిత పరమార్థంలాగుంది. తన విషయంవేరు. తను తప్పనిసరి పరిస్థితుల్లో ఆ పనులు చేస్తున్నాడు. ఇష్టంలేని దుస్తులు ధరిస్తున్నాడు. కానీ ప్రసాద్ వాటిని చాలా సహజంగా తీసుకుంటున్నాడు. అది ఎలా సాధ్యం? అసలు మనుషుల అభిప్రాయాలూ, అభిరుచులూ ఎలా ఏర్పడతాయి? ప్రసాద్ ఇక్కడే పుట్టిపెరిగాడు. చిన్నప్పటినుంచీ తన చుట్టూ వున్న పురుషులు ఎలా వున్నారో, ఎలా ప్రవర్తిస్తున్నారో తనూ అలానేచేస్తున్నాడు. దానిలో అసహజమూ, అసహ్యమూ అతనికేమీ కనబడటంలేదు. కానీ తను వేరే పరిస్థితుల్లో పెరిగాడు. పుట్టినప్పటినుండీ ఇంట్లో తండ్రి పెత్తనం చెయ్యటం చూశాడు. ఆయన కోపతాపాల్ని తల్లి ఓపిగ్గా భరించటం చూశాడు. తను చదివిన పుస్తకాల్లో, చూసిన సినిమాల్లో స్త్రీని విలాసవస్తువుగా చిత్రించటం మాత్రమే జరిగింది. పైగా స్త్రీలందరూ పురుషుల అండదండలు లేకుండా బతకలేమన్నట్లు ప్రవర్తించారు. కాబట్టే స్త్రీఅంటే చులకన భావం ఏర్పడ్డది.

పుట్టుకతో పురుషుడు శారీరకంగా స్త్రీకంటే బలవంతుడు కాదా? తను వచ్చిన ప్రపంచంలో పురుషుడే బలవంతుడు. కానీ ఇక్కడ! ప్రసాద్ ఎంత బలహీనంగా ఉన్నాడు! అతనిలో ఏకోశాన చూసినా మృదుత్వమూ, మార్దవమూ మాత్రమే కనిపిస్తున్నాయి. బహుశా ఇక్కడ పుట్టిపెరిగిన పురుషులందరి స్థితి అంతేకావచ్చు. అంటే పౌరుషం, దారుఢ్యం కేవలం పురుషలక్షణాలు కావా? ప్రపంచంలో రకరకాల జీవరాసులున్నాయి. వాటిలో కూడా స్త్రీపురుష భేదాలున్నాయి. మరి వాటన్నిటిలోనూ ఆడజాతి బలహీనంగానే ఉంటోందా? ఆడకుక్కలు మొగకుక్కలకన్నా బలహీనంగా ఉంటాయా? లేదే! పిల్లులు, ఎలుకలు, కుందేళ్ళు, పావురాళ్ళు, ఏనుగులు, గుర్రాలు, పులులు, కోతులు - వీటిలో ఎక్కడా అసమానతలున్నట్లు తోచదే! మరి పశువుల మాటేమిటి! ఆవుకన్నా ఎద్దుబలంగా ఉంటుంది. గేదెకన్నా దున్న బలంగా ఉంటుంది. ఎందువల్ల? ఆవులూ, గేదెలూ పాలకోసం పెంచబడతాయి. పగలంతా తిరిగి గడ్డిమెయ్యటం వాటిపని. ఎద్దులూ, దున్నలూ అలాకాదు. పొలం దున్నాలి, బళ్ళులాగాలి. అంటే శారీరక శ్రమమూలంగా వాటికండరాలు మరింత దృఢంగా పెద్దవిగా ఏర్పడి ఉండొచ్చు! ఏమో.... డార్విన్ ఉంటే తన సందేహాలు తీర్చగలడేమో!

స్త్రీల విషయంలో ఏం జరిగింది. ప్రాకృతికావస్థలో ఎవరి ఆహారం వాళ్ళే సంపాదించుకోవాల్సి వచ్చినప్పుడు స్త్రీ పురుషుడికన్నా బలహీనంగా ఉందా? ఉండి వుండకపోవచ్చు. అప్పుడు స్త్రీ తన ఆహారం తనే సంపాదించుకోవాలి. వేటాడటం, ఆత్మరక్షణ చేసుకోవటం పురుషుడికెంత అవసరమో స్త్రీకీ అంతే అవసరం. ఒక్కోసారి ఆహారంకోసం పురుషుడితోనే తలపడి పోరాడవలసి వచ్చేదేమో? ఆదిమ సమాజంలో కూడా స్త్రీదే ఆధిపత్యమని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. అంటే కుటుంబ వ్యవస్థ ఏర్పడి మనిషి స్థిరనివాసం ఏర్పరచుకున్న దశలో స్త్రీఆధిపత్యం పోయి వుండాలి. కారణాలు స్పష్టమే! ఆహారం సంపాదించటానికి స్త్రీ పాటుపడాల్సిన పనిలేదు. జీవితంలో ఎక్కువ భాగం పిల్లల్ని కని పెంచటానికే సరిపోయుంటుంది. క్రమేపీ ఆమె శరీరదారుఢ్యాన్ని కోల్పోయి వుండాలి. పైగా తెలివితేటలు పెరిగే కొలదీ రకరకాల కట్టుబాట్లు ఏర్పరిచాడు. పురుషుడు అవన్నీ తనకు అనుకూలంగా, స్త్రీకి వ్యతిరేకంగా ఏర్పరచుకున్నాడు. అనాదిగా వాటిని పాటిస్తున్న స్త్రీలకి అవి సహజంగా తోస్తున్నాయి. హిందూ సమాజంలో వివాహిత స్త్రీ తప్పనిసరిగా మంగళసూత్రం ధరించాలి. దానికి పవిత్రత ఆపాదించబడింది. దాని అవసరం ఏమిటో, తనకు మంచిదో చెడుదో ఆలో

పించే స్థితి స్త్రీకి లేదు. తల్లిరోజా లేవగానే మంగళసూత్రాన్ని కళ్ళకద్దుకోవటం చూసే కూతురు అందుకు భిన్నంగా ఎలా ప్రవర్తించ గలదు? ఇక్కడి పెళ్ళయిన పురుషులు మెడల తాడు ధరించాలి. దానికి పవిత్రత ఆపాదించ బడింది. ప్రసాద్‌లాంటివాళ్ళు దాన్ని పూజిస్తారు.

స్త్రీ అబల కాదని మనస్సుకి సిద్ధాంతమైనా ఆ వాస్తవాన్ని ఒప్పుకోవటానికి ఆనంద్‌కి మనస్కరించలేదు. హఠాత్తుగా అతనికి పార్వతి గుర్తొచ్చింది. తను కోపంగా చూస్తే వణికిపోయేది. తాగివచ్చినందుకు కుళ్ళి కుళ్ళి ఏడ్చేది. ఓ పావలా ఖర్చుచేసి పూలుతెస్తే మురిసిపోయేది. ఇక్కడ ప్రసాద్, భార్య పూలు తెచ్చిపెడితే బహుశా అతను మహదానందపడతాడు కాబోలు. బయటి ప్రపంచంలో స్త్రీలు అజ్ఞానంలో ఉంటే ఇక్కడేమో పురుషులు అదే అవస్థలో ఉన్నారు. వాళ్ళ అజ్ఞానాన్ని పోగొట్టటానికి తను ప్రయత్నిస్తే! అది సాధ్యమేనా? అది అంత తేలికైన పని అనిపించలేదు. ఇన్ని వందల సంవత్సరాలనుండీ ఇంత మంది స్త్రీలు తమ అలవాట్లను, కట్టుబాట్లను మార్చుకోలేకపోయినప్పుడుహఠాత్తుగాతనేనాడు వీళ్లకు మంచేదో చెడేదో చెబితే నమ్ముతారా? మారతారా? సంస్కరణల విషయంలోగానీ, స్వేచ్ఛ విషయంలోగానీ స్త్రీలు తమంత తాము ఆలోచించి ప్రతిఘటించిన సందర్భాలుకూడా చెప్పగాలేవు. ఏ రామ్మోహనరాయో, వీరేశలింగమో, గురజాడ - ఇలా పురుషులే కొద్దిగా స్త్రీలగురించి ఆలోచించి మార్పులు తీసుకురాగలిగారు. ఇక్కడ కూడా అదే పరిస్థితి రావచ్చు. స్త్రీచెప్పే విషయాలు తొందరగా నమ్మొచ్చు. పురుషులకు అసలు ఆలోచించాలని, చెప్పాలని తాపత్రయమే వుండకపోవచ్చు.

ఉన్నట్టుండి. ఆనంద్‌కు ఒక మంచి ఐడియా వచ్చింది. చంద్రిక చెప్పిన మాటల్నిబట్టి ఇక్కడ పుట్టిపెరిగినవాళ్ళు, తనలా బయటిప్రపంచం నుంచి తీసుకురాబడ్డవాళ్ళు చాలా మంది వుండాలి. వాళ్ళందరూ తనలాగే స్వేచ్ఛకోసం తహతహలాడుతూ అవకాశంకోసం కాచుకుని ఉండవచ్చు. తను వాళ్ళందరినీ సంఘటితపరచగలిగితే ఈ స్త్రీలమీద తిరుగు [illegible]

అతనికి వచ్చిన ఆలోచన అతనిలో కొత్త ఆశల్ని, ఉత్సాహాన్ని కలిగించింది. ఆ విషయం గురించే ఆలోచిస్తూ మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు.



## 4

మరో పదిరోజులు గడిచేసరికి ఇంటిపని చేయటం ఆనంద్‌కి దాదాపు అలవాటయింది. ఇల్లు చిమ్మటం, అంట్లు తోమటం, బట్టలు ఉతకటం పూర్తిగా అతని బాధ్యతే అయింది. వంట మాత్రం ఎక్కువ భాగం త్యాగి చేస్తున్నాడు. సాయంత్రం పూట చంద్రిక ఇంటికి వచ్చినప్పుడు తను కూర్చుని ఉంటే మర్యాదపూర్వకంగా లేచి నిలబడేవాడు. మనస్సులో తిట్టుకుంటూనే మంచినీళ్ళు తెచ్చిచ్చేవాడు. త్యాగి కలిపిన కాఫీ కప్పులో పోసి ఆమెకు అందించేవాడు.

ఒకరోజు సాయంత్రంవేళ త్యాగి పనిలోకి రాలేదు. ఆఖరిదాకా చూసి ఇహ లాభంలేదనుకుని ఎలాగో తంటాలుపడి చంద్రిక వచ్చేవేళకు ఆనందే కాఫీ కలిపాడు.

"ఇవాళ కాఫీ అద్భుతంగా ఉంది. త్యాగి చేతిలోని మహత్యం వచ్చినట్లుంది" అన్నది చంద్రిక ఓ గుటకేసి.

"ఇవ్వాళ త్యాగి రాలా... కాఫీ నేనే చేశా" అన్నాడు మొహం సంతోషంతో వాటంత చేసుకొని.

"వాట్... నువ్వు చేశావా? నా జీవితంలో ఇంత చక్కటి కాఫీ తాగలా!" అంది చంద్రిక సంభ్రమాశ్చర్యాలతో.

ఒకక్షణం ఆనంద్ నిజంగానే తనేదో మహత్కార్యం సాధించినట్లు ఆనందంతో పొంగిపో

యాడు. మరుక్షణం తన తప్పు తెలుసుకుని మనస్సులోనే సిగ్గుపడ్డాడు.

చేసింది వెధవపని, ఆడంగుల పని. దాన్ని విడ మెచ్చుకుంటే తను సంతోషించటమేమిటి? తనకి తెలియకుండానే తనలోకి ఆ సంతోషం ఎలా వచ్చింది. అసలు మానవనైజమే ఇట్లాంటిదా? మంచిదో, చెడ్డదో, చిన్నదో, పెద్దదో ఒక వ్యక్తిచేసిన పనిని మరో వ్యక్తి మెచ్చుకున్నప్పుడు సంతోషం కలుగుతుందా? నౌకరు చేత కాళ్ళు పట్టించుకుని, "నీ చేతిలో ఏముందోగాని నొప్పులన్నీ ఒక్కసారిగా మాయమయ్యాయిరా" అంటే ఆ నౌకరు తను చేసింది వెట్టిచాకిరి అనుకోకుండా సంతోషిస్తాడు. అప్పుడప్పుడూ అయిదో పదో ఇస్తుంటే జీవితాంతం కుక్కలా విశ్వాసంగా పడివుంటాడు.

పెళ్ళయిన కొత్తలో తనుకూడా పార్వతి చేసిన వంటకాల్ని మెచ్చుకునేవాడు. తనేకాదు, దాదాపు మొగుళ్ళందరూ మొదట్లో పెళ్ళాలు చేసిన వంటకాల్ని పొగిడేస్తారు. దాంతో స్త్రీలు పొంగిపోయి వంటచేయటమే జీవితాదర్శంగా భావిస్తారు. పోనుపోను ఉప్పెక్కువయిందనీ, కారం తక్కువయిందనీ విసుక్కుంటే ఏడ్చుకుంటారు. ఇప్పుడు తన పనీ అంతేనా?

పనుల్లో ఆడవాళ్ళవనీ, మగవాళ్ళవనీ ప్రత్యేకించి ఉండవు. ఎవరే పని చేసినా పొగిడితే ఆనందం, తెగిడితే దుఃఖం తప్పవు. చరిత్ర గతిలో కొన్ని తప్పనిసరి పరిస్థితుల్లో స్త్రీ వంటింటికి అంకితమవాల్సి వచ్చింది. కాని ఇప్పుడా పరిస్థితులు లేవే! స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నారు... సంపాదిస్తున్నారు. భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలు చేస్తున్నా వంటపని ఆడదానిదే. అందుకు భిన్నంగా మగాడు వంటచేస్తే సమాజం హర్షించదు, గేలిచేస్తుంది. ఇక్కడ ఆడవాళ్ళు వంట చేస్తే ఎగతాళి చేస్తారు. అంటే సమాజానికి పని విలువతో, ఉపయోగంతో, మంచిచెడులతో సంబంధంలేదు. గ్రుడ్డిగా సాంప్రదాయాన్ని పాటించటమే దానిక్కావలసింది.

పని విషయంలో ఆనంద్‌కి కొంచెం జ్ఞానోదయమయిం దనిపించినా అది తాత్కాలికమే. అటువంటి పనులు చెయ్యాల్సివచ్చినందుకు విచారించాడు. ఆ రాత్రి కిందా మీదాపడి చేతులు కాల్చుకుని వంటకూడా అతనే చేశా



డు. తర్వాత తింటుంటే అతనిదృష్ట్యా బాగానే వుందనిపించింది. పురుషుడు లంచాలు తీసుకోవటానికి సిగ్గుపడడు. వ్యభిచరించటానికి సిగ్గుపడడు. అబద్ధాలాడటానికి సిగ్గుపడడు కానీ వంట వెయ్యటానికి సిగ్గుపడతాడెందుకు?

పండిర తింటున్నంత సేపు అతని వంటని మెచ్చుకుంటూనేవుంది. చివరికి, "ఇహ మనకి త్యాగితో పనిలేదు. పర్మగా నువ్వు వండి వడ్డిస్తే



నేను తృప్తిగా తింటాను. బోలెడు ఖర్చు తప్పుతుంది. కొంచెం డబ్బు వెనకేసి మన పెళ్లయింతర్వాత హనీమూన్‌కెళ్ళొచ్చు'' అన్నది.

ఆ మాటలు వింటుంటే ఆనంద్‌కి గుండెల్లో రాయిపడింది. తెల్లారి లేవగానే చెయ్యాల్సిన పనులు తల్చుకుని దిగులుతో ముఖం వేల్లాడేశాడు.

''ఇంత మంచి తిండి పెట్టినందుకు నీకేదైనా బహుమానమివ్వాలనుంది. ఏం కావాలో కోరుకో'' అంది చండిక ఆప్యాయంగా.

ఒక్కక్షణం ఏం చెయ్యాలా అని ఆలోచించాడు ఆనంద్. చండిక తనపట్ల మంచిగా ఉండటానికి ప్రయత్నిస్తోంది. అది ఆమె స్వార్థం కోసమే కావచ్చు. కానీ ఆ మంచితనాన్ని తనకి అనుకూలంగా మలచుకుని తప్పించుకునే అవకాశం కోసం ప్రయత్నిస్తే!

''ఒక్కణ్నే పొద్దస్తమానం ఇంట్లో పడి వుండటం విసుగ్గా ఉంది. సాయంత్రాలు అలా సినిమాకో, షికారుకో పోతే బాగుంటుంది''

ఒక ఆడది దేబిరించుకున్నట్లు తను చండికను దేబిరించుకోవటం అతనికి సిగ్గయింది. నిజానికి చాలాసార్లు పార్వతి కూడా ఇలానే అడిగింది. కానీ బయటకు తీసుకెళ్ళటానికి తనిష్టపడేవాడుకాదు. కారణం తన పెళ్ళాం పరపురుషుల కళ్ళబడకూడదనే ఫీలింగ్ మాత్రమే. ఇప్పుడు తను చండిక సొత్తు. పరస్త్రీల కంటబడకుండా తనని కాపాడుకోవాలని ఆమె తాపత్రయపడుతుందేమో!

కాసేపు ఆలోచనలోపడి చివరికి చండిక అన్నది

''నీ జుట్టు బాగా పెరిగితే నువ్వడిగినట్లే అప్పుడప్పుడు సినిమాలకి తీసుకెళతా. ఇప్పుడు తీసుకెళితే అందరూ నిన్ను చూసి నవ్వుతారు. నాకు అవమానంగా ఉంటుంది. పోనీ నీకు కాలక్షేపం కావటానికి మంచి మంచి పుస్తకాలు తెచ్చిపెడతాలే''

బయటి ప్రపంచాన్ని చూడటానికి తను వేసిన ప్లాను పారనందుకు చిన్నబుచ్చుకున్నాడు ఆనంద్. ఎంత కంట్రోల్ చేసుకోవాలనుకున్నా అతని ముఖంలో నిరాశ స్పష్టంగా ప్రకటితమైంది. తలవంచుకుని కూర్చున్నాడు.

''నీ కోరిక తీర్చలేదని బాధగా వుందా?'' అతని చుబుకాన్ని మునివేళ్ళతో పైకెత్తుతూ అడిగింది.

సిగ్గుపడుతూ తలదించుకునే ఆడదాన్ని లాలించటం మగవాడిపని. కానీ ఇప్పుడో స్త్రీ ఆ పని తనకు చేస్తోంది. ఎట్లా భరించటం? ఏమీ చేతకాని ఆడంగిలా ఏది చెబితే అది చేస్తూ తిట్లూ, ఏవగింపులూ, లాలింపులూ భరిస్తూ తనెలా జీవించగలడు? కానీ తప్పేదేముంది!

నిద్రపోయేటప్పుడు చండికను చంపొచ్చు. ఆమె చావు తనకి స్వేచ్ఛ కలిగించదు. ఇక్కడి చట్టాల ప్రకారం తనని ఉరితీస్తారు. చావు కావాలంటే ఏ క్షణాన్నైనా వస్తుంది. కానీ జీవితం మళ్ళీమళ్ళీ రాదు. సంవత్సరం పట్టొచ్చు. కాకపోతే మరో ఏడు. ఎలాగైనా తను తప్పించుకోవాలి. అప్పటిదాకా ఎంత నీచమైన అవమానాలనయినా భరించాలి. ఆమె చేసిన పనికి భరించలేని కోపమొచ్చినా తనకి తనే సమాధానం చెప్పుకుంటూ బలవంతాన నిగ్రహించుకున్నాడు ఆనంద్.

ఆనంద్‌ని ఎలాగైనా సంతోషపెట్టాలనుకుంది చండిక.

''పోనీ ఈ ఒక్కసారికి నీ ఇష్టప్రకారమే చేద్దాంలే. రేపు నిన్ను సినిమాకి తీసుకెళతా... మళ్ళీ అడక్కూడదు. నీ జుట్టు పెరిగి మన పెళ్ళయింతర్వాత నీకెన్ని సినిమాలు కావాలంటే అన్ని చూపిస్తా'' బుజ్జగిస్తున్నట్లు అన్నది.

మర్నాడుదయం మామూలుగానే పన్లోకొచ్చాడు త్యాగి. ఫస్టుతారీకు తర్వాత పని మానుకోవాలని చెప్పేసింది చండిక. ఆమె బయటికెళ్ళింతర్వాత తన గోడంతా ఆనంద్ ముందు వెళ్ళబోసుకున్నాడు త్యాగి.

''అమ్మగారు దయదల్చబట్టి నేనూ, నా పిల్లలూ ఈ రెండేళ్ళబట్టి రెండు పూటలా తిండికిబ్బంది లేకుండా నెట్టుకొచ్చాం. ఇహ ముందు ఎన్ని తిప్పలు పడాలో ఏమో?'' బాధగా అన్నాడు.

''మీ ఆవిడలేదా?'' అనుమానంగా అడిగాడు ఆనంద్.

''ఎందుకు లేదూ! వుంది. కానీ ఏం ప్రయో

జనం. పేకాటలో ఆస్తంతా హరించివేసింది. బంగారంలాంటి నాలుగెకరాల మామిడితోట, మా పుట్టింటివాళ్ళిచ్చిన రెండెకరాల మాగాణి అన్నీ కరిగిపోయాయి. అన్నీ పోయినా ఆమె బాగుపడితే సంతోషించేవాణ్ణి. కానీ ఆవిడగారి కాపిచ్చి వదల్లేదు. అంతా నా ఖర్మ... ఎవర్నని ఏం లాభం. ఆ మహాభగవతికెందుకో మామీద కరుణ కలగటంలేదు'' దాదాపు కంటతడి పెట్టుకుంటూ అన్నాడు త్యాగి.

ఆనంద్‌కి అమితమైన ఆశ్చర్యం, కోపం కలిగాయి. వెధవా... మగాడివై వుండి ఆడ ముండలా ఏడుస్తావేంరా? పెళ్ళాం పేకాడటమేంటి? మొగుడు ముండ మొయ్యటమేంటి? కసిగా మనస్సులోనే తిట్టుకున్నాడు.

అసలు మొగాళ్ళు ఇలా ఎలా ఉండగలుగుతున్నారు? పుట్టుకతోనే మగాడి ఆలోచనలూ, ఆడదాని ఆలోచనలూ వేరుగా ఉండవా? అంతా పరిస్థితుల ప్రభావమేనా? అంతా అయోమయంగా ఉందనుకున్నాడు. త్యాగికి పురుష లక్షణాన్ని తెలియజెయ్యాలనుకున్నాడు.

''చూడు త్యాగీ... మగాడు ఎంతో నిబ్బరంగా ఉండాలి. అలా ఏడవరాదు. నీలో జవసత్వాలున్నాయి. చక్కగా ఏ ఉద్యోగమో చేసుకుంటూ హాయిగా ఉండొచ్చు. నీలాంటివాళ్ళు స్త్రీల మీద ఆధారపడటమేంటి?'' ధైర్యం చెబుతున్నట్లుగా అన్నాడు.

''ఆధారపడక చేసేదేముంది. ఆడదాని తోడులేందే సంఘంలో ఒంటరిగా ఎలా జీవించగలం? పెట్టినా కొట్టినా అంతా వాళ్ల చేతులమీదుగా జరగాల్సిందేకదా'' నీరసంగా అన్నాడు త్యాగి.

''అదే పొరపాటు. ఇన్నాళ్లూ నీ భార్య పట్టించుకోకపోయినా నువ్వే ఏదోవిధంగా కుటుంబాన్ని నెట్టుకొస్తున్నావు. నీ భార్య ఉన్నా పేరుకుమాత్రమే. అలాంటప్పుడు ఆమెనొదిలేసి నీబతుకు నువ్వు బతకొచ్చుగా!'' చాలా తేలిగ్గా మూడుముక్కల్లో చెప్పేశాడు ఆనంద్.

ఆనంద్ మాటలు విని అదిరిపడ్డాడు త్యాగి. అప్పటిదాకా విచారంగావున్న అతని వదనం కోపంగా మారిపోయింది.

''బాగానేవుందే మీరు చెప్పేది! కష్టమో సుఖమో భార్యతో పంచుకోవాలిగాని వదిలేసి బజారుకెక్కితే పరువేమవుతుంది. నలుగురూ నవ్విపోరూ. ఒంటరి మగాడికి సమాజంలో గౌరవమేముంటుంది? పనెవరిస్తారు? ఆకలికి మాడి పిచ్చివాడిలా వీధుల్లో అడుక్కుంటూ కుక్కచావు చావమంటారా? చచ్చి సుఖపడాలన్నా అదీ దొరకదు. తాడులేకుండా మొండి మొలతో చస్తే వెయ్యేళ్లు నరకలోకప్రాప్తి తప్పదు. ఎందుకొచ్చిన ఆలోచనలుగాని నా బతుకేదో నన్ను బతకనివ్వండి'' నిష్ఠూరంగా ఒక శత్రువుతో మాట్లాడుతున్నట్లు చెప్పాడు త్యాగి.

ఆనంద్ మరేమీ మాట్లాడలేకపోయాడు. మౌనంగాలేచి తన గదిలోకి వెళ్లిపోయాడు. ఈ పురుషుల్ని మార్చటం అసాధ్యమేకాకుండా ప్రమాదకరంకూడా అనుకున్నాడు మనస్సులోనే. మానసికంగా ఇక్కడి పురుషులందరూ చాలా ఘోరమైన బానిసత్వంలో ఉన్నారు. బహుశా వీళ్ల చదువుసంధ్యలంతమాత్రమే కాబోలు. ఆలోచించాల్సిన అవసరమూ, అవకాశమూ వుండవు వాళ్లకి.

పెళ్లాం సంపాదించుకొస్తుంది. వీళ్లు వండి వడ్డిస్తారు. ప్రతిదానికీ మహాభగవతిని తల్చుకుని భయపడతారు. ఆడదాని తోడులేందే మగాడు బతకలేడని త్యాగి అంటే తనకి నవ్వు రావచ్చు. కానీ అదిక్కడ పరమసత్యం. నయానో భయానో లొంగదీస్తారు. సాటిపురుషుల సానుభూతి వుండదు. తినటానికి తిండి వుండదు. ఆ పరిస్థితుల్లో ఎవరుమాత్రం ఏం చెయ్యగలరు? చండికని తనేమాత్రం ఎదిరించగలిగాడు.

బయటి ప్రపంచంలో స్త్రీలు అబలలుగా ఉండటానికి పరిస్థితులే కారణమా? అక్కడి స్త్రీలకు మానసిక, ఆర్థిక స్వాతంత్ర్యాలు తక్కువ. దాదాపు ప్రతి విషయంలోనూ పురుషులమాటకే కట్టుబడి ఉండాలి. తరతరాలుగా వస్తున్న ఆచారవ్యవహారాలకి అలవాటుపడి వాటికి భిన్నంగా పోవాలంటే భయపడతారు. ఎదురుతిరిగిన వాళ్లని సమాజం ఆదరించదు.

ఇక్కడి పరిస్థితులు స్వయంగా కళ్లతోచూస్తూ ఇంకా పురుషులే అధికులనటం మూర్ఖ

సైకిల్ నడుపుతుంటే వెనక అతను కూర్చుని గాలికెగిరిపోతున్న గౌన్ని మాటిమాటికీ సర్దుకోలేక అవస్థలుపడ్డాడు.

సినిమాహాల్ చేరుకొన్నాక మోటార్‌బైక్ పార్కుచేసి టిక్కెట్లకోసం క్యూలోనిలబడ్డది చండిక. జనం చాలా పల్చగా ఉన్నారు. పురుషులు మరీ తక్కువ. సినిమా మొదలుపెట్టలేదు కాబట్టి సిగరెట్లు కాల్చుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్న స్త్రీలు, టీస్టాల్‌వద్ద టీతాగుతూ నిలబడ్డవాళ్లు ఆనంద్‌వంక ఓరచూపులు చూడసాగారు. అతను సిగ్గుతో తలెత్తలేకపోయాడు. టిక్కెట్లు తీసుకొచ్చి ఆనంద్‌ని వెంటబెట్టుకుని హాల్లోకి తీసుకెళ్లింది చండిక. సీటు నంబర్లు వెతికి కూర్చోబెట్టింది.

"సినిమాపేరేంటి?" కాస్సేపాగి అడిగాడు.

"ఆదర్శభర్త" జవాబిచ్చింది చండిక.

కొద్దినిమిషాల్లో సినిమా ప్రారంభమైంది. అది చూస్తుంటే మతిపోయింది ఆనంద్‌కు.

అపురూపంగా పెంచుకున్న ఒక్కగానొక్క కొడుకుని ఓ అమ్మ చేతిలో పెట్టి బాధ్యత వదిలించుకుంటారు తల్లిదండ్రులు. శోభనం రాత్రి చిత్తుగా తాగి అతన్ని అవమానించి, ప్రియుణ్ణి కలుసుకోవటానికి వెళ్ళిపోతుంది అతని భార్య. అప్పటినుంచీ అవమానాల్ని, ఛీత్కారాల్ని సహించి భార్యని మార్చి సంసారాన్ని చక్కదిద్దుకోవటానికి శతవిధాల ప్రయత్నిస్తాడా భర్త. అణకువగా అత్తమామలకు సేవలుచేసి వాళ్ళ మెప్పుపొందుతాడు.

అనుకోని పరిస్థితుల్లో అతని శీలాన్ని అందరూ శంకిస్తారు. భార్య అతన్ని గెంటివేస్తుంది. పుట్టింటికెళితే తల్లిదండ్రులు సానుభూతి ప్రకటిస్తారేతప్ప ఆశ్రయం ఇవ్వరు. భార్యనే కాళ్ళావేళ్ళాపడి బతిమాలుకోమని చెప్పి పంపిస్తారు. ఏదారిలేని ఆ పుణ్యపురుషుడు గోదారివైపు పరుగుతీస్తాడు. దారిలో కొందరు స్త్రీలు అతని వెంటపడతారు. అంతలో నిజం తెలుసుకున్న భార్య పరుగుపరుగున వచ్చి ఆ స్త్రీలతో హోరాహోరీ పోరాడి వాళ్ళని పారదోలి భర్తను అక్కున చేర్చుకుంటుంది.

ఆమె పాదాల్ని కళ్ళకద్దుకొని ఆమెవెంట ఇంటికి నడుస్తాడా ఆదర్శభర్త.

ఘోరం, అమానుషం అంటూ తిట్టుకున్నాడు ఆనంద్ సినిమా చూస్తున్నంతసేపూ. వళ్లు మండి మధ్యలో లేచిపోదామనిపించినా చండిక తంతుందేమోనని భయపడి కూర్చున్నాడు. ఇంటికొచ్చింతర్వాత చండికతో వాదించటానికి పూనుకొన్నాడు.

"మానసికంగా పురుషుణ్ని నిర్వీర్యుడిగా చెయ్యటానికి చిన్నప్పటినుండీ ఇటువంటి చెత్త సినిమాలు చూపించడం ఘోరం" అన్నాడు అక్కసుగా.

"మీ ప్రపంచంలో ఇంతకంటే ఘోరమైన సినిమాలు చూపిస్తూ స్త్రీల మనసుల్ని కలుషితం చెయ్యటంలా" అంది చండిక ఆవులిస్తూ.

"అది అనాదిగా వస్తోంది. స్త్రీలే దాన్నంగీకరిస్తున్నారు... మా తప్పేముంది".

"మా సమాజానికిక్కూడా వంద సంవత్సరాల చరిత్ర ఉంది. ఇక్కడ పుట్టి పెరిగినవాళ్లంతా దీన్ని సహజంగానే తీసుకుంటున్నారు"

"మీ చావేదో మీరు చావక మధ్యలో నన్నెందుకు చంపుతారు. పెళ్ళి చేసుకోవటానికి ఇక్కడ పుట్టిపెరిగిన మగాళ్ళెవరూ నచ్చలేదా?" అన్నాళ్ళూ మనస్సులో దాచుకున్న బాధనంతా వెళ్ళగక్కాడు.

"పార్వతికి నువ్వు చేసిన అవమానానికి నిన్ను చిత్రహింసలు పెట్టి చంపాలనుకున్నాను. కానీ నీ అందం చూస్తే నాకు మోజుపుట్టింది. దారిలోకి తెచ్చుకుని పెళ్ళిచేసుకోవాలనుకున్నాను" కోపగించుకోకుండా నవ్వుతూ చెప్పింది.

"కానీ నిన్ను పెళ్ళిచేసుకోవటం నాకిష్టంలేదు" గట్టిగా అరిచాడు ఆనంద్.

"పురుషుడి ఇష్టాయిష్టాలతో మాకు పనిలేదు. నచ్చిన పురుషుడి ద్వారా సంతానాన్ని కనటం మాహక్కు. అయినా పురుషుడి మూలంగా మాలో మాకు కలహాలు రాకుండా కొన్ని కట్టుబాట్లు చేసుకున్నాం. తల్లిదండ్రుల్లో, అక్కచెల్లెళ్ళో, కనీసం దూరపు బంధువులో ఉంటే వాళ్ళ అనుమతి తీసుకున్న తర్వాతే పురుషుణ్ని పెళ్ళాడతాం. ఏ అండాలేని నీలాంటివాళ్లని ముందుగా ఎవరు గెల్చుకుంటారో వారికే

ఆ పురుషుడిమీద సర్వహక్కులూ వుంటాయి'' ఓపిగ్గా వివరించింది.

''ఎన్ని చెప్పినా ఆడది ఆడదే. తనకి ష్టంలేని ఆడదాన్ని చూసి పురుషుడు లైంగికంగా స్పందించలేడు. నా మూలంగా నీకేటు వంటి సుఖమూ దొరకదు. నీది వృధా ప్రయాస''

''నీలాంటివాళ్ళని స్పందింపచేసే ప్రత్యేకమైన మార్గాలు చాలా ఉన్నాయ్. ఆ విషయంలో నాకేదిగులూ లేదు. ఇహ విసిగించకుండా వెళ్ళి పడుకో'' విసుగ్గా అంది చండిక.

ఏం చెయ్యలేక గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు ఆనంద్.

★ ★ ★

రోజులు గడిచిపోతున్నాయి. ఆనంద్ జీవితం నిస్సారంగా తయారయింది. త్యాగి పనిమానేశాడు. యాంత్రికంగా ఇంటి పనులన్నీ అతనే చేసుకుపోతున్నాడు. ఒకప్పుడు ఏపనులైతే తను ఏవగించుకునేవాడో ఇప్పుడు వాటిని భయంమూలానే అయినా శ్రద్ధగా చేస్తున్నాడు. ఒకటి రెండుసార్లు నిర్లక్ష్యంగా ఉన్నందుకు చండిక అతన్ని తిట్టికొట్టింది. ఆవిడకి కోపం తెప్పించటం తనకే మంచిదికాదు కాబట్టి ప్రతి పనీ జాగ్రత్తగా చేయటం అలవాటు చేసుకున్నాడు.

మొదట్లో సిగరెట్లకోసం, విస్కీకోసం ప్రాణం తహతహలాడేవి. పోనుపోను వాటిని పూర్తిగా మర్చిపోయాడు. పనంతా పూర్తిచేసుకుని స్నానంచేసి మధ్యాహ్నంపూట పత్రికలు తిరగేసేవాడు. వాటినిండా స్త్రీల సాహసాన్ని పురుషుల సౌందర్యాన్ని వర్ణించే కథలే ఉండేవి. రకరకాల భంగిమల్లో అర్ధనగ్నంగా ఉన్న మగాళ్ళ బొమ్మలుండేవి. మొదటిసారి చూసినప్పుడు ఒక పత్రికని చించి చెత్తబుట్టలో పారేశాడు. వాటిని చదివితే మిగతావాళ్ళలా తనక్కూడా మానసిక దౌర్బల్యం కలుగుతుందని భయపడ్డాడు. కానీ ఏ కాలక్షేపం లేకుండా ఒంటరిగా ఉండటం కష్టమైంది. పిచ్చిపిచ్చి ఆలోచనలతో మనస్సంతా పాడయ్యేది. కాలక్షేపానికి అప్పుడప్పుడు ఆ పత్రికల్నే తిరగేసేవాడు. పోనుపోను వాటి కలవాటు పడ్డాడు.

సాయంత్రంపూట మహాభగవతి వరప్రసాద్, మరికొంతమంది చుట్టుపక్కలవాళ్ళు వచ్చి కబుర్లు చెప్పిపోతుండేవాళ్ళు. మొదట్లో వాళ్ళ మాటలు, చేష్టలు అసహ్యంగా తోచేవి. కానీ కాలక్రమేణా అవికూడా అలవాటయ్యాయి. అతను కూడా సరదాగా వాళ్ళతో కబుర్లాడటం ప్రారంభించాడు. వాళ్ళని ఎడ్యుకేట్ చెయ్యటానికి అతను ప్రయత్నించలేదు. అది వృధాప్రయాసే ననుకున్నాడు. వాళ్ళపట్ల అతనికేమాత్రం జాలి, సానుభూతి కలుగలేదు. అక్కడి స్త్రీలెంత ప్రమాదకరమైనవాళ్ళో పురుషులు కూడా అంతే ప్రమాదకరమైనవాళ్ళు. అతని దృష్టిలో వాళ్ళు చీడపురుగులు. చీడపట్టిన సమాజాన్ని సమూలంగా నాశనం చెయ్యాలి. బయటికి పొకనివ్వకూడ దనుకునేవాడు.

అన్నిటికన్నా ఆనంద్‌కి ఇబ్బందికలిగించిన విషయం పెరుగుతున్న అతని జుట్టు. గడ్డాన్నీ, మీసాన్నీ కొంతవరకు భరించగలుగుతున్నా తలమీద జుట్టు చాలా చికాకు కలిగించేది. పనివేళల్లో చెమటలు కారుతుంటే నుదుటిమీదా, భుజాలమీదా అతుక్కుపోయే వెంట్రుకలు చీదరపుట్టించేవి. బోడిగుండంత భోగం లేదనే సామెత చాలా కరక్టు అనుకునేవాడు.

జుట్టు పొడవుగా లేనంతమాత్రాన వచ్చే నష్టమేమిటో అతనికి ఎంత ఆలోచించినా బోధపడలేదు. ఆమాటే ఓరోజు చండికతో అంటే ఆమె, ''పురుషుడి అందమంతా ఆ జుట్టులోనే ఉంది. వచ్చినప్పటికంటే నువ్విప్పుడు చాలారెట్లు అందంగా ఉన్నావ్. ఆ జుట్టు పూర్తిగా పెరిగితే ఎంతమంది మగాళ్ళు కుళ్ళుకుని నీకు దిష్టిపెడతారో చూడు'' అన్నది నవ్వుతూ.

ఒకళ్ళ ఆనందం కోసం వేరొకళ్ళు అసౌకర్యానికి ఎందుకు గురికావాలి అనుకున్నాడు ఆనంద్. తాత్కాలికంగా ఒకటిరెండురోజులైతే భరించొచ్చు. కానీ జీవితాంతం ఎవరు మాత్రం భరించగలరు! మరయితే బయటి ప్రపంచంలోని స్త్రీల మాటేమిటి? జడ ఎంత పొడవుగావుంటే అంత సంతోషిస్తారు స్త్రీలు. వాళ్ళకి అసౌకర్యం కలుగదా? అక్కడ వాళ్ళ

కది అలవాటైపోయింది. ఇక్కడి పురుషులకిది అలవాటైపోయింది. అంతే తేడా! అంటే జుట్టు మూలంగా స్త్రీకిగానీ పురుషుడికిగానీ అదనంగా చేకూరే అందమేమీలేదు. ఒక పద్ధతిలో చూడటం అలవాటైనప్పుడు దానికి భిన్నంగా కనబడేవాళ్ళు చూట్టానికి అసహ్యంగా ఉంటారు.

అలంకారాలతో వచ్చే అందం మానసిక భ్రమ మాత్రమే. దేశంలోని ఆడాళ్ళందరికీ పుట్టుకతోనే బోడిగుండ్లుంటే మన ప్రబంధాలన్నీ బోడిగుళ్ళ వర్ణనలతోనే నిండివుండేవేమో! తన ఆలోచనలకి తనే నవ్వుకున్నాడు. ఎందువల్లో ఇక్కడి మగాళ్ళకి బొట్టుకాటుకలు అలవాటు కాలేదు. వాటి బాధలేనందుకు సంతోషించాడు.

చూస్తుండగానే ఒక సంవత్సరం గడచిపోయింది. కేంప్‌కని వచ్చిన తను తిరిగి ఆఫీస్‌కి ఎటెండ్ అవకపోవటంవల్ల తన గురించి ఎంక్వయిరీ ప్రారంభమవుతుందని, ఎప్పుడో ఒకనాడు తను రక్షింపబడతాడని అనుకుంటూ ఆశలు పెట్టుకున్న ఆనంద్‌కి నిరాశే ఎదురైంది. ప్రపంచాన్నంతా పరిశోధించి మారుమూలల్లో ఉన్న చిన్నచిన్న దీవుల్ని కూడా కనిపెట్టిన మానవుడికి ఈ ప్రాంతం గురించి ఎందుకు తెలియలేదు? తమ రహస్యాన్ని వీళ్ళెలా కాపాడుకోగలుగుతున్నారో అతనికి అర్థం కాలేదు. ఒకటి రెండుసార్లు చండికని ప్రశ్నించినా ఆమె సమాధానం చెప్పలేదు.

ఆ సంవత్సరకాలంలో ఆనంద్ గుర్తుపట్టలేనంతగా మారిపోయాడు. గడ్డాలు, మీసాలు దట్టంగా పెరిగాయి. ఇరుగుపొరుగువాళ్ళు తల దువ్వుకుని జడవేసుకోటం నేర్పించారు. శరీరం చిక్కిపోలేదుగానీ నీడపట్టున వుండటాన నునుపెక్కి వన్నె వచ్చింది. అహం, పొగరు పూర్తిగాపోయి ఒకరకమైన సాధుత్వం వచ్చింది. అతనికి మిగిలిందల్లా ఎలాగైనా అక్కడినుండి తప్పించుకు బయటపడాలనే పట్టుదల మాత్రమే.

ఒక సాయంత్రం చక్కగా స్నానం చేసి ముస్తాబైన ఆనంద్‌వంక తదేకంగా చూస్తూ అన్నది చండిక ---

''ఇంత అందం నా సొంతం కాబోతున్నందుకు నాకు చాలా ఆనందంగా, గర్వంగా ఉంది. దూరంగా కూర్చుని నిన్ను చూస్తూ నిగ్రహించుకోవటం ఇహ నావల్లకాదు. త్వరలోనే పెళ్ళికి ముహూర్తం పెట్టిస్తా''

ఆనంద్ బదులు చెప్పలేదు. వద్దని వారించటం కంఠశోష మాత్రమేనని అనుభవపూర్వకంగా చాలాసార్లు తెలుసుకునేవున్నాడు.

నెల తిరక్కుండానే ముహూర్తం నిశ్చయమైంది. రకరకాల దుస్తులు, ఆభరణాలు



సంతోషంగా ఆనంద్‌కి కొనిపెట్టింది చండిక. మహాభగవతి ఆలయంలో బంధుమిత్రుల సమక్షంలో ఘనంగా జరిగింది వాళ్ళ పెళ్ళి. పురోహితులుగా వ్యవహరించిన స్త్రీలు అర్థంకాని మంత్రాలు చదువుతుంటే మంగళ వాద్యాల మధ్య అతని మొలచుట్టూ ఓ బంగారు తాడుకట్టింది చండిక. తలవంచుకుని నిర్వికారంగా పురోహితులు చెప్పినట్లుగా చేశాడు ఆనంద్. కలకాలం వీర్యవంతుడివై సంతానాభివృద్ధికి నీ భార్యతో సహకరించమంటూ దీవించి అక్షింతలు చల్లారు పురోహితులు. తరువాత వచ్చినవాళ్ళంతా అక్షింతలేశారు. విందు భోజనంతో పెళ్ళితంతు ముగిసింది. చండిక కొట్టినా తిట్టినా ఆమె దరిచేరకూడదనుకున్నాడు ఆనంద్. కానీ సంవత్సరకాలంగా కామవాంఛల్ని అదుపులోపెట్టుకోలేక సతమతమౌతున్న అతను నిగ్రహించుకోలేక చివరికి ఆమెకు లొంగిపోయాడు.

పెళ్ళయింతర్వాత ఆనంద్ పరిస్థితి మెరుగైంది. ఇప్పుడతనికి మరింత స్వేచ్ఛ లభించింది. పెళ్ళయిన పురుషుణ్ని అందరూ గౌరవంగా చూస్తారు. పైగా ఇప్పుడతని వేషం మిగతా అందరి వేషంలాగే ఉంది. కాబట్టి అతన్ని అవహేళన చేయటానికి ఎవరికీ అవకాశం లేదు. ఇప్పుడతను కొంచెం బయట తిరగ్గలుగుతున్నాడు. అప్పుడప్పుడూ మార్కెట్టుకెళ్ళి కూరగాయలు తేవటమేకాక, పొరుగువాళ్ళతో కలిసి సినిమాకో షికారుకో వెళ్ళగలుగుతున్నాడు. చండిక అతనిపట్ల ఆదరంగా ఉంటోంది.

చాలామందితో అతనికి పరిచయాలేర్పడినా వాళ్ళెవరూ అతనికి ఉపయోగపడలేదు. ఎప్పుడు కనబడినా కొత్తగా కొన్న ఆభరణాల గురించి, చూసిన సినిమాల గురించి, పిల్లలు, వంటల గురించి మాట్లాడేవారు. వెయ్యి సంవత్సరాలు గడిచినా అంతకుమించి వాళ్ళ మనస్సులెదగవని విచారించేవాడు ఆనంద్.

పెళ్ళయిన నాలుగు నెల్లకి తల్లిని కాబోతున్నానని గర్వంగా చెప్పింది చండిక. ఆ మాట చెప్పటానికి ఆమె ఎటువంటి బిడియము, సిగ్గు, మురిపెం ప్రదర్శించలేదు. ఆనంద్‌కి చాలా ఆశ్చర్యమేసింది. అదే విషయం పార్వతి చెప్పేటప్పుడు ఎన్ని మెలికలు తిరిగిందో గుర్తుతెచ్చుకున్నాడు. ఇద్దరూ స్త్రీలే అయినా ఎంత తేడా! తను తండ్రి కాబోతున్నందుకు ఆనంద్ సంతోషపడలేదు. పుట్టేది మగపిల్లవాడయితే తన చేజేతులా వాణ్ని దద్దమ్మలా పెంచాలి! ఏం లాభం.

★ ★ ★

ఉదయం పనంతా పూర్తిచేసి స్నానం చేద్దామని తలకు నూనె రాసుకుంటున్నాడు ఆనంద్. గేటు తీసిన చప్పుడు వినబడితే ఎవరన్నా వచ్చారేమోననుకుంటూ చూడటానికని వరండాలోకెళ్ళాడు. గేటువేసి లోపలికొస్తున్న మహాభగవతి వరప్రసాద్, మరొక పురుషుడు కనబడ్డారు. వాళ్లవెనకే ముగ్గురు పిల్లలున్నారు. ఇద్దరు మగపిల్లలు, ఒక అమ్మాయి. ఆడపిల్ల మహాభగవతి వరప్రసాద్ కూతురు- ధీరజ. ఆరేళ్లుంటాయి. ఆ అమ్మాయిని చాలాసార్లు చూశాడు ఆనంద్. మగపిల్లలు, ఆ కొత్తవ్యక్తి కొడుకులేమోననుకున్నాడు.

"ఏంచేస్తున్నారు... పనంతా పూర్తయిందా?" చిరునవ్వుతో పలకరించాడు ప్రసాద్.

"ఆఁ... ఇప్పుడే పూర్తయింది. స్నానానికి వెళ్లబోతుంటే మీరొచ్చారు... రండి" ఆహ్వానించాడు ఆనంద్- జుట్టు ముడేసుకోవటానికి తంటాలుపడుతూ.

అందరూ లోపలికి నడిచారు.

"అబ్బ... ఇల్లంతా ఎంత శుభ్రంగా వుందో" అన్నాడా అపరిచితవ్యక్తి హాలంతా పరికించి చూస్తూ.

"శుభ్రంగా వుండకేంచేస్తుంది! ఆనంద్‌గారికి పిల్లాజెల్లా లేరుకాబట్టి సర్దినిల్లు సర్దినట్లుగానే వుంటుంది. నా పెళ్లయిన కొత్తల్లో నేను ఇంతకంటే బాగానే చేసేవాణ్ణి. ఇప్పుడు ధీరజ చేసే ఆగంతో చస్తున్నా" అన్నాడు ప్రసాద్ మూతివిరుస్తూ.

"ఈ బాబులెవరు? చక్కగావున్నారు. ముద్దొస్తున్నారు" అన్నాడు ఆనంద్ మాటమారుస్తూ.

"అయ్యో! అసలు విషయం మర్చిపోయ్యా. వీరు మా అన్నయ్య కేశరాజు. పుట్టినప్పుడే తలనిండా ఒత్తుగా జుట్టుండేసరికి ఆ పేరుపెట్టా

రు. అదేం ఖర్మో ఒక తల్లికడుపున పుట్టినా నాజడ జానెడు కూడా వుండదు. వీడిదేమో బారెడు జడ. వీధిలోకెళ్తే అందరిచూపూ వీడి మీదే వుంటుంది'' అసూయగా అన్న జడని ముందుకేసి చూపిస్తూ అన్నాడు ప్రసాద్.

''ఊరుకోరా నువ్వు మరీను'' అన్నాడు కేశరాజు తన దీర్ఘకేశాల్ని వెనక్కి వేసుకుంటూ. అతని మొహంలో కొంచెం సిగ్గు, మరింత గర్వం కనిపించాయి.

''నిలబడే వున్నారేం... కూర్చోండి'' అన్నాడు ఆనంద్. మనస్సులో మాత్రంవాళ్లమాటల్నీ, చేష్టల్నీ అసహ్యించుకున్నాడు.

తన బారుజడని గురించి మెచ్చుకోలుగా ఆనంద్ ఒక్కమాటన్నా అననందుకు కేశరాజు కొంచెం మొహం మాడ్చుకున్నాడు.

''ఒక్కక్షణం, మీరు మాట్లాడుకుంటూ ఉండండి. నేవెళ్లి కాఫీ కలుపుకొస్తా'' అన్నాడు ఆనంద్.

''అబ్బే... ఇప్పుడవేమీ వద్దు. మేమిప్పుడే భోంచేసి వచ్చాం. అన్నయ్య పిల్లలకి గొలుసులు చేయించాలంటే బజారుకెళదామని బయల్దేరాం. ఈ పిల్లల్నేసుకొని బజార్లు తిరగాలంటే ప్రాణంపోతుంది. పక్కింటివాళ్లింట్లో వదిలివెళదామనుకుంటే వాళ్లుకూడా బజారు కెళుతున్నారట. మీకేమీ శ్రమలేదనుకుంటే ఒక్కగంట వీళ్లనిక్కడుంచి వెళతాం. ఇంట్లోనే గాని, బయటికొస్తే మాపిల్లలసలు గొడవ చెయ్యరు. ఆలస్యం చెయ్యకుండా వెంటనే వచ్చేస్తాం'' అన్నాడు ప్రసాద్.

వద్దని చెప్పటానికి ఆనంద్ మొహమాటపడ్డాడు.

''వీళ్లుకూడా భోంచేశారా?'' అన్నాడు ఇబ్బందిగా.

''ఆఁ... మా ఆవిడొక్కత్తే వుంది. ఆవిడ ఒంటిగంట క్కాని రాదు. ఆ లోపల మేమొచ్చేస్తాం'' అంటూ లేచాడు ప్రసాద్.

''మీ మొలతాడు చాలాబాగుందే! ఎక్కడ చేయించారు?'' అన్నాడు కేశరాజు కుతూహలంగా.

''ఏమో... ఆవిడే చేయించింది'' కాస్త చిరాకుపడ్డాడు ఆనంద్.

''చక్కగా వుంది. మా అత్తగారు వట్టి మొరటుమనిషి. పాతకాలపు డిజైనులో చేయించారు. మార్చి వేరేరకం చేయించుకుంటానంటే వినుకోరు. ఇంటి చాకిరంతా నాది, పెత్తనం ఆవిడది'' విచారంగా అన్నాడు కేశరాజు.

''ఏమైనా ఆనంద్‌గారు అదృష్టవంతులు. అత్తమామలకి ఎదురుచేసే పనిలేదు. మావాళ్ళు ఒక పదిరోజుల్లో దిగుతారు. తల్చుకుంటే నాకిప్పట్నుంచే భయంగా వుంది'' అన్నాడు ప్రసాద్.

''అదృష్టమా నాబొందా! ముందు తొందరగా మీరు బయటికి తగలడండి'' అని మనస్సులో కసిగా తిట్టుకున్నాడు ఆనంద్.

''ఎంత? పదిహేను సవర్లుంటుందా?'' ఆనంద్ మొలతాడుని తడిమి చూస్తూ అడిగాడు కేశరాజు.

''పదిహేనేనా! ఇంత సన్నగావున్న నాదే పధ్నాలుగుంది. కనీసం ఇరవైకి తగ్గదు'' అన్నాడు ప్రసాద్.

''తొందరగా కావాల్సినవన్నీ ఇప్పుడే చేయించుకోండి. పిల్లలొస్తే ఇహ మనముచ్చట్లు తీరవు'' గొంతు తగ్గించి రహస్యం చెబుతున్నట్లు చెప్పాడు కేశరాజు ఆనంద్‌తో.

''గోల చెయ్యకుండా మేంవచ్చేదాకా ఆడుకోండి'' అంటూ సంచిలోనుంచి బొమ్మలు తీసి అందరికంటే చిన్నపిల్లవాడి ముందుపెట్టి బయటికి దారితీశాడు ప్రసాద్.

''మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నాం'' అన్నాడు కేశరాజు జడ సవరించుకుంటూ.

ఏడవలేక నవ్వాడు ఆనంద్.

వాళ్లు వెళ్లింతర్వాత గేటువేసి లోపలికొచ్చాడు. పిల్లలుకాస్త బిక్కమొహాలు వేసుకుని భయం భయంగా ఆనంద్‌వంక చూశారు.

''గోలచెయ్యకుండా కూర్చుని ఆడుకోండి. అరిచి కేకలేశారంటే తంతా,'' అంటూ తన కోపమంతా వాళ్లమీద ప్రదర్శించి స్నానం చెయ్యటానికి బాత్‌రూంలో దూరాడు. అద్దంలో ముఖం చూసుకుంటే చీదరేసింది. కత్తెర తీసుకుని జుట్టంతా కత్తిరించి నున్నగా గడ్డం చేసుకోవాలనిపించింది. బలవంతాన ఆ కోర్కెను అదుపులోపెట్టుకున్నాడు.

జుట్టు పెంచుకోవటం, ముడేసుకోవటం మగవాళ్లకి కొత్తేమీ కాదు. వెనకటికాలంలో చాలామంది అట్లాచేసేవాళ్లు. చైనాదేశపు మగాళ్లు చక్కగా జడలుకూడా వేసుకునేవారు. ఇప్పటికాలంలో హిప్పీలు జుట్టు పెంచుకుతిరుగుతున్నారు. సిక్కుల సంగతి చెప్పనక్కరలేదు. కానీ పురుషులకు పొడవుజుట్టు అందంగా వుంటుందని ఎవరూ అనుకోరు. పెంచుకున్న వాళ్లు కూడా దాన్ని గురించి పట్టించుకోరు. కాని ఇక్కడివాళ్లసంగతేమిటి? పొడవు జుట్టుంటే వాళ్లకెందుకింత గర్వం, ఆనందం? బహుశా ఇక్కడి పురుషులకు వేరే వ్యాపకాలు లేకపోవటంవల్లనేమో! కూపస్థమండూకాల్లా వీళ్లకి ఇల్లే ప్రపంచం. చదువుల్లేవు. స్వతంత్రమైన ఆలోచనలు లేవు. ఏది చెయ్యాలన్నా స్త్రీల అనుమతి కావాలి. అలాంటప్పుడు కాలం వెళ్లబుచ్చాలంటే వున్న జుట్టుని అలంకరించుకోవటం, నగల గురించి మాట్లాడుకోవటం మినహా మరేం చెయ్యగలరు?

స్నానంముగించి బట్టలుమార్చుకుని బయటికొచ్చి తల దువ్వుకోసాగాడు ఆనంద్.

పిల్లలు గొడవచెయ్యడంలేదు. మగపిల్లలు కిందకూర్చుని లక్కపిడతల్తో ఏదో ఆడుకుంటున్నారు. ధీరజ మాత్రం కుర్చీలో దర్జాగా కాలు మీద కాలేసుకుని ఏదో పుస్తకం చదువుకుంటోంది. తనుకూడా వెళ్లి ఆ అమ్మాయిపక్కన కుర్చీలో కూర్చుని పిల్లల ఆటని చూడసాగాడు.

ఇద్దరిలోకీ పెద్దవాడు ఒక లక్కపిడత ముందు వంగుని ఉఫ్ ఉఫ్మని ఊదుతూ--

"అబ్బ! ఈ పొయ్యి మండటంలా. పొగతో కళ్లుమండుతున్నాయ్. అన్నం ఎప్పుడు వుడుకుతుందో?" అన్నాడు.

"మీ ఇంట్లో కిరసనాయిల్ స్టవ్ లేదా? చూడు... స్టవ్‌మీదపెడితే నా అన్నం అప్పుడే ఉడికింది" అన్నాడు చిన్నవాడు.

"అట్లాగయితే నేను కూరలన్నీ గ్యాస్‌స్టవ్ మీద చేస్తాచూడు" అంటూ పెద్దవాడు వేరే లక్కపిడత తీసుకుని కూరలు తరిగినట్లు, కడిగి చట్టిలో వేసినట్లు, స్టవ్ అంటించి చట్టిని స్టవ్‌మీద పెట్టినట్లు నటించాడు.

"నా కూరప్పుడే ఉడికిందోచ్" అన్నాడు చంకలుకొట్టుకుంటూ.

"ఏంకాదు... నాకూరే ముందుడికింది" అన్నాడు చిన్నవాడు కోపంగా.

"సరే... అయితే ముందెవరు తింటారో పందెం" అంటూ పెద్దవాడు గబగబా లక్కపిడతల్లోని అన్నంకూరలు వడ్డించుకు తింటున్నట్లు నటించాడు.

చిన్నవాడుమాత్రం కదలకుండా కూర్చున్నాడు.

"నేను తినటంకూడా అయిపోయింది. నువ్వే ఓడిపోయావు" అన్నాడు పెద్దవాడు సంబరంగా.

"నేనిప్పుడే తినను. ముందు ఇల్లంతా ఊడ్చి, స్నానంచేసి, మా ఆవిడొచ్చింతర్వాత ఆవిడకిపెట్టి అప్పుడు తింటా. నువ్వు ముందు తిన్నందుకు మీఆవిడ బాగా తంతుందిలే" అంటూ చిన్నవాడు తన ఇల్లు ఊడవటం మొదలుపెట్టాడు.

"తంతుందా... నేనసలు ఈ ఆట ఆడను"

"మరే ఆట ఆడదాం?"

"బొమ్మలపెళ్లి చేద్దాం!"

"బొమ్మల్లేవుగా"

"మరైతే గిన్నాలాడుదాం. బయటికెళ్లి రాళ్లేరుకొస్తా"

"వద్దు. నాకది సరిగ్గారాదు. ప్రతిసారి నన్ను బోడిచేస్తున్నావ్"

"ఈసారి నేనే బోడవుతాలే"

"ఊహు... నే(రాను. అంట్లుతోమే ఆటకైతే వస్తా" అంటూ లక్కపిడతలన్నీ తనవైపు లాక్కున్నాడు చిన్నవాడు.

అప్పటివరకూ చదువుకుంటున్న ధీరజ పుస్తకంమూసేసి వాళ్లపక్కకెళ్లి కూర్చుంది.

"నేనొక మంచి ఆటచెబుతా వస్తారా?" అంది.

"ఏమాట?" అడిగాడు పెద్దవాడు.

"నేనేమో మహారాణిని. మీరిద్దరూ రాజులు. మిమ్మల్నొక రాక్షసి ఎత్తుకెళుతుందట. అప్పుడు నేను కీలుగుర్రంమీదొచ్చి రాక్షసిని చంపి మిమ్మల్ని రక్షిస్తాను" అంది ధీరజ.

దేశంలోని అన్నిప్రాంతాల మెడికల్, టెక్నికల్ ఎడ్యుకేషన్ కోర్సుల పూర్తి
వివరాలు, చిరునామాలతోసహా అపూర్వ గ్రంథం



## విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్దే 1001 కోర్సులు

ఈనాడు దినపత్రికలో తొమ్మిది నెలలపాటు ధారావాహికంగా వెలువడి
35 లక్షల పాఠకులను ఆకట్టుకొన్న విలువైన వ్యాసాల సంపుటి.

### శ్రీ వి.యస్. హరినారాయణ్

ఈ పుస్తకంలో ఇంజనీరింగ్ కోర్సులు, మెడికల్, పారా మెడికల్, అగ్రికల్చరల్, వెటర్నరీ, మేనేజ్‌మెంట్, కంప్యూటర్, టీచర్ ట్రైనింగ్, పాలిటెక్నిక్, ఐ.టి.ఐ, కంపెనీ సెక్రటరీ, చార్టర్డ్ ఎక్కౌంటెంట్, కాస్ట్ ఎక్కౌంటెంట్, ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్, ఐ.ఎఫ్.ఎస్, పరీక్షల వివరాలు, ఇంటర్మీడియట్, స్కూలుస్థాయి వృత్తి విద్యా కోర్సులు, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫేషన్ టెక్నాలజీ, హోటల్ మేనేజ్‌మెంట్, కరెస్పాండెన్స్ కోర్సులు, స్త్రీలకు ప్రత్యేక విద్యావకాశాలు, వికలాంగులకు విద్యాసౌకర్యాలతోసహా దాదాపు 1000 రకాల కోర్సుల పూర్తి వివరాలు చిరునామాలతోసహా పొందుపరిచారు.

విద్యార్థుల భవిష్యత్తును తీర్చిదిద్దే 1001 కోర్సులు

వెల: రు. 25/- మనియార్డర్ ద్వారా పంపి
పుస్తకాన్ని పొందండి.

**ఈ పుస్తకం చదివితే మీ జీవితం మారిపోగలదు.**

# శ్రీమహాలక్ష్మి

బుక్ ఎంటర్‌ప్రైజెస్,
మ్యూజియంరోడ్, విజయవాడ-520 002

"అమ్మో! నేన్రాను. రాక్షసంటె నాకు భయం" అన్నాడు చిన్నవాడు.

"భయమెందుకు. ఉత్తుత్తి రాక్షసేగా" అంది ధీరజ.

"నేనుకూడా రాను. నాకూ భయమే" అన్నాడు పెద్దవాడుకూడా.

"మిమ్మల్ని కీలుగుర్రం ఎక్కించి ఆకాశంలో తిప్పుతా" ఆశపెట్టింది ధీరజ.

"అమ్మో... కళ్లుతిరుగుతాయి. మాకు భయం" అన్నారు మగపిల్లలిద్దరూ.

"ఛీ! ఈ మగపిల్లలెప్పుడూ ఇంతే. ప్రతిదానికీ భయపడతారు" అంటూ చీదరించుకుని మళ్లీ పుస్తకం ముందరేసుకుక్కూర్చుంది ధీరజ.

మగపిల్లలిద్దరూ కాళ్ళు చాపుకుని కాళ్లాగజ్జాలాడటం మొదలుపెట్టారు. వాళ్ల ప్రవర్తన చూసి విస్తుపోయాడు ఆనంద్. అప్పుడర్థమయింది, మనుమల ప్రవర్తనలెలా ఏర్పడతాయో. పుట్టుకతో అందరి మనస్సులూ ఒకేలా ఉంటాయి. పెరిగేకొద్దీ ఇంట్లో మగవాళ్ల ప్రవర్తనెలా వుంటే మగపిల్లలు కూడా అలా ప్రవర్తించటం మొదలుపెడతారు. ఆడవాళ్లను చూసి ఆడపిల్లలు నేర్చుకుంటారు. ఎవరే పనులు ఎందుకు చెయ్యాలో అర్థం చేసుకోలేని వయస్సులో ఏర్పడే అభిప్రాయాలు స్థిరంగా ఉండిపోతాయి. సమాజపు కట్టుబాట్లకి వ్యతిరేకంగా ఆలోచించి ప్రవర్తించే ధైర్యం, జ్ఞానం వాళ్లకు ఏర్పడవు. ఏగూటి చిలక ఆ గూటి పలుకులే పలుకుతుంది అనుకుని నిట్టూర్చాడు ఆనంద్.

"ఏం పుస్తకం అది?" అన్నాడు ధీరజనుద్దేశించి.

"ముగ్గురు మాంత్రికురాళ్లు" జవాబిచ్చింది ధీరజ.

అట్లాంటి పుస్తకాలు చాలాచూశాడు ఆనంద్. అన్నిట్లోనూ మహారాణులు, రాజకుమార్తెలు చేసే సాహసకృత్యాలు వర్ణించబడతాయి. అవి చదివిన ఆడపిల్లలు తాముకూడా అట్లా చెయ్యాలని ఉబలాటపడుతూ రకరకాల ఊహాలోకాల్లో విహరిస్తారు. ఇకపోతే మతపరంగా మహాభగవతి, ఆవిడ అవతారాలు, దుష్టశిక్షణ, శిష్టరక్షణగాథలు అనేకం ఉండనే వున్నాయి.

ఆట ఆపేసి మగపిల్లలిద్దరూ బయటిగేటు తీసి మెట్లమీద నిలబడి వీధిలోకి చూస్తూ నిలబడ్డారు. ఐదునిమిషాలైనా లోపలికి రాలేదు. పుస్తకం చదువుతున్న ధీరజ ఏదో అనుమానం వచ్చినదాన్లా గబగబా బయటికొచ్చి చూసింది. గేటుబయట నిలబడ్డ మగపిల్లల్ని చూడగానే కోపంగా గుడ్లెర్రజేస్తూ-

"ఏంటి మీరక్కడ చూసేది? గంటలతరబడి గుమ్మాల్లో నిలబడి చూడటానికి మీకే ముంటుంది... రండి లోపలికి" అంటూ కేకలేసింది.

మగపిల్లలిద్దరూ బిక్కమొహంవేసుకుని లోపలికొచ్చారు. 'దీని దుంపతెగ. ఇప్పటినుండే మగాళ్లని కట్టడిచెయ్యటం మొదలుపెట్టింది. ఇహ పెద్దయితే మొగుణ్ణి గడపదాటనిస్తుందా?' అనుకున్నాడు ఆనంద్.

ఇహ వాళ్లమాటలు విని భరించటం కష్టమనిపించి భోంచేద్దామని లేచాడు.

"మీలో ఎవరికైనా ఆకలిగావుందా? అన్నంతింటారా?" అని అడిగాడు.

"ఆఁ... నేతింటా" అన్నాడు చిన్నబ్బాయి.

"ఇందాకేగా తిన్నది. ఇన్నిసార్లు తింటే గుమ్మటంలా ఊరిపోతావు. నిన్నెవరూ పెళ్లిచేసుకోరు" అంది ధీరజ వెక్కిరింపుగా.

"పోనీలే, ఈ ఒక్కసారికి తిననివ్వు" అన్నాడు ఆనంద్.

"వద్దంకుల్... నాదగ్గర డబ్బులున్నాయి. నేవెళ్లి బిస్కెట్లుకొని తెచ్చిపెడతాలే. ఒరేయ్... మీరిక్కడే ఉండండి, నేకొట్టుదగ్గరకెళ్లి కొనుక్కొస్తా" అంటూ పరుగుతీసింది ధీరజ.

ఏంచెయ్యాలేక నిస్సహాయంగా వంటింట్లోకి వెళ్లాడు ఆనంద్. పన్నెండున్నరకల్లా వచ్చేశారు కేశరాజు, మహాభగవతి వరప్రసాద్‌లు.

"పిల్లలేం గొడవ చెయ్యలేదుకదా?" అన్నాడు ప్రసాద్.

"లేదండీ. బుద్ధిగా ఆడుకున్నారు. మంచి పిల్లలు" అన్నాడు ఆనంద్ మెచ్చుకోలుగా మగపిల్లలిద్దర్నీ దగ్గరకు తీసుకుంటూ.

"పిల్లలకేం మంచివాళ్లే! వాళ్లరాతలు

మంచివికావొద్దు. మంచిభార్యలొస్తే ఏ దిగులూ వుండదు. లేకపోతే జీవితాంతం వీళ్ళనుచూసి ఏడ్చుకోవాలి. మీకు తెలిసిన మంచి సంబంధాలేవైనా వుంటే చెప్పండి. మా ఖర్మేమిటో వంశాన్నుద్ధరించటానికి ఒక్క ఆడపిల్లయినా లేకుండాపోయింది'' అన్నాడు కేశరాజు కాస్త దిగులుగా.

''కబుర్లు చెప్పుకుంటూ నిల్చుంటే కుదరదు. ఆవిడొచ్చే వేళయింది. వెళదాంరండి. సాయంత్రం పనిముగించుకుని కాస్సేపు మా ఇంటికిరండి ఆనంద్‌గారు. ఎప్పుడూ ఒక్కళ్లే ఇంట్లో కూర్చుంటే ఏం తోస్తుంది. మా అన్నయ్యరు బోలెడు ముగ్గులొచ్చు. రావాలంటే మీకు నేర్పిస్తాడు. తప్పకుండా రండి'' అంటూ బయటికి దారితీశాడు మహాభగవతి వరప్రసాద్.

''వెళ్లొస్తామండీ... సాయంత్రం తప్పక రండి'' అంటూ వెళ్లారు.




ఒకరోజు సాయంత్రం రోజూ వచ్చే టైమ్ కంటే ముందుగానే ఇంటికి వచ్చింది చండిక. ఆమెతోపాటు మరొక స్త్రీకూడా ఉంది. చండిక కంటే ఒకటి రెండేళ్లు చిన్నది కావచ్చు. మనిషి కాస్త పొట్టిగా, లావుగా, చామనఛాయలో వుంది. చూడగానే ఆకట్టుకొనే రూపంకాదు. చిన్న కళ్లు. చట్టిముక్కు. గుంటలుపడిన చెంపలు.

''ఆనంద్... ఆనంద్'' అంటూ వరండాలో నుండే హడావుడిగా కేకలేసుకుంటూ లోపలికొచ్చింది చండిక.

ఆ సమయంలో ఉతికిన బట్టలు డాబామీద ఆరేస్తున్నాడు ఆనంద్. పైనుండి వాళ్లు రావటం అతను చూశాడుకానీ వాళ్లతనిని గమనించలేదు. డాబా దిగి పెరటివాకిలి గుండా లోపలికెళ్లాడు ఆనంద్. ఇంట్లో పరాయిస్త్రీలుండగా వాళ్లముందు అటూఇటూ తిరిగితే తిడుతుంది చండిక. మొదటిసారి అతనట్లా చేసినప్పుడు మంచిగా చెప్పింది. రెండవసారి మర్చిపోయి హాల్లో చండిక తన స్నేహితులతో కూర్చుని వుండగా వాళ్లముందుగా బయటికి వెళ్లాడు ఆనంద్. అతను వెళుతుంటే ఏదో జరగరాని పని జరిగినట్లు చండిక స్నేహితులంతా మాటలాపేసి గుడ్లప్పగించి అతనివంకే చూశారు. వాళ్ళు వెళ్ళింతర్వాత చండిక ఆనంద్‌ను ఛడామడాతిట్టి కొట్టినంత పనిచేసింది. అప్పటినుండీ చండిక స్నేహితులు ఎవరొచ్చినా ఆనంద్ వాళ్ళ ముందుకొచ్చేవాడు కాదు. ఎప్పుడన్నా చండికకి ముఖ్యమైన స్నేహితులొచ్చినప్పుడు కాఫీ తీసుకురమ్మనేది. ట్రేలో కాఫీ కప్పులు పెట్టుకుని తీసుకెళ్లి వాళ్లకిచ్చి, ''నా భర్త ఆనంద్'' అని చండిక పరిచయంచేస్తే తలవంచుకునే వాళ్లకి నమస్కారంపెట్టి లోపలికెళ్లిపోయేవాడు. వాళ్లు వెళ్లిపోయింతర్వాతే అతను వెళ్లి ఖాళీ కప్పులు కడగటానికి తీసుకొచ్చేవాడు.

ఆనంద్‌ని పిలుస్తూ గదులన్నీ తిరిగింది చండిక. ఎక్కడా కనబడకపోయేసరికి మళ్ళీ రెండవసారి వెతకసాగింది. వంటగదిలో ఆనంద్‌ని చూసేసరికి ప్రాణంలేచివచ్చినట్లయింది ఆమెకు.

''అరె... నువ్విక్కడే ఉన్నావా? నీకోసం ఇల్లంతా తిరిగాను. ఇందాక వచ్చినప్పుడు కనబడలేదే?'' అంది ఆశ్చర్యంగా.

''డాబామీద బట్టలారేసివస్తున్నా. మీ స్నేహితులెవరో వచ్చినట్లుంటే పెరటి వాకిలి గుండా వచ్చా'' అన్నాడు ఆనంద్ చిన్న గొంతుతో.

చండిక స్నేహితులు వచ్చినప్పుడు పెద్దగా మాట్లాడటంకూడా తప్పే. ''ఇప్పుడొచ్చింది అతిథులుకాదు, నా ప్రాణస్నేహితురాలు శౌర్య. రెండునెలలుగా ఎక్కడికో చెప్పాపెట్టకుండా పోయింది. ఇప్పుడొచ్చింది. ఇవ్వాళ దాన్నెటూ వెళ్లనివ్వను. ఇద్దరం మాట్లాడుకోవాల్సిన విషయాలు బోలెడున్నాయి. నువ్వు త్వరగా కాఫీ తీసుకురా. మొహం జిడ్డుగా ఉన్నట్లుంది...



కాస్త కడుక్కునిరా'' అంటూ మళ్ళీ హడావుడిగా హాల్లోకి వెళ్ళింది చండిక.

బట్టలుతికి అలసిపోయిన ఆనంద్ కాస్సేపు విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు. అచనంగా వచ్చిపడిన పనిని తల్చుకుంటే దిగులేసింది. చేసేదిలేక అయిష్టంగానే స్టవ్ వెలిగించి కాఫీకి నీళ్ళుపెట్టి పెరట్లోకెళ్ళి మొహం కడుక్కొచ్చుకున్నాడు. కాఫీ కలిపి కప్పుల్లో పోసి, ట్రేలో పెట్టుకుని హాల్లోకి తీసుకెళ్ళాడు.

''వీడే నా మొగుడు ఆనంద్'' అంటూ పరిచయంచేసింది చండిక.

ఆ సంబోధన వింటుంటే వళ్ళుమండింది ఆనంద్‌కు. కోపంతో చేతిలోవున్న ట్రేని ఎత్తి చండిక నెత్తిన కొట్టాలనిపించింది. అంతకు ముందెప్పుడూ చండిక ఆనంద్‌ని అట్లా పరిచయం చెయ్యలేదు. ఈవేళ అట్లా ఎందుకు చేసిందో అర్థంకాలేదు.

అతికష్టంమీద చేతిలోని ట్రేని వాళ్ళ ముందున్న టీపాయ్‌మీదపెట్టి కళ్ళలోని కోపాన్ని బయటపడనివ్వకుండా తలవంచుకుని నమస్కరించాడు ఆనంద్.

''ఎట్లావుంది నా సెలక్షన్?'' అంది చండిక మహాదర్పంగా.

''నీ అభిరుచి నాకు తెలియదా. నువ్వు సెలక్ట్ చేసిన వాళ్ళకి లోపముంటుందా?'' అంటూ పరీక్షగా ఆనంద్‌వంక చూసింది శౌర్య.

ఆనంద్‌కి వళ్ళంతా కంపరంపుట్టింది. వెళ్ళిపోవటానికి వెనక్కి తిరిగాడు. ''కాస్సేపు కూర్చో... దీనిముందు సిగ్గుపడాల్సిన పనిలేదు'' అంటూ అతన్ని ఆపేసింది చండిక.

వెళ్ళాలా వుండాలా అని ఆలోచిస్తూ అట్లాగే నిలబడ్డాడు ఆనంద్.

కాఫీ కప్పందుకుని ఒక గుటకవేసింది శౌర్య.

''అబ్బ! కాఫీ అమృతంలా వుందండీ! మా చండిక అదృష్టవంతురాలు'' అంది మెచ్చుకోలుగా.

''ఒరేయ్ ఆనంద్! కాఫీతోటే దీన్ని పడగొట్టేశావ్. ఇహ నీ చేతివంట రుచిచూస్తే పర్మనెంట్‌గా ఇక్కడే తిష్టవేస్తుందేమో! రాత్రికి కూరల్లో కారందంచెయ్. లేకపోతే మనం దివాలాతీస్తాం'' అంటూ పెద్దగా నవ్వసాగింది చండిక.

మళ్ళీ ''ఒరేయ్'' అనే సంబోధన వినగానే ఇహ అక్కడ వుండలేక గబగబా వంటగదిలోకెళ్ళి గోడకేసి తలబాదుకున్నాడు ఆనంద్.

''వారికి సిగ్గెక్కువలా వుంది'' అంటూ శౌర్య కూడా చండికతో శ్రుతి కలిపింది.

ఐదు నిమిషాల తర్వాత వంటగదిలోకెళ్ళింది చండిక. మూతిబిగించి ఓ మూల స్టూల్‌మీద కూర్చున్న ఆనంద్ కనబడ్డాడు.

"ఏంటి కథ? అలక పాన్పెక్కినట్లున్నారు?" అంది వేళాకోళంగా.

ఆనంద్ మాట్లాడలేదు. విసురుగా లేచి పెరట్లోకెళ్లాడు. విషయం అర్థంకాక విస్తుపోతూ చండికకూడా వెనకాలే వెళ్లింది.

"ఏం... అలా ఉన్నావ్ ఒంట్లో బాగోలేదా?" అంటూ అతని చెయ్యి పుచ్చుకుంది.

"ఒంటికేం బాగానేవుంది, ఖర్మే బాగాలేదు" కసిగా అన్నాడు ఆనంద్...

"అసలు విషయమేంటి? నా స్నేహితురాలు రావటం ఇష్టంలేదా?"

"నా ఇష్టాయిష్టాలతో పనేముంది. ఇది మీ ఇల్లు మీ ఇష్టం వచ్చినవాళ్లని ఉంచుకోండి. కానీ నన్ను అరేయ్-- ఒరేయ్ అంటేమాత్రం సహించేదిలేదు. నన్ను నీ ఇష్టంవచ్చినట్లు పిలిచే అధికారం నీకేముంది?" అన్నాడు ఉక్రోషంగా.

పకపక నవ్వింది చండిక.

"అదా నీ బాధ. ఐతే విను... ఈ ఇల్లునాదని ఒప్పుకున్నావ్‌గా?"

అవునన్నట్లు తలఊపాడు ఆనంద్.

"ఈ ఇల్లునాది. నా చెమటోడ్చి సంపాదించిన డబ్బుతోనే నేనీ ఇల్లు కట్టుకున్నాను. నా ఇష్టమైతే దీంట్లో ఉంటాను, కష్టమైతే మరొకళ్లకి అమ్మేస్తాను. తిక్కరేగితే పడగొట్టేస్తాను, మరొకటి కట్టించుకుంటాను"

"నీ ఇష్టమొచ్చినన్ని కట్టించుకో... నాకేం?"

"ఈ ఇల్లు నాదైనట్లే నువ్వు కూడా నావాడివి, నా స్వంత ఆస్తివి. నాకిష్టమైతే నీతో ఉంటాను... కష్టమైతే ఇంకొకణ్ని కట్టుకుంటాను. నువ్వు నా బానిసవు. నా ఇష్టమొచ్చినట్లు పిలుస్తాను. తిడతాను, కొడతాను, చంపుతాను... కాదనే దమ్ములెవరికీలేవు. ఏ చట్టం, సంప్రదాయం నిన్ను రక్షించలేవు. పిచ్చిపిచ్చి వేషాలెయ్యకుండా లోపలికి రా" అంది చండిక అపర చండికలా.

"నేను నీవాణ్నాయినంతమాత్రాన ప్రాణంలేని రాయినికాదు. నాకూ మానాభిమానాలున్నాయి"

"ఈ ఆలోచన మీ లోకంలో ఉన్నప్పుడేమయింది? అక్కడ స్త్రీలకి మానాభిమానాలు లేవా? నీ పెళ్ళాన్ని ఎప్పుడూ 'ఒసేయ్, ఏమే' అని పిలవలేదా? అంతకంటే అసభ్యమైన మాటలే ఉపయోగించి వుంటావ్. ఇప్పుడు నీవంతు వచ్చేసరికి గుర్తువచ్చాయా మానాభిమానాలు"?

"అక్కడ మొగుళ్లందరూ పెళ్ళాల్ని అట్లాగే పిలుస్తారు. నాకూ అట్లాగే అలవాటయింది. పైగా నా పెళ్ళాం ఎప్పుడూ అట్లా పిలవద్దనలేదు"

"ఇక్కడ కూడా పెళ్ళాలందరూ మొగుళ్లని ఇట్లాగే పిలుస్తారు. నాకూ అలవాటైంది. నా అలవాటు ప్రకారమే నడుచుకోవాలి నువ్వు"

"ఊహుఁ... అట్లా పిలిస్తే నేనొప్పుకోను"

"ఒప్పుకోక ఏం చేస్తావురా దున్నపోతా! ఏదో స్నేహితురాలొచ్చిందన్న సంతోషంలో మర్చిపోయి అట్లా పిలిస్తే అంత నీల్గుడెందుకు? ఇహ నుంచీ నిన్ను ఒరేయ్ అనే పిలుస్తాను.... ఏం చేస్తావో చేస్కో" అంది చండిక కోపంగా.

"ఇట్లా అవమానించే బదులు నన్నొదిలెయ్. నా దారిన నేపోతాను" అన్నాడు ఆనంద్ అర్థింపుగా.

"ఎక్కడికెళతావ్? ఆడదిక్కులేని మగాళ్ళకిక్కడ అడుక్కునే హక్కు కూడాలేదు. ఓపికున్నన్నాళ్ళు ఒళ్ళమ్ముకొని బతకొచ్చు. ఆ తరవాత దిక్కులేని చావు చస్తావ్.... ఇష్టమేనా?" అంది చండిక అతని చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకెళ్ళాలనే ప్రయత్నంలో.

"పోనీ ఒక్కసారిగా నన్ను చంపెయ్యరాదూ" అన్నాడు ఆనంద్ చెయ్యి విదిలించుకొంటూ.

"నాకోపమొస్తే అంతపనీ చేస్తా. నోరుమూసుకుని లోపలికొచ్చి వంటమొదలెట్టు" అంది చండిక సహనం కోల్పోతూ.

"నేను చెయ్యను.... చచ్చినా చెయ్యను" అంటూ మొండికేశాడు ఆనంద్.

"చెయ్యవా?"

"చెయ్యను.... చెయ్యను.... చెయ్యను!"

చండికకి కోపం తారాస్థాయికి చేరుకుంది. గుడ్లెర్రచేసి పళ్ళు పటపట కొరుకుతూ

ముందుకు దూకి ఆనంద్ జుట్టుపట్టుకు వంచి వీపున నాలుగు పిడిగుద్దులు గుద్దింది. "పని చెయ్యకుండా తిని కూర్చోటానికి నీ బాబుగాడి ముల్లెపట్టుకొచ్చావా! దొంగ వెధవ, పో... లోపలికి చావు. అరగంటకి నేమళ్ళీ తిరిగొచ్చేసరికి వంటంతా పూర్తికాకపోతే నీ చర్మం వలిచేస్తా" అంటూ మెడపట్టుకు లోపలికి తోసి విసవిసా వెళ్ళిపోయింది చండిక.

'ఛీ.... ఎంత బుద్ధి తక్కువపని చేశాను. అనవసరంగా దీంతో తగువు పెట్టుకుని ఒళ్ళు హూనం చేయించుకున్నాను. జన్మలో మళ్ళీ నోరెత్తి దీని మాటకు ఎదురుచెప్పకూడదు. దొంగముండ... బాగా తిని కసరత్తు చేసి కండలు పెంచింది. అబ్బ! వెన్నెముక విరిగినట్లుంది. పిల్చుకో... నీ ఇష్టం వచ్చినట్లు పిల్చుకో! అరేయ్, ఒరేయ్, చవట, గాడిద, కుక్క, నక్క, దున్న ఎద్దు, పంది... నీ ఇష్టమొచ్చినట్లు పిల్చుకోవే వస్తాదు ముండా! నా పరువెప్పుడోపోయింది. ఇప్పుడు నువ్విట్లా పిలిస్తే కొత్తగా పోయేదేముంది? నన్ను చూసి వెక్కిరించే వాళ్ళెక్కడెవ రున్నారు. పిల్చుకో.... నీ ఇష్టమొచ్చినట్లు పిల్చుకోవే రాక్షసిముండ! కానీ కానీ... ఒక్కసంగతి గుర్తుంచుకో! నా సర్వశక్తులూ ధారపోసి ఇక్కణ్నుంచి తప్పించుకుంటా! అప్పుడు నిన్ను నీలోకాన్ని సర్వనాశనం చేస్తా! అది చెయ్యకపోతే ఏదో ఒకరోజు నిన్ను నిద్దట్లో పొడిచి పొడిచి.... పొడిచి ముక్కలు ముక్కలుగా చేసి చంపుతా!

చాణుక్యునిలా మనస్సులోనే తీవ్రంగా ప్రతిజ్ఞ చేసుకున్నాడు ఆనంద్. అంతలోనే అతనికి చండిక చేసిన హెచ్చరిక గుర్తుకొచ్చింది.

ఈ పాపిష్టిది నిజంగానే చర్మం వలిచేస్తుంది అనుకుని వీపు నవరించుకుంటూ లేచి వంటపని కుపక్రమించాడు.

హాల్లో కూర్చుని సిగరెట్లు కాల్చుకుంటూ పెద్దగా నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు శౌర్య, చండికలు. వంటపని చేస్తూనే వాళ్ళ మాటలు శ్రద్ధగా ఆలకించసాగాడు ఆనంద్.

"మొత్తానికి నువ్వుకూడా ప్రేమలో పడ్డావన్న మాట. సంతోషం! చాలా సంతోషంగా వుంది నాకు. ఇంతకీ నిన్ను మాయచేసిన ఆ చిన్నవాడు ఎవరు?" అంది చండిక ఒక సిగరెట్ ఏష్ట్రేలో పడేస్తూ.

"చెబుతా.... అది చెప్పటానికేగా పరిగెత్తుకొచ్చింది. నీ సలహాలు, సహాయం లేకపోతే నేను గట్టెక్కలేను. ఎట్లాగయినా నాకో దారి చూపించవే" అంటూ కాళ్ళు చాపి సోఫాలో పడుకుంది శౌర్య.

"సహాయం చెయ్యమని నువ్వు నన్నడగాలా? ఇదిగో ఈ పని చెయ్ అంటూ ఒక ఆర్డరేస్తే మూడు నిమిషాల్లో పని ముగించెయ్యనూ. ముందు అర్జెంటుగా ఆవన్నెచిన్నెల వగలమారి బుల్లోడి వివరాలు చెప్పు. ఎక్కడ చూశావు? ఎట్లా కథ నడిపించావు? కమాన్.... కమాన్. బీ క్విక్"

"మా అక్కయ్య పనిచేస్తున్న ఆఫీస్‌లో నాక్కూడా ఉద్యోగం వచ్చేట్లుందని పోయిన సారి నిన్ను కలిసినప్పుడు చెప్పానుకదూ!"

"అవును... చెప్పావు. వచ్చిందా?"

"వచ్చింది"

"మరి కనీసం నాకు లెటరన్నా రాయలేదేం? చెప్పకూడదనుకున్నావా?"

"సారీ చండీ! ఎప్పటికప్పుడు రాద్దామనే ప్రయత్నించా. కానీ ఈ ప్రేమ వ్యవహారంలోపడి అట్లాగే ఆలస్యమయింది"

"సరే... క్షమించాన్లే. అసలు విషయం చెప్పు. ఆ అబ్బాయి పేరేంటి?"

"సుకుమార్"

"వండ్రఫుల్! సుకుమార సుమబాలుడు తన సౌరభంతో నీకు మత్తెక్కించాడన్నమాట"

"అబ్బ.... ఆపవే నీ జోకులు. చెప్పేది విను"

"పొరపాటయింది. నీ కథ సాంతం అయ్యే వరకు నేన్నోరు తెరవను చెప్పు" అంటూ చిన్నపిల్లలా నోటిమీద వేలేసుక్కూర్చుంది చండిక.

"డ్యూటీలో జాయిన్‌అవటానికి మొదటి రోజు సిటీబస్‌లో బయలుదేరా. ఆ రూట్‌లో బస్ అంత రద్దీగా వుండదు. మగాళ్ళ సీట్లకి వెనకాలే కూర్చున్నా. ఇద్దరు మగాళ్ళున్నారు. కానీ బుద్ధిగా తలదించుకుని కూర్చున్నారు. ఆఫీస్ గురించి, చెయ్యబోయేపనిని గురించీ

ఆలోచించుకుంటూ వాళ్ళని పట్టించుకోలా. నెక్స్ట్ స్టాప్‌లో ఎక్కాడు సుకుమార్. ముందు సీట్లు ఖాళీగా ఉన్నా అక్కడ కూర్చోకుండా కొంచెం వెనక్కొచ్చాడు. పేరుకు తగ్గట్లుగా **నిజంగా చాలా సుకుమారంగానే ఉన్నాడు.** అప్రయత్నంగా మా చూపులు కలిశాయి. కాని అప్పుడతను నన్నసలు పట్టించుకోలా. నా కుడి పక్కనవున్న సీట్ల వరసలో కూర్చున్నాడు. నాకు అంత దగ్గరలో కూర్చున్న అంత అందగాణ్ణి చూస్తే మతిపోయినట్లయింది. రెప్పవెయ్యటం కూడా మర్చిపోయి అతనివంకే చూస్తున్నా. రెండు మూడు నిమిషాల తరువాత ఎందుకో హఠాత్తుగా అతను మెడ కొంచెం పక్కకు తిప్పి క్రీగంట నన్ను చూశాడు''

``ఎందుకేంటి! నీ చూపుల తూపులకి తట్టుకోలేక. ఏం చేశావ్? మూర్ఛిల్లావా? ఫెంటాస్టిక్.... లవ్ ఇన్ సిటీబస్!'' చప్పట్లు కొడుతూ శౌర్య భుజాలు పట్టుకు ఊపేసింది చండిక.

``అట్లా వెక్కిరించావంటే నేనసలు వెళ్ళిపోతా'' అంది శౌర్య సోఫాలో నుండి లేస్తూ.

``అమ్మమ్మ! అంతపని చెయ్యకు. మంచి రసపట్టులో వదిలేస్తానంటే ఎట్లా?'' బుద్ధిగా కూర్చుంది చండిక.

మరో సిగరెట్ వెలిగించి కథ ప్రారంభించింది శౌర్య.

``అతను చూసినప్పుడే నేను కూడా సూటిగా అతని కళ్ళలోకి చూశా. తొట్రుపడి సిగ్గుతో తలతిప్పుకున్నాడు. అప్పటినుంచీ నేను దిగేవరకూ ఏ పది పన్నెండు సార్లో చూశాడు. చూపంటే ఎలాంటి చూపనుకున్నావు.... ఎంత అమాయకంగా, స్వచ్ఛంగా, నిర్మలంగా వున్నాయో ఆ కళ్ళు. ఏదో చెప్పాలనే ఆరాటం, ఎవరన్నా చూస్తున్నారేమోననే భయం కనిపించింది ఆ కళ్ళలో. అబ్బ... ఇప్పుడు తల్చుకుంటుంటేనే ఇంత పరవశంగా ఉంది. అప్పుడు ఆ క్షణాన నా పరిస్థితి వర్ణనాతీతం. నా స్టాప్ దగ్గర దిగాలనిపించలేదు. అట్లాగే అతను దిగే స్టాప్ వరకూ ప్రయాణం చెయ్యాలనిపించింది. కానీ ఎట్లా? డ్యూటీలో జాయినవాల్సిన రోజునే లేటయితే బాగుండదని ఎట్లాగ



బరువెక్కిన గుండెను అదుపులో పెట్టుకుంటూ దిగా. దిగేటప్పుడు కండక్టర్ చిల్లర ఇవ్వాలనే విషయం గుర్తొచ్చి అడిగా. అప్పుడు కూడా అతని వంకే చూస్తున్నా. అతను కూడా నా **వంకే దిగులుగా చూస్తున్నాడు.** 'చిల్లరసలు లేదండి! ఇప్పుడు నేనెక్కడ తేను' అంది కండక్టర్. నాకో మంచి ఐడియా వచ్చింది.

``లేకపోయినా ఫరవాలేదు లెండి.

ఇహ నుంచి రోజూ నేనీ బస్సులోనే ప్రయాణం చెయ్యాలి. రేపెప్పుడన్నా ఉన్నప్పుడు ఇద్దురుగాని'' అని పెద్దగా అన్నా.

నామాటల్లోని ఆంతర్యం అర్థంచేసుకున్నాడల్లేవుంది. ముసిముసిగా నవ్వుకుంటూ సిగ్గుతో తలపక్కకు తిప్పుకున్నాడు. ఇహ చూడు ... ఆరోజంతా నేనేం చేస్తున్నానో నాకే అర్థంకాలేదు. ఆరోజు నా జీవితంలో మరపురానిరోజు''

``కాదుమరి! ఒక పక్క ఉద్యోగవిజయం. మరోపక్క ప్రేమ విజయం'' అంది చండిక నోటిమీద వేలుతీసి.

``ఉద్యోగానిదేముంది, ఇది కాకపోతే ఇంకొకటొస్తుంది. కానీ సుకుమార్ లాంటివాడు దొరకటం అసంభవం. నిజంగానేనదృష్టవంతురాల్ని. కానీ ఈ అదృష్టం శాశ్వతంగా దక్కుతుందో లేదో'' అంటూ నిట్టూర్చింది శౌర్య.

``దిగులెందుకు. నువ్వు తల్చుకుంటే సాధించలేనిదుంటుందా? తరువాతేం జరిగింది. మళ్ళీ మర్నాడతను కనిపించాడా?'' ఆతృతగా అడిగింది చండిక.

``కనబడకపోతే ఏ గోలా ఉండేదికాదు. మర్నాడొస్తాడని నాకు నమ్మకం కలగలా. బస్ ఎక్కిందగ్గర్నుంచి కళ్ళలో వత్తులేసుకుని చూస్తూ కూర్చున్నా. మళ్ళీ అదే స్టాప్‌లో బస్సెక్కాడు. మరింత అందంగా అలంకరించుకుని నాకోసం వచ్చాడు నా సుకుమారుడు. బస్ ఎక్కగానే సీట్‌కోసం కాకుండా నాకోసం వెతికాయి అతని కళ్ళు. నేకనబడగానే సంతోషంతో ట్యూబ్‌లైట్‌లా వెలిగిపోయింది సుకుమార వదనం. మా దురదృష్టంకొద్దీ ఆరోజు బస్ రద్దీగా ఉంది. ఒకర్నొకరం చూసుకోవటానికి నానాతంటాలు పడాల్సివచ్చింది'' అంటూ ఆపింది శౌర్య.

``తంటాల్లేకపోతే ప్రేమలో మజా

ఏముంటుంది. ఇట్లా రోజూ బస్‌లో చూసుకోవటమేనా, పరిచయం పెంచావా?'' అంది చండిక నవ్వుతూ.

"ఇలాంటి తంటాలయితే ఎన్నయినా పడొచ్చు. తంటాలుపడే అతని అడ్రస్ పట్టా. వెంటనే ఆ వీధిలోకి మకాంమార్చేశా. అతనికి భైరవి అనే పదేళ్ళ చెల్లెలుంది. ఆ అమ్మాయితో స్నేహంచేసి వివరాలన్నీ రాబట్టా. అబ్బ ... దానికి బిస్కెట్లు, చాక్లెట్లు లంచంగా పెట్టలేకచస్తున్నాననుకో. ఒకరోజు వేకువఝామునే ముంగిట్లో ముగ్గేస్తున్న నా సుకుమారుణ్ని ధైర్యంచేసి పలకరించా. ఒకే ఒక్కమాట నేనంటే నీకిష్టమేనా?' అన్నా. ఒక్కక్షణం సూటిగా నా కళ్ళలోకి చూసి ఇష్టమేనన్నట్లు తలూపి సిగ్గుపడుతూ ఇంట్లోకి పరిగెత్తాడు''

"రొట్టె విరిగి నేతిలో పడింది మరింకా ఆలస్యం దేనికి? బంగారుమొలతాడుకి ఆర్డరిచ్చేయ్'' అంది చండిక, శౌర్య భుజం తడుతూ.

"అక్కడే వచ్చింది ఇబ్బందంతా! విషయమంతా మా అక్కయ్యకి చెప్పి సుకుమార్ పెద్దలతో మాట్లాడించా. కట్నకానుకలు పెద్దగా ఇవ్వలేరు, వేరే సంబంధమేదైనా చేసుకుంటే బోలెడు కట్నం వస్తుందని మా అక్కయ్య గొడవచేస్తోంది. ఏంచెయ్యాలో పాలుపోవటంలేదు. అంతా విన్నావుగా! నీ సలహా ఏంటి? ఒప్పుకోమంటావా వద్దా?'' అంది శౌర్య.

ఆలోచనలో పడింది చండిక. సిగరెట్ కాల్చుకుంటూ కాస్సేపు హాల్లో అటూ ఇటూ పచార్లు చేసింది. హఠాత్తుగా ఏదో గుర్తువచ్చినట్లు వంటగదిలోకెళ్ళింది.

"వంట పూర్తయిందా?'' సీరియస్‌గా అడిగింది ఆనంద్‌ని.

"అన్నం ఉడికింది. కూర చేశాను. చారు కాగుతోంది. కోడిగుడ్లు వుడకెయ్యనా?'' అన్నాడు ఆనంద్ తలవంచుకుని ఆమెవంక చూడకుండా.

"వద్దు...ఆమ్లెట్‌లువెయ్యి'' అని మళ్ళీ హాల్లోకి వెళ్ళిపోయింది చండిక.

"ఏంచెయ్యమంటావే! నాబతుకంతా నీసలహామీద ఆధారపడుంది. నువ్వెట్లా చెబితే అట్లా చేస్తా'' అంది శౌర్య బేలగా.

మళ్ళీ ఒకటిరెండు నిమిషాలు సీరియస్‌గా ఆలోచించింది చండిక.

"ఇది చాలా చిక్కు సమస్య శౌర్య! ఏం చెప్పటానికీ తోచటంలేదు. ఒకపక్క ప్రేమ, రెండోపక్క డబ్బు. రెండూ ప్రధానమైనవే. దేన్నీ వదులుకోవటానికి వీల్లేదు. నేనైతే డబ్బునే త్యాగం చేసివుండేదాన్ని. కానీ నీ ఆర్థికపరిస్థితి తెలుసు కాబట్టి నీకాసలహా ఇవ్వలేకపోతున్నా'' అంది కొంచెం విచారంగా.

"అంటే సుకుమార్‌ని పెళ్ళి చేసుకోవద్దంటావా?''

"చూడు శౌర్య! జీవితంలో కొన్ని పొందాలంటే కొన్ని కోల్పోవాలి. ఆర్థిక సమస్యల్ని తట్టుకుంటూ ప్రేమని నిలబెట్టుకోవాలంటే చాలా సహనం కావాలి. ప్రేమలో వడ్డ నీకీ ఆలోచనలిప్పుడు తలకెక్కవు. నీకు బాధ్యతలెక్కువ. నీ వెనక పెళ్ళికావలసిన మగపిల్లలిద్దరున్నారు. మీ అమ్మ సంపాదిస్తున్నదంతా వాళ్ళ పెళ్ళిళ్లు చేయటానికే సరిపోదు. వెనక ఆస్థిపాస్తులు లేకపోతే రేపు నీకు పుట్టబోయే పిల్లల భవిష్యత్తెలా ఉంటుంది. ఇవి నీకు నువ్వు చాలా జాగ్రత్తగా ఆలోచించుకోవలసిన విషయాలు. భవిష్యత్తులో ఆర్థికపరంగా ఎదురయ్యే కష్టాలన్నీ తట్టుకోగలవనుకుంటే తప్పకుండా సుకుమార్‌ని పెళ్లిచేసుకో' అంటూ స్నేహితురాలికి హితబోధ చేసింది చండిక.

"సుకుమార్‌ని మర్చిపోవాలంటే నాకు సాధ్యమయ్యేటట్లు లేదు. నా గుండెల్లో గూడుకట్టుకున్న ఈ గువ్వను నిర్దాక్షిణ్యంగా బయటికెలా తరిమెయ్యను. ఛీ ... మా అమ్మకు బుద్ధిలేదు. ముందు ఆడపిల్లలం మేమిద్దరమున్నాంకదా. ఈ మగాళ్ళని కని మాజీవితం నాశనంచేసింది. వాళ్ళే లేకపోతే నాకీ ఇబ్బందులుండేవి కాదుగదా. అయ్యో! నేనిప్పుడేంచెయ్యాలే? తప్పదా ... నా ప్రేమను త్యాగం చెయ్యాల్సిందేనా?'' పుట్టెడు దిగులుతో కంటతడిపెట్టుకుంది శౌర్య.

"ఛ! అలా మగాడిలా ఏడుస్తావేంటే? దీంట్లో ఏముందని. మనక్కావలసిందల్లా పిల్లల్ని కనటానికి ఓ మగాణ్ణి పెళ్ళిచేసుకోవటం అంతేగా... సుకుమార్‌కంటే అందగాళ్లు,

ఎక్కువ కట్నం తేగలిగినవాళ్లు చాలామంది దొరుకుతారు. పెళ్లిచేసుకున్న తర్వాత ప్రేమించొచ్చు. దానిమూలంగా భవిష్యత్తులో బోలెడు సుఖం దొరుకుతుంది. కనీసం ఓ స్కూటరన్నా కొనిపెట్టగల స్థితిలో ఉన్నారా మీ అత్తగారు?'' సందేహంగా అడిగింది చండిక.

లేరన్నట్లు తల అడ్డంగా తిప్పింది శౌర్య.

''చూడుమరి. ప్రేమనిపట్టుకు వేళ్ళాడితే నీక్కావలసిన చిన్నచిన్న కోర్కెలు కూడా తీరవు. నా మాటవిని ఎంచక్కా బోలెడు కట్నం వచ్చే సంబంధమేదైనా చూసి చేసుకో'' అంటూ హితవు చెప్పింది చండిక.

''ఊహు! వీల్లేదు... అలా వీల్లేదు. నామనస్సుని నేను వంచించుకోలేను. నన్ను నమ్మి నాప్రేమకోసం పరితపిస్తున్న ఓ అబలుడి ఆశల్ని వమ్ముచేయలేను. సుకుమార్ నాక్కావాలి. అతనికోసం ఎన్ని త్యాగాలైనా చేస్తాను, ఎన్ని కష్టాలైనా భరిస్తాను'' ఆవేశంగా అరిచింది శౌర్య.

''వెరీగుడ్! మరయితే సమస్యేముంది. ఇహ నువ్వు సుకుమారశౌర్యవైనట్లే. లే...భోంచేద్దాం. ఎప్పుడనగా తిన్నావో ఏమో?'' అంటూ లేవబోయింది చండిక.

''ఇంకొక్క సమస్యుందే. దాన్ని కూడా నువ్వే గట్టెక్కించాలి'' చండిక చెయ్యిపట్టుకుని ఆపుతూ అంది శౌర్య.

''ఇంకో సమస్యా? ఏంటి చెప్పు'' మళ్ళీ సోఫాలో కూలబడింది చండిక.

''చెప్పటానికి నోరు రావటంలేదు. కానీ నీతో కాక మరెవరికి చెప్పుకోగలను. నిన్ను బాగా ఇబ్బందిపెడుతున్నా'' అసలు విషయం చెప్పకుండా నాన్చింది శౌర్య.

''సినిమాడైలాగులు కట్టిపెట్టి అసలు విషయం సూటిగా చెప్పు. నాదగ్గర మొహమాటమెందుకు?''

''వచ్చేనెల పదిహేనో తారీకుతో ముహూర్తాలన్నీ అయిపోతాయి. మళ్ళీ నాలుగునెల్లాగితేనేకానీ పెళ్లి మాటెత్తటానికి వీల్లేదు. కాబట్టి సాధ్యమైనంత త్వరలో ముహూర్తం పెట్టించాలనుంది. పెళ్ళి ఖర్చులెక్కువకావు. బంగారు మొలతాడు చేయించటానికే ఎక్కువ ఖర్చవుతుంది. నా డబ్బు ఒక ఐదారు వేలుంది. కనీసం మరో పదివేలుంటేనే కానీ కుదరదు. అమ్మకు, అక్కయ్యకు ఈ సంబంధం ఇష్టంలేదు కాబట్టి నాకు వాళ్ళడబ్బు తీసుకోవాలని లేదు. ఎట్లాగైనా ఒక్క పదివేలు సర్ది నాపెళ్ళయ్యేట్టు చూడవే. ఒక్క సంవత్సరంలోపుగా వడ్డీతోసహా నీ అప్పు తీర్చేస్తా. నన్ను నమ్ము'' అంటూ... ప్రాధేయపడింది శౌర్య.

కొంచెంసేపు మౌనంగా ఆలోచించింది చండిక. ఆమె మౌనం శౌర్యని కృంగదీశింది.

''డబ్బు దొరకదా?'' అంది అనుమానంగా.

''నువ్వు దిగులుపడకే. డబ్బు విషయం నాకొదిలెయ్యి. బోడి పదివేలు నాకో లెఖ్ఖలోదికాదు. మొన్నే ఓ పాతిక వేలుపెట్టి చౌకగా వస్తుంటే ఇళ్ళస్థలాలు కొన్నా. మిగతాదంతా వడ్డీలకిచ్చా. అయినా ఫర్వాలేదు. రేపు సాయంత్రానికల్లా ఎట్లాగైనా నీకు పదివేలు ఇచ్చే ఏర్పాటు చేస్తా. భయపడకు. నీపెళ్ళయినట్లే. ఆకలెయ్యటంలా? ముందు తిండితిని తర్వాత మాట్లాడుకుందాం''అంటూ లేచింది చండిక.

వాళ్ళెప్పుడు భోజనానికి లేస్తారా అని ఎదురుచూస్తూ వంటింట్లో కూర్చున్నాడు ఆనంద్. చండిక వచ్చి వడ్డించమని చెప్పగానే గబగబా కావలసినవన్నీ టేబుల్‌మీద సర్ది మరేమైనా కావాలంటే పిలవమని చెప్పి తను పక్కకి తప్పుకున్నాడు.

కాళ్ళూ చేతులు కడుక్కుని కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేశారు చండిక, శౌర్యలు. వాళ్లు తిన్న ప్లేట్లు కడిగి తనుకూడా భోంచేసి నిద్రకుపక్రమించాడు ఆనంద్. స్నేహితురాలితో కాస్సేపు కబుర్లు చెప్పి ఆనంద్ గదిలో కొచ్చింది చండిక. ఆమెను చూడగానే ముఖం మాడ్చుకొని అవతలిపక్కకి వత్తిగిల్లాడు ఆనంద్. అతని అలక చూసి ముసిముసిగా నవ్వుకుంది చండిక.

''ఏరా! కోపం తగ్గలేదా? నిన్ను తిట్టటం కొట్టటం నాకు సరదా అనుకున్నావా? అనవసరంగా నాకు కోపం తెప్పించటమెందుకు? అయినా నేచేసినదాంట్లో తప్పేముంది. నువ్వేం పరాయివాడివి కాదుగా ఏమండీ అని పిలవటానికి. నిన్నెంతో అపురూపంగా చూసుకో

వాలని నా ఉబలాటం. కానీ నువ్వే అనవస రంగా చిన్న చిన్న విషయాలకి కూడా మొండిగా ప్రవర్తిస్తున్నావు. ఏది, ఇటు నాకళ్ళ లోకి చూడు. నువ్వంటే నాకెంత ఇష్టమో నీకు తెలియదు" అంటూ బలవంతాన అతన్ని తనవైపు తిప్పుకుని ముద్దుపెట్టుకుంది.

"మరి మిమ్మల్ని ఒసేయ్ ఏమే అని పిలి స్తే ఒప్పుకుంటారా?" అన్నాడు ఆనంద్ బాధగా.

"ఒప్పుకోను. నేనేకాదు ప్రమదావనిలో ఎవ్వ రూ ఒప్పుకోరు. మనం ఎక్కడ నివసిస్తు న్నామో అక్కడి పరిస్థితులకి అనుగుణంగా



నడుచుకోవాలి. పైగా నీకంటే నేను పెద్దదాన్ని. నన్ను గౌరవించటం నీధర్మం"

"నాకంటే నువ్వు పెద్దదానివా?" ఆశ్చర్యంతో నోరెళ్ళబెట్టాడు ఆనంద్.

"దీంట్లో ఆశ్చర్యపడాల్సిందేముంది. ఇక్కడందరూ అంతే. మనమధ్య వయస్సు తేడా చాలా తక్కువ. సహజంగా ఇక్కడ భార్యకన్నా భర్త అయిదారేళ్ళు చిన్నవాడై ఉంటాడు. అది మావద్ధతి... ఆచారం" వివరించింది చండిక.

"ఛీ... ఇదేం పద్ధతి" అన్నాడు ఆనంద్ ఏవగింపుగా.

"మనకి అలవాటులేని ఇతరుల పద్ధతులన్నీ మనకసహ్యంగానే ఉంటాయి. నువ్వు నీ పాతపద్ధతులన్నీ మర్చిపోయి నా పద్ధతులకనుగుణంగా మారితే మనకాపురం హాయిగా సాగిపోతుంది. నేను నీకేం తక్కువ చేస్తున్నాను? నోరు విప్పి అడక్కపోయినా నీ అవసరాలన్నీ గమనించి నీక్కావలసిన వన్నీ తెస్తున్నా. నువ్వు సిగ్గుపడకుండా నీకేమేం కావాలో అడుగు, అన్నీతెచ్చిపెడతా. నాఇంటి దీపానివి నువ్వు. నాముద్దుల ఆనంద్! నీకంటివెంట మరెప్పుడూ నీరు రాకూడదు. నిన్ను సంతోషపెట్టటం నా బాధ్యత" అంటూ ఆనంద్‌ని లాలించటం మొదలుపెట్టింది చండిక.

"నాకో చిన్న అనుమానం" అన్నాడు ఆనంద్ ఆమెనుండి విడిపించుకుంటూ.

"ఏమిటి అడుగు?"

"మీ స్నేహితురాలు చెప్పినవన్నీ నేను కూడా విన్నాను. వారు సుకుమార్‌ని ఎందుకు ప్రేమించినట్లు? ఒకళ్ళనొకళ్ళు చూసుకోటంతప్ప ఎన్నడూ నోరువిప్పి మాట్లాడుకోలేదు. అతనెట్లాంటివాడో ఏమీ తెలియకుండా శౌర్యగారు అంతలా ఎలా ప్రేమించారు?" శౌర్య ప్రేమకథ ఆనంద్‌కి చాలా వింతగా తోచింది.

'అదా నీ సందేహం. లవ్ ఈజ్ బ్లైండ్ అని ఊరికే అన్నారా? కాకపోతే కట్నం పెద్దగా రాదని తప్పితే మామూలు పెళ్ళికీ దీనికీ తేడా ఏముంది? పెద్దవాళ్ళు చూసి నిర్ణయించే



బదులు శౌర్యే ఎంపిక చేసుకుంది. సుకుమార్ మనస్తత్వం ఎలాంటిదైనా పెళ్ళయింతరువాత తన కనుగుణంగా మలచుకుంటుంది. నువ్వు పెళ్ళి చేసుకున్నప్పుడు నీభార్య గురించి పూర్తిగా అర్థం చేసుకున్నావా? మీ ప్రపంచంలో ఆడాళ్ళందరూ తమ కిష్టమున్నా లేకపోయినా కాపురాలు చేసుకోవటంలా? ఇక్కడాభాగ్యం మగాళ్ళకు దక్కుతుంది. భార్యమాట ధిక్కరించే భర్తల బతుకిక్కడ నరకప్రాయమవుతుంది. అయినా ఇప్పుడవన్నీ ఎందుకు'' అంటూ ఆనంద్‌ని తన దగ్గరకు లాక్కుంది చండిక.

''మరొక్కమాట''

''అబ్బ! చంపేస్తున్నావ్. నీ ధర్మసందేహాలన్నీ ఏ పత్రికకన్నారాయి. వివరంగా సమాధానాలిస్తారు. సరే అడుగు. ఇప్పుడు అవసరంనాదిగా'' కొంటెగా అతనివంక చూసి నవ్వుతూ కన్నుగీటింది చండిక.

''ప్రమదావనితో ఇంతమంది మగాళ్లుండగా ఎక్కడోఉన్న నన్ను బలవంతాన తెచ్చి కట్టుకోవటమెందుకు?''

''పాపం ఈ ప్రశ్న చాలాసార్లడిగావు. ఇప్పుడు చెబుతావిను. మీ ప్రపంచంలో మాకు సంబంధించిన సంస్థలు చాలా ఉన్నాయి. దాదావు అవన్నీ అనాధశరణాలయాలే! దిక్కులేని ఆడపిల్లల్ని అక్కడ మాపద్ధతుల్లో పెంచుతాము. అక్కడ పెరిగేవాళ్ళే కాక ఆపదలోఉన్న ఏస్త్రీ అర్థించినా మేం సహాయం చేస్తాం. నీభార్య మా సంస్థల్లో ఒక దాన్నుంచి సహాయం కోరింది. వీలైతే నీకు బాగా బుద్ధొచ్చేలా చేయమంది. నీకు బుద్ధి చెప్పటానికి నేనొచ్చాను. బుద్ధి లేకపోయినా నీకు బోలెడంత అందం ఉంది. ఆ అందాన్నంతా స్వంతం చేసుకోవాలని ఇక్కడకు తెచ్చుకున్నా... చాలా? మరేమైనా అనుమానాలున్నాయా?''

సమాధానం చెప్పకుండా దూరంగా జరిగి పడుకున్నా ఆనంద్‌ని మళ్ళా దగ్గరకు లాక్కుంది చండిక.

''ప్లీజ్! ఈ పూటకు నిద్రపోనివ్వండి. నావంట్లో బాగాలేదు'' అన్నాడు ఆనంద్.

''అన్యాయం! ఇప్పటిదాకా నీక్కావలసినవన్నీ అడిగి చెప్పించుకుని ఇప్పుడు కాదంటావా? నాకు తెలుసులే! ఇందాక నిన్ను తిట్టి కొట్టానని బెట్టు చేస్తున్నావ్'' అంది చండిక అతని చెంపల్ని గడ్డాన్ని నిమురుతూ.

''అదేంకాదు. నిజంగా నాకేంబాగాలేదు. మీకు తెలియందేముంది. మనస్సు బాగాలేనప్పుడు పురుషుడు స్పందించలేడు. నన్నర్థం చేసుకోండి. ప్లీజ్!'' అంటూ ప్రాధేయపడ్డాడు ఆనంద్.

''ఓస్! అదా నీసమస్య. అయితే నేచెప్పినట్లు విను'' అంటూ లేచివెళ్ళి ఏదో ఒక టాబ్లెట్ తెచ్చి ఇచ్చింది.

''ఏమిటిది?'' అనుమానంగా అడిగాడు ఆబిళ్ళవంక చూస్తూ.

''ఏదో ఒకటి. ముందిది వేసుకో'' అంటూ తనే అతని నోట్లో దాన్ని వేసి కాసిని నీళ్ళుపోసింది.

కక్కలేక మింగి మళ్ళీపడుకున్నాడు ఆనంద్. అయిదు నిమిషాలు గడిచేసరికి అతనికి తన మనసు, శరీరం స్వాధీనం తప్పుతున్నట్లనిపించింది. వళ్ళంతా గాల్లో తేలిపోతున్నట్లు ఫీలయ్యాడు. మనస్సు ఏవేవో వింతలోకాల్లో విహరించటం మొదలుపెట్టింది. చండిక చెప్పే మాటలు వింటూ ఆమె పెట్టే గిలిగింతలకి పరవశించిపోతూ అతనికి తెలియకుండానే ఆమెకి లొంగిపోయాడు.

ఆ మరుసటిరోజు మధ్యాహ్నం భోజనంచేసి వెళ్ళిపోయింది శౌర్య. అన్నమాట ప్రకారం చండిక పదివేలు శౌర్యకిచ్చి పంపించింది. ఆమె వెళ్ళిన పదిహేను రోజులకల్లా శుభలేఖ వచ్చింది. శుభలేఖ వచ్చినప్పుడు చండిక ఇంట్లోలేదు. సంసారకూపంలోపడి నరకయాతనలు అనుభవించబోతున్న ఆ అమాయకపు సుకుమార్‌ని తలుచుకుని విచారించాడు ఆనంద్.

మునిమాపువేళ అస్తమిస్తున్న సూర్యుణ్ని చూస్తూ డాబా పిట్టగోడమీద కూర్చున్నాడు ఆనంద్. స్వేచ్ఛగా ఎగురుతూ గూళ్ళని చేరుతున్న పక్షుల్ని చూస్తుంటే అతని మనస్సంతా దిగులుతో నిండిపోయింది. రోజులు గడిచేకొద్దీ జీవితం మరింత దుర్భరంగా తోస్తోంది. ఏదో ఒకరోజున అక్కడినుంచి తప్పించుకోవచ్చనే

ఆశతో జీవిస్తున్నాడు. కానీ ఎంత ఆలోచించినా తప్పించుకునే మార్గం తెలియటంలేదు. పరిస్థితులకు తలవంచి సర్దుకుపోవటానికి పైకి ఎంత ప్రయత్నిస్తున్నా లోపల హృదయం మండిపోతోంది. రాత్రిపూట రకరకాల ఆలోచనలతో నిద్రపట్టక సతమతమవుతున్నాడు. అనేకసార్లు నిద్రపోతున్నప్పుడు చండికను చంపి తనుకూడా చచ్చిపోవాలని విపరీతంగా ఉద్రేకపడేవాడు. కానీ చావే కష్టాలన్నిటికీ పరిష్కారంకాదని మనస్సు హెచ్చరించేది. ఎలాగైనా తను తప్పించుకోవాలి. తప్పించుకోవాలంటే బతికుండాలి. బతికుంటే కష్టాలు భరించాలి... తప్పదు. కానీ ఎలా? ఎలా? ఇంతనీచంగా, దుర్భరంగా ఎంతకాలం జీవించాలి?

రెక్కలు టపటపలాడించుకుంటూ చెట్టుకొమ్మమీదనుంచి ఎగిరివచ్చిన కాకి ఒకటి పిట్టగోడమీద ఆనంద్‌కి దగ్గరలో వాలి కా! కా! అంటూ అరవసాగింది. ఒంటరితనంతో బాధపడుతున్న ఆనంద్‌కి ఆ కాకి అరుపు ఆప్యాయంగా పలకరించే ఆత్మీయుల పిలుపులా వినిపించింది.

కాకిచేత కబురు పెట్టకపోయావా అంటుంటారు. కనీసం ఈ కాకైనా తన కబురు బయటికి చేరవేయకూడదా అనుకున్నాడు.

నీకేం కావాలన్నట్లు కావ్ కావ్ అంటూ మళ్ళీ అరిచిందా కాకి. "ఓ కాకీ! నువ్వు చాలామంచి దానివి కానీ నేనిక్కడ బంధించబడ్డాననే కబురు బయటి ప్రపంచానికి తెలియచెయ్యవూ!" నవ్వుతూనే ప్రాధేయపూర్వకంగా కాకిని చూస్తూ అన్నాడు ఆనంద్.

కావ్ కావ్‌మంటూ అనుమానంగా కొంచెం దూరంగా జరిగిందా కాకి.

"పోనీలే! నీభాష వాళ్ళకర్థంకాదు. కనీసం నీ రెక్కలు కొంచెం నాకివ్వమ్మా హాయిగా ఈ నరకంనుంచి బయటపడతాను"

"కావ్! కావ్!" ఎగిరిపోవటానికి సిద్ధపడిందా కాకి.

"వద్దు... వెళ్ళొద్దు! నాకేదో ఒకదారి చూపించు... ప్లీజ్!" అంటూ లేచి నిల్చున్నాడు ఆనంద్.

అతను లేవగానే భయపడి కాకి ఎగిరిపోయింది. కనుమరుగయ్యే వరకూ అలాగే తల తిప్పి ఆ కాకి వంక దీనంగా చూశాడు ఆనంద్.

కాకి మాయమైంది కానీ మరేదో ఆకారం ఆకాశంలో అతనికంటపడింది. ఏంటది? బాగా పరిచయమున్న ఆకారమే! అవును... అది బెలూన్. ఎట్లా వచ్చింది? ఎవరు ఎగరేస్తున్నారు? అసలది కదులుతోందా-- నిశ్చలంగా వుందా?

జాగ్రత్తగా ఆ బెలూన్‌వంక పరికించి చూశాడు ఆనంద్. పైకి ఎగిరిపోకుండా ఉన్న ఎత్తులోనే అలాగే ఎగురుతోందా బెలూన్. కొద్దిక్షణాల పాటు అతని మెదడంతా మొద్దుబారిపోయింది. ఆశ్చర్యం, ఆనందం, ఆత్రుత, ఏదో తెలియని భయం- అన్నిరకాల అనుభూతులూ ఒకేసారి అతనిలో చోటుచేసుకున్నాయి. తను తప్పించుకోవటానికి అద్భుతమైన మార్గం. దుర్భేద్యమైన ఆ పర్వతాన్ని అతి సునాయాసంగా దాటేమార్గం. కానీ అది సాధ్యమేనా? ఆ బెలూన్ తనకెలా లభిస్తుంది? అది కాకపోతే ఇంకోటి. కానీ ఆ ఇంకోటైనా ఎలా దొరుకుతుంది. పోనీ తనే ఒక బెలూన్ తయారుచేసుకుంటే? ఎట్లా తయారుచెయ్యాలి? కావలసిన వస్తువులు దొరుకుతాయా? దొరికినా ఎవరికంటా పడకుండా - ముఖ్యంగా చండికకి తెలియకుండా - దాన్ని తను తయారుచెయ్యగలడా?

అన్నీ ప్రశ్నలే! సమాధానాలు ఆలోచించే తీరికలేదు. ఏదో ఒకటి చేసెయ్యాలి! ఈ పరమనీచనికృష్ట ప్రపంచంనుండి తప్పించుకోవాలి!

పరుగులాంటి నడకతో గబగబా మెట్లుదిగి మహాభగవతి వరప్రసాద్ ఇంట్లోకి వెళ్ళాడు ఆనంద్. వరండాలో కూర్చుని ఆడుకుంటున్న ధీరజ అతనివంక ఆశ్చర్యంగా చూసింది. అక్కడి మగాళ్ళందరూ వినయవిధేయతలతో తలవంచుకుని నెమ్మదిగా నడవటమే చూసింది కాని ఇట్లా ఆనంద్‌లా పరుగులుపెట్టడం ఎప్పుడూ చూడలా. అతడి వాలకం చూస్తుంటే ఆ పిల్లకు కాస్త అసహ్యం కూడా కలిగింది.

"ఆడాళ్ళలా ఏంటా పరుగులు?" అంటూ అతన్ని నిలేసింది.

"బోడిముండా! నువ్వుకూడా నన్ను కట్టడి చేసేదానివేనా" అని మనస్సులో తిట్టుకుంటూ పైకిమాత్రం, "మీ నాన్నగారున్నారామ్మా?" అంటూ చిరునవ్వులు చిందించాడు.

"ఉన్నాడు... లోపలికెళ్ళండి. పరిగెత్తక్కర్లేదు. మా నాన్నెక్కడికీ పారిపోడులే" అంటూ మళ్ళీ తన ఆటలో లీనమైంది ధీరజ.

'నీయమ్మ కడుపుమాడ! నీ పెత్తనమెక్కువైందేమే' అనుకుంటూ లోపలికి నడిచాడు ఆనంద్.

వంటింట్లో బియ్యపు చాటముందు కాళ్ళు బారచాపుక్కూర్చుని బియ్యంవంక కాకుండా గది కప్పువంక చూస్తున్నాడు మహాభగవతి వరప్రసాద్. అతనీ లోకంలో ఉన్నట్టులేడు. చెయ్యి బియ్యాన్ని కెలుకుతున్నా మనస్సు దీర్ఘాలోచనలో మునిగినట్టుంది. ముఖం నీరసంగా, విచారంగా వుంది. పలకరిద్దామా వద్దా అని సందేహిస్తూనే అతన్ని పిలిచాడు ఆనంద్. ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు ప్రసాద్.

"మీరా... రండి. ఆ కుర్చీలో కూర్చోండి" అంటూ కాళ్ళు ముడుచుకుని మర్యాద చేశాడు.

"మీరా బెలూన్ని చూశారా?" అన్నాడు ఆత్రుతగా.

"బెలూనా... అదేమిటి?" ఆశ్చర్యపోయాడు ప్రసాద్.

"అదేనండీ... గుండ్రంగా, గాల్లో ఎగురుతుందే. ఏమంటారు దాన్ని! గాలిగుమ్మటమా?"

"ఓహో... అదా! అది గుమ్మటం కాదండీ పుష్పకవిమానం. అయినా ఒక్కోసారి మీరు భలే చిత్రంగా మాట్లాడతారు. ఏదో దేవలోకంనుండి దిగివచ్చినట్టు, ఇక్కడి విషయాలే మీ తెలియనట్లు ప్రవర్తిస్తారు. మీరెప్పుడూ పుష్పకాన్ని చూడలేదూ!" అంటూ ఎప్పటినుంచో తీర్చుకోవాలనుకుంటున్న తన సందేహాల్ని వెలిబుచ్చాడు ప్రసాద్.

"అబ్బే! మరేంలేదండి. నాక్కాస్త మతిమరుపెక్కువ. చిన్నప్పుడు కాలుజారి డాబామీద నుండి పడ్డా. అప్పటినుంచీ ఒక్కోసారి హఠాత్తుగా నాకు తెలిసిన విషయాలు కూడా మర్చిపోతా! ఆ బెలూన్ని- అహ- ఆ పుష్పక విమానాన్ని ఎవరెగరేశారు? దాంట్లో ఎవర్నయినా ఎక్కనిస్తారా?" తన రహస్యాన్ని దాచిపెట్టి బెలూన్ రహస్యాన్ని తెలుసుకోవటానికి కథలల్లాడు ఆనంద్.

"పుష్పకంలో మనుషులెక్కటమేంటి... అవచారంకదూ!" అన్నాడు ప్రసాద్ చెంపలేసుకుంటూ.

"మనుషులెక్కటానిక్కాకపోతే మరెందుకు?" ఏదో గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నట్టు అమాయకంగా పోజుపెట్టాడు ఆనంద్.

"పుష్పకవిమానం మహాభగవతి నైవేద్యరథం. సంవత్సరానికోసారి నైవేద్యాల పండగనాడు దాన్నిండా నైవేద్యాలు పెట్టి వదిలేస్తారు. అది ఎగురుకుంటూపోయి ఆ జగన్మాతను చేరుకుంటుంది. ఈసారి మీరుకూడా తొందరగా కూతురు పుట్టాలని మొక్కుకుని నైవేద్యంపెట్టండి. వచ్చేఏడాదికల్లా నట్టింట్లో పిల్ల పాకులాడుతుంది" పిల్లలుపుట్టే దేవరహస్యం చెప్పినట్టు గొంతు తగ్గించి అన్నాడు ప్రసాద్.

'పిల్లకాదు! నీబొంద పాకులాడుతుంది. బోడినలహాలు కట్టిపెట్టి అసలు విషయాలుచెప్పు' అని మనస్సులో తిట్టుకుంటూ, "దాన్నెక్కణ్ణుంచి ఎగరేస్తారు?" అన్నాడు ఆనంద్.

"అదికూడా మర్చిపొయ్యారూ! బాగానే వుంది మీవరస. మహాభగవతి ఆలయంనుంచే ఎగరేస్తారు. వచ్చే ఆదివారం రాత్రే. నెలపొడుపురోజున" అడిగించుకోకుండా ముందుగానే సమయంకూడా చెప్పాడు ప్రసాద్.

ఇహ తెలుసుకోవటానికి ఏమీలేదనుకుని వెళ్లటానికి లేచాడు ఆనంద్.

"అప్పుడే వెళతారా? కాస్సేపు కూర్చోండి" అన్నాడు ప్రసాద్.

"ఇంకా పనికాలేదండీ, మళ్లీ ఆవిడొచ్చేవేళయింది. మీరేదో కాస్త దిగులుగా కన్పిస్తున్నారు. వంట్లో బాగుండటంలేదా?" అన్నాడు ఆనంద్.

"మగపుటక పుట్టాక దిగులుకాక

మరేంవుంటుంది చెప్పండి?'' బాధని అణచు కోవటానికి ప్రయత్నిస్తూ అన్నాడు ప్రసాద్.

''మగపుటక్కీ, దిగులుకీ సంబంధమేమి టండీ! మగాడై పుట్టినందుకు దర్జాగా, జల్సాగా వుండాలిగాని'' అంటూ మీసంమెలేశా డు ఆనంద్.

''చిన్న చిన్న సరదాలకి గతిలేదుగాని నాబ తుక్కి దర్జాలు, జల్సాలూ కూడానా'' అంటూ నిట్టూర్చాడు ప్రసాద్.

''ఇప్పుడు మీకేం తక్కువైందని బాధపడు తున్నారు?''

''తక్కువకాకేముందండీ... అర్జెంటుగా డబ్బుకావాలని నా మొలతాడుతీసుకెళ్ళి తాక ట్టుపెట్టుకున్నారు మావారు. నేనేమో ఈ వసు పుతాడేసుకు తిరగాల్సొస్తోంది. పక్కవీధిలో మా బంధువులు రేపు పేరంటానికి రమ్మన్నారు. ఎట్లావెళ్లేది? ఎంత అవమానం! వీధిలోకి రావా లంటే సిగ్గేస్తోంది. ఆదివారం మహాభగవతిని దర్శించుకునే ప్రాప్తంకూడా లేదు'' అంటూ కంట తడిపెట్టుకున్నాడు ప్రసాద్.

ప్రపంచంలోకల్లా అతిగొప్పదైన వింత చూ స్తున్నట్లు మాటలురాక నిశ్చేష్టుడై నిలబడ్డాడు ఆనంద్. అది కలో నిజమో అర్థంకాలేదు. ఒక మగాడు- మూతిమీద మీసమున్న మగాడు మొలచుట్టూ ఒక వెధవ చచ్చు బంగారపు గొలుసులేదని ఏడవటమేంటి? ఇంతటి మాన సిక దౌర్బల్యం ఎట్లావచ్చిందీ మగాళ్లకు?

''ఛ... ఊరుకోండి. ఈ చిన్న విషయాని క్కూడా ఏడవాలా?'' అన్నాడు ఏంచెయ్యాలో తెలియక.

''మీలాగా నాక్కూడా మతిపోయినట్లయితే దీన్ని చిన్నవిషయంగానే తీసుకునేవాణ్ణి. నాకా భాగ్యం కూడాలేదు! పొద్దున్నే శుచిగా స్నా నంచేసి కళ్లకద్దుకుని ఆ మొలతాడు పెట్టుకు నేవాణ్ణి. అది నా నడుం మీదుంటే ఆవిడ చెయ్యే నా నడుంమీదున్నట్లు ధైర్యంగా వుండేది. మళ్ళీ నాకది దక్కుతుందో లేదో?'' వెక్కిళ్ళుపెట్టడం మొదలుపెట్టాడు ప్రసాద్.

ఆ ఘోరదృశ్యాన్ని చూడలేక బయటికి పరుగెత్తాడు ఆనంద్.

''అదుగో! మళ్ళీ ఆ పరుగేంటి?'' వెనక నుంచి పెద్దగా కేకపెట్టింది ధీరజ.

ఇంట్లోదూరి తలుపేసుకుని తలపట్టుక్కూ ర్చున్నాడు ఆనంద్.

ఛీ ఛీ... వెధవ మనుషులు, వెధవసాంప్రదా యాలు. వీళ్లని గురించి ఆలోచించటంకూడా దండుగ. ఇప్పుడాలోచించ వలసిందల్లా ఆ బెలూన్‌గురించి. ఆదివారంనాడు మహాభగ వతి ఆలయంనుండి దాన్నెగరేస్తారు. ముంద క్కడికెళ్ళి దాన్నుపయోగించుకోవటానికి వీలవు తుందో లేదో తెల్సుకోవాలి. అది వీలుకానప్పు డు మరోదాన్ని తయారుచేసుకునే సంగతి ఆలోచించవచ్చు. ఎలాగైనా మహాభగవతి ఆల యానికి వెళ్లటానికి చండిక పర్మిషన్ సంపా దించాలి. హఠాత్తుగా తనకి మహాభగవతిమీద ప్రేమపుట్టుకొచ్చిందంటే చండిక నమ్ము తుందా? నమ్మకపోతే దాన్ని చంపి శవాన్ని దాచిపెట్టయినా ప్రయత్నించాలి. అది చచ్చిందని తెలిసేలోపల తనకో ఐదారురోజుల సమయం దొరకొచ్చు. ఆ లోపల తనో బెలూన్ తయారుచేసి తప్పించుకోవాలి.

అతని ఆలోచనలకు అంతరాయం కలిగి స్తూ తలుపుతెరిచి లోపలికొచ్చింది చండిక.

మౌనంగా లేచివెళ్లి శుభలేఖతెచ్చి ఇచ్చాడు ఆనంద్. గబగబా అది చదివి తలకొట్టుకుంది చండిక.

''అబ్బబ్బ! దీనికి జన్మలో బుద్ధిరాదు. ప్ర తిదీ చివరి నిమిషంలోకాని చెప్పదు. ఎల్లుండి పెళ్లయితే ఇప్పటికా కబురుచేసేది! కనీసం ఒక్కరోజన్నా ముందువెళ్ళకపోతే మళ్లీ తిడు తుంది. ఇప్పుడెలా? తప్పదు. రేపొద్దున్నే బయల్దేరాలి. ఏయ్ ఆనంద్! ఈ రాత్రికే సూట్‌కేస్ సర్దు. పోయినవారం తెచ్చానే ఆ బట్టలు నువ్వుతెచ్చుకో. అన్నిటికంటే నీకవి బాగుంటాయ్. పెళ్లిలో వేసుకుందువుగాని'' అంటూ హడావుడి చేసింది.

''నేను రాలేను. మీరెళ్లండి'' అన్నాడు ఆనంద్ కాఫీకప్ అందిస్తూ, నీరసంగా మొ హంపెట్టి.

''ఏం... ఎందుకు రాలేవు?''

''వంట్లో బాగాలేదు''

''అదేంటి? జ్వరంగావుందా... ఏదీ చూడని

వ్వు'' అంటూ నుదుటిమీద చెయ్యివేసింది.

''జ్వరంకాదు. రాత్రి అ బిళ్ళేసుకున్న దగ్గర నుండీ ఏదోగా వళ్ళుతిప్పినట్లుంది. మధ్యాహ్నం భోంచేసిన తరువాత వాంతుల య్యాయి. కళ్ళు తిరుగుతున్నాయి.'' అన్నాడు ఆనంద్ మరింత నీరసంగా.

''అరె! నేనాసంగతే మర్చిపోయాను. పోయినసారి వేసుకున్నప్పుడు కూడా ఇలాగే వుంద న్నావ్‌కదూ! అలవాటయ్యేవరకూ ఇలాగే ఉంటుందిలే. సరేలే, పోనీ నేనొక్కదాన్నే వెళ్తాస్తా. నువ్వు విశ్రాంతి తీసుకుందువుగాని'' అంది చండిక అతని నాటకాన్ని నిజమని నమ్ముతూ.

ఆ రాత్రి నిద్రపొయ్యేవరకూ ముక్కుతూ, మూల్గుతూ తిరిగాడు ఆనంద్. చండికకూడా జాలిపడి అతనికి పనులేమీ చెప్పకుండా తనే సూట్‌కేస్ సర్దుకుంది. మర్నాడు ఉదయం టిఫిన్‌తిని ఎనిమిదింటికల్లా బయలుదేరింది.

''పోనీ భోంచేసి వెళ్లకూడదూ? అక్కడికి చేరేసరికి ఆలస్యమవుతుందేమో?'' అన్నాడు ఆనంద్ ప్రేమ ఒలకబోస్తూ.

''ఆలస్యమేముంది. సరిగ్గావెళితే అరగంట కూడా పట్టదు. బస్‌లో ప్రయాణం చేసేపనిలేదు. నా మోటార్ బైక్‌మీదే వెళతాను'' అంది చండిక.

''అంత దగ్గరా? మరయితే రాత్రికి వచ్చెయ్యొచ్చుగా. ఒక్కణ్ణీ వుండాలంటే నాకు విసుగ్గావుంటుంది'' అన్నాడు ఆనంద్, నిజంగా ఆమె తిరిగివస్తుందో రాదో తేల్చుకోవటానికి.

''రేపు పెళ్లయితే ఇవ్వాళ రావటమెలా కుదురుతుంది? ఎన్ని పనులుంటాయో! శౌర్య నన్నసలు కదలనివ్వదు. నువ్వుకూడా వస్తే బాగుండేది. పోనీ రేప్పొద్దున్నే చీకటితోవచ్చి తీసుకెళ్లనా?''

ఆనంద్ గుండెల్లో రాయిపడింది. నిజంగా వస్తుందేమోనని భయపడ్డాడు.

''వద్దులెండి. అక్కడికి చాలామంది వస్తారు. నాకేమో పద్ధతులేమీ తెలియవు. ఎవరితో ఎట్లా మాట్లాడితే ఏం తంటావస్తుందో?'' అన్నాడు మళ్లీ మూలుగుతూ.

''సరే... నీయిష్టం. పెళ్లయిన మర్నాడు ఉదయాన్నే వచ్చేస్తాను. జాగ్రత్తగావుండు. అసలే రోజులు బాగాలేవు'' అంటూ బీరువాదగ్గరకెళ్లింది చండిక.

''అమ్మయ్య!'' అని సంతోషంగా నిట్టూర్చాడు ఆనంద్.

చండిక బీరువా తెరిచి అరలన్నీ వెతికి ఒక ప్యాకెట్ ఏదో బయటికి తీసింది.

''ఇదిగో శీలరక్షిణి... త్వరగావెళ్లి దీన్ని తొడుక్కో'' అంటూ ఆ పేకెట్ అందించింది.

''ఏమిటి సీలలా?'' అన్నాడు ఆనంద్ అర్థంకాక.

''సీలలుకాదు... శీలరక్షిణి! నేనేమో రెండు రోజులు ఇక్కడుండను. మరి ఆ సమయంలో నీమీదేదైనా అత్యాచారం జరిగితే ఎలా? అంటే తప్పకుండా జరుగుతుందని కాదు, మన జాగ్రత్తలో మనముండటం మంచిది కదా!''

''అత్యాచారమేంటి! శీలరక్షిణేంటి!!'' విస్తుపోతూ అడిగాడు ఆనంద్.

''అర్థరాత్రి దుష్టస్త్రీలెవరైనావచ్చి మీదపడితే నీ శీలాన్నెలా రక్షించుకుంటావు? ఖర్మచాలక శీలం పోగొట్టుకుంటే నీబతుకు కుక్కలు చింపిన విస్తరవుతుంది. అందుకని ఈ శీలరక్షిణి వేసుకున్నావంటే ఏ భయమూవుండదు. నువ్వు చెడిపోతే నాకెంత నామర్దాగా వుంటుందో చెప్పలేను. ఆ భయంకర పరిస్థితులన్నిటినీ ఇది తప్పిస్తుంది'' అంటూ ప్యాకెట్ విప్పి ఇనుముతో చెయ్యబడిన ఆ శీలరక్షిణిని చూపించి ఎలా ధరించాలో చెప్పింది.

ఆనంద్ తల దిమ్మెక్కింది.

''మీరు మరీవిడ్డూరంగా మాట్లాడుతున్నారు. మగాడికి శీలం పోవటమేంటి?'' అన్నాడు పెగలని గొంతుతో.

''దీంట్లో విడ్డూరమేముంది? మీది పురుషాధిక్య సమాజం కాబట్టి స్త్రీల శీలానికి పవిత్రత ఆపాదించారు. మాది స్త్రీ ఆధిక్య సమాజంకాబట్టి మేం పురుషుల శీలానికి పవిత్రత ఆపాదించాం. మా ఆచారాలు మావి... త్వరగా వేసుకో'' అంటూ తొందరచేసింది.

''పురుషులదో! స్త్రీలదో! సమాజమేదైనా మగాడికి శీలంపోతే నష్టమేముంది?''

"మరి స్త్రీకిమాత్రం నష్టం ఏముంది?"

"స్త్రీకి గర్భం వస్తుంది"

"అది లాభమేగాని నష్టమెట్లా అవుతుంది?"

"భర్త మూలంగాకాకుండా పరపురుషుల ద్వారా గర్భం తెచ్చుకోవటం ఛీ... నీచంకాదూ" చీదరించుకున్నాడు ఆనంద్.





"నీచంగా ఆలోచించేవాళ్లకి తమ తప్పులు తప్ప అన్నీ నీచంగావే అనిపిస్తాయి. పిల్లల్ని కనటం మాహక్కు... బాధ్యత! ఎవరి మూలంగా కన్నా పిల్లలే పుడతారు కానీ రాళ్లు కాదుగదా. పిల్లల్ని కనటంలో సిగ్గుపడాల్సిన పనేముంది. ఒక ప్రాణిని సృష్టిస్తున్నందుకు గర్విస్తాం. నీ జన్మంతా తపస్సు చేసినా నువ్వు కనగలవా?'' సవాలుచేసింది చండిక.

''కనలేను నిజమే! కానీ మగాళ్లు లేకుండా స్త్రీలు మాత్రం పిల్లల్నెలా కంటారు?'' గర్వంగా అన్నాడు ఆనంద్.

''పిల్లల్ని పుట్టించడమే మగాళ్లపనయితే ప్రపంచంలో ఇంతమంది మగాళ్లక్కరలేదు. ఏ వందమంది ఆడాళ్లకో ఓ మగాడుంటే చాలు. మిగతా వాళ్లందర్నీ చంపి తగలేస్తే సమస్య తగ్గుతుంది'' పకపకనవ్వింది చండిక.

ఆనంద్ ముఖం నల్లగా పెట్టుకున్నాడు.

"మీ సమాజంలో స్త్రీని మీ ఆస్తిగా భావించారు. మీ వస్తువుని ఇతర్లు అనుభవించటం భరించలేరు. ఇక్కడ పురుషులు మా ఆస్తి. మా వస్తువుని ఇతర్లనుభవించటం మేం భరించలేం. తనకిష్టం లేకపోయినా ఘోరంగా మానభంగానికి గురైన స్త్రీని మీరేంచేస్తారు? శీలం పోగొట్టుకుందని నీచంగా చూస్తారు... వెలేస్తారు. జీవితాంతం కుళ్లికుళ్లి చచ్చేలా ఎగతాళి చేస్తారు. కానీ దానికి కారకులైన వాళ్లనేం చేస్తారు? జరిమానా... కాకపోతే కొద్దికాలం ఖైదు. అట్లాంటివాళ్ల మర్మావయవాలు ఖండించబడాలనే చట్టం చెయ్యండి. మళ్లీ అట్లాంటి పనులు జరుగుతాయేమో చూద్దాం! ఊహూ... అలాంటి చట్టాలు మీరు చెయ్యలేరు. మీ చట్టాలు, నైతిక సూత్రాలు, ఆచారాలూ అన్నీ పురుషులేర్పరచినవే. హిందూమతం, క్రైస్తవం, బౌద్ధం, మహమ్మదీయమతం అన్నీ పురుషులు స్థాపించినవే. అన్నిట్లో చెప్పిన పరమసత్యం ఒక్కటే. స్త్రీ పురుషుడి అధీనంలో వుండాలి, అణకువగా వుండాలి, ఊడిగం చెయ్యాలి. జ్ఞాన మార్గానికీ, ముక్తి మార్గానికీ స్త్రీ అర్హురాలు కాదు. పెళ్లాం పిల్లల్ని వదిలేసి సన్యసిస్తే మగాడు మహాపురుషుడౌతాడు. మహాజ్ఞానిగా, ముక్తిప్రదాతగా పరిగణించబడతాడు. మరి మొగుణ్ణీ, పిల్లల్నీ వదిలేసిన స్త్రీ ఏమవుతుంది? పాపిష్టిది. కన్నుమమకారం

కూడాలేకుండా పిల్లల్ని వదిలేసే కసాయిది - పాతకి, వంచకి, కులట ...'' ఆవేశంలో నోట మాటలు రాలేదు చండికకి.

"భర్తను వదిలేస్తే మరి స్త్రీకి రక్షణేది!'' భయపడుతూనే అన్నాడు ఆనంద్. "అదేరా నేను చెప్పేదీ! నా రక్షణ లేకుండా నువ్వు బయటికెళ్ళి ఇక్కడ జీవించటానికి ప్రయత్నించు చూద్దాం! నీతి నియమాల్లేని పరమనీచుడిగా నిన్ను లెక్కగడతారు. ఇక్కడి పరమ సతీవ్రతులు నీముఖాన వుమ్మేస్తారు. స్వతంత్రంగా బతకటానికి డబ్బుండదు. చెయ్యటానికి పనుండదు. అడుక్కుందామన్నా బిచ్చమేసేవాళ్లుండరు. వయస్సులో వున్నావు కాబట్టి ఏ దుష్టస్త్రీలో పట్టుకెళ్లి నీ వంటితో వ్యాపారం చేస్తారు. నిన్ను పీల్చి పిప్పిచేసి రోగాలతో రొచ్చులతో బాధపడుతుంటే నిర్దాక్షిణ్యంగా బయటికి గెంటేస్తారు. ఆకలికి మాడి దిక్కులేని చావుచస్తే నీ శవాన్ని కుక్కలు పీక్కుతింటాయి. ఇది అన్యాయం, ఘోరం, నాకు సహాయంచెయ్యండని ఎంత మొత్తుకున్నా ఇక్కడి పురుషులు నీవైపు కన్నెత్తిచూడటానికి కూడా గడపదాటి బైటికిరారు. అది నీఖర్మనుకుంటారు. బయటికొస్తే వాళ్లగతీ అంతే అవుతుందని భయపడతారు. తామూ రక్తమాంసాలున్న మనుషులమని, తమకి జరుగుతున్న అన్యాయాల్ని ఎదిరించి స్వేచ్ఛగా బతకొచ్చనే ఆలోచనే వాళ్లకుండదు. చదువు సంధ్యలక్కర్లేదు. స్నేహితులక్కర్లేదు. కలిసికట్టుగా ఆలోచించి ఏదైనా చెయ్యాలనే ధ్యాసవుండదు. సంఘటితమైతే తామో బలమైన శక్తిగా రూపొందవచ్చని కలలోకూడా వూహించలేరు. ఎవరిళ్లలో వాళ్లు ఒంటరిగా భార్యసేవలో తరించిపోవాలని తాపత్రయపడతారు. ఇల్లే స్వర్గం! భార్య మహాభగవతి ప్రతిరూపం! అనవసరంగా వాదనపెంచి నాక్కోపం తెప్పించకు. త్వరగా ఆ శీలరక్షిణి తొడుక్కుని తాళంవేసి తాళంచెవి నాకివ్వు'' అంటూ గుడ్లురిమింది చండిక.

వాదులాడి లాభంలేదు. తన్నయినా తొడుగుతుంది. ముందు దీన్నిక్కడినుంచి పంపిస్తే తను తప్పించుకునే మార్గం దొరుకుతుందను కుంటూ లోపలికెళ్లి దాన్ని తొడుక్కున్నాడు ఆనంద్.

అతనిచ్చిన తాళంచెవి అందుకుని నిజంగా తాళంవేశాడోలేదోనని నడుము తడిమి చూసింది. అన్ని జాగ్రత్తలూచెప్పి వెళ్లిపోయింది. కనుమరుగయ్యేవరకూ చూసి స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నాడు ఆనంద్.

రెండురోజుల్దాకా దీని పీడవుండద్దు. ఈలోపల ఏదో ఒకటిచేసి ఇక్కణ్ణించి బయటపడాలి. ముందసలు మహాభగవతి ఆలయానికి వెళ్లి బెలూన్ ఎక్కడుందో, తనకుపయోగపడుతుందో లేదో పరీక్షించాలి. చూట్టానికి పెద్దదాన్లాగే వుంది. దాంట్లో ప్రసాదాన్నిపెట్టి వదుల్తారు కాబట్టి తన బరువుని తేలిగ్గానే అది మొయ్యగలుగుతుంది. మరింకా తెలియని ఇబ్బందులేమైనా వున్నాయా? ఎవరి కంటాపడకుండా దాన్నుపయోగించుకోవటం ఎలా? పగలు లాభంలేదు. రాత్రిపూటే ఆ పని జరగాలి. కానీ రాత్రిపూట మగాళ్లు ఇక్కడ ఒంటరిగా సంచరించటం ప్రమాదమని చెబుతున్నారు కాబట్టి, అర్ధరాత్రివేళ అందరూ నిద్రపోయింతర్వాత వెళితే తప్పించుకోవటానికి బదులు మరిన్ని చిక్కుల్లోపడొచ్చు. ఎలా?

ఏంచెయ్యాలో, ఎలాచెయ్యాలో తరువాత ఆలోచించవచ్చు. ముందు మహాభగవతి ఆలయానికి వెళ్లి రావాలని నిశ్చయించుకున్నాడు. హుషారుగా లేచి గబగబా స్నానంచేసి ముస్తాబై బయలుదేరాడు. అతని పెళ్ళి ఆ ఆలయం లోనే జరిగింది. దారి బాగా పరిచయమున్నదే. కానీ పెళ్ళిరోజు తరువాత అతనెప్పుడూ మళ్ళీ ఆలయంలో ప్రవేశించలేదు. అప్పుడు కూడా సిగ్గుతో వంచిన తల ఇంటికొచ్చేదాకా ఎత్తలేదు. ఇప్పుడు పరీక్షగా చూస్తుంటే అద్భుతంగా కనబడింది ఆలయం. చుట్టూ ఎత్తైన ప్రహరీగోడ వుంది. గేటుదగ్గర కాపలాలేదు. గేటు దాటి లోపలికి అడుగుపెట్టగానే ఆనంద్ కళ్ళు బెలూన్ ఎగరేసిన ప్రదేశం కోసం వెతికాయి. కనుక్కోవటం కష్టమేమీకాలేదు. గుడి వెనక పక్క తోటలోనుంచి అది ఎగురవేయబడింది. మనసటు లాగినా సరాసరి అటుపోతే ఎవరైనా అనుమాన పడతారేమోనని గుడివైపు కాళ్ళని మళ్ళించాడు. దాదాపు నలభై అడుగుల ఎత్తున అండాకా

రంలో ఉంది గుడి. పైభాగం బంగారంతో తాపడం చేయబడింది. గుడికెదురుగా విశాలమైన మంటపం ఉంది. చుట్టూ చక్కని ఉద్యానవనం.

ఉదయంపూట కావటంవల్ల గుళ్ళో ఎక్కువమంది లేరు. పది పన్నెండు మంది ఆడపిల్లలు మంటపంలో కూర్చుని ఏవో శ్లోకాలు వల్లెవేస్తున్నారు. వాళ్ళకవి నేర్పుతున్న స్త్రీ శ్రద్ధగా ఆలకిస్తూ, తప్పులు చదువుతున్న వాళ్ళని సరిదిద్దుతోంది. రెండు మూడు జంటలు గుడిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. స్త్రీలు ముందు నడుస్తుంటే పురుషులు వాళ్ళవెంట తోకల్లా వెంబడిస్తున్నారు.

ప్రదక్షిణాలు చెయ్యకుండానే సరాసరి గర్భగుడిలో కెళ్ళాడు ఆనంద్. మహాభగవతి విగ్రహం ముందు నిలబడి పరిశీలనగా చూశాడు. దాదావు ఏడెనిమిది అడుగుల స్త్రీమూర్తి విగ్రహం అది. పట్టువస్త్రాలతో, బంగారు ఆభరణాలతో అలంకరించబడి ఉంది. తలమీద వజ్రకిరీటం ధగధగా మెరిసిపోతోంది. చేతులు రెండే ఉన్నాయి. ఆయుధాలు లేవు. దీవిస్తున్నట్లుగా రెండు అరచేతులూ కనబడుతున్నాయి. ప్రశాంత వదనం, పెదవులమీద చిరుదరహాసం, వాత్సల్యాపూరిత నయనాలు! చూడగానే 'అమ్మా' అని పిలవాలనిపించేటట్లుంది. అప్రయత్నంగా చేతులెత్తి నమస్కరించాడు.

గుడిలో నుంచి బయటికొచ్చి చుట్టూ పరికించిచూశాడు. ఎవరి ధ్యానలో వాళ్ళున్నారు. అతని ఉనికిని ప్రత్యేకంగా ఎవరూ గమనించటంలేదు. తృప్తిపడి మెల్లగా బెలూన్ ఉన్న ఆలయం వెనుకభాగంలోని తోటకేసి నడిచాడు. చక్కని పూలమొక్కలతో, గుబురుగా పెరిగిన పొదలతో అందంగా ఉందాతోట. తోటలో ఎవరూలేరు. తలపైకెత్తి బెలూన్ వంక చూస్తూ ముందుకెళ్ళాడు. నేలలో పాతిన ఇనుపమేకుకి బలమైన సన్నని ప్లాస్టిక్ తాడుతో కట్టివేయబడి ఉందా బెలూన్.

బెలూన్ అడుగున వెడల్పాటి బుట్టొకటి ఉంది. బహుశా దాన్నిండా ప్రసాదం నింపి వదిలేస్తారని ఊహించాడు. దాంట్లో తను కూర్చోవచ్చు. బెలూన్‌కి అడ్డం రావటానికి చుట్టుపక్కల పెద్దచెట్లుగానీ, కరెంటు తీగలుగాని లేవు. అంతా అనుకూలంగానేఉంది. కాని రాత్రిపూట అక్కడ కాపలా వుంటుందా, వుండదా? ఉంటే ఎంతమంది ఉంటారు? ఆ విషయాలెలా తెలుసుకోవాలి? ఎవర్నయినా అడిగితే అనుమానిస్తారేమో! తీవ్రంగా ఆలోచించసాగాడు.

అటుగా ఎవరో వస్తున్న చప్పుడు వినిపించింది. వెనక్కి తిరిగి చూశాడు. ఎవరో ఒక ముసలావిడ చేతిలో పారపట్టుకుని వచ్చి అక్కడి మొక్కల పాదులు సరిచెయ్యటం మొదలుపెట్టింది. తోటమాలై వుంటుందనుకున్నాడు ఆనంద్. ఆవిడని ప్రశ్నిస్తే! అనుమానపడకుండా ఉంటుందా? ఎలాగైనా తెలివిగా బోల్తా కొట్టించాలనుకున్నాడు.

"ఈ తోట చాలా అందంగా వుందండి" అన్నాడు ఆమెవైపు రెండడుగులు వేసి.

తలెత్తి ఆనంద్ వంకోసారి చూసి మళ్ళీ తనపని చేసుకోసాగిందావిడ.

"ఈ తోట పనంతా మీరొక్కరే చేస్తారా?" మళ్ళీ మాట కలిపాడు.

"పాతికేళ్ళుగా నేనే చేస్తున్నా" అందావిడ అతని వంక చూడకుండానే.

"ప్రతి మొక్కా, ప్రతి తీగా ఎంతో శ్రద్ధగా పెంచారు. మొక్కల్నే ఇంత శ్రద్ధగా పెంచితే ఇహ మీ పిల్లల్నెంత శ్రద్ధగా పెంచారో?" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"ఎంత శ్రద్ధున్నా ఏంలాభం? ఆ మహాభగవతి నన్ను కరుణించలా" అందావిడ విచారంగా.

"అదేంటి... ఏమయింది?" అన్నాడు ఆనంద్ ఎంతో శ్రద్ధగా.

"ఈ ముసలితనంలో నాకాసరాగా నిలవటానికి ఒక్క ఆడపిల్లనన్నా ప్రసాదించలా" అందావిడ పార పక్కనపెట్టి.

"మీకసలు పిల్లల్లేరా?"

"ఎందుకులేరు. ఇద్దరు మగపిల్లలున్నారు. ఏంలాభం! వాళ్ళ పెళ్ళిళ్ళు చేసి సాగనంపేసరికి తలప్రాణం తోకకొచ్చింది. ఈ వయస్సులో కూడా చాకిరి చెయ్యాల్సొస్తోంది.

ఒక్క ఆడపిల్లుంటే నాకీ బాధలు తప్పేవి కదా!'' అంటూ నిట్టూర్చిందామె.

"బాధపడకండి. మీకు మగపిల్లలన్నా వున్నారు. మాకసలు పిల్లలే లేరు. ఒక్కళ్ళన్నా ఇవ్వమని రోజూ ఆ దేవిని ప్రార్థిస్తున్నా.. కనికరిస్తుందో లేదో'' అన్నాడు తనుకూడా విచారం ప్రకటిస్తూ.

"అరె! పాపం మీకు పిల్లలే లేరా? జాగ్రత్తగా ఏలోటూ రానివ్వకుండా నిష్ఠగా పూజలు చెయ్యినాయినా! నా మొగుడు సరిగ్గా నిష్ఠపాటించనందువల్లే మగపిల్లలు పుట్టారు'' చాలా సిన్సియర్‌గా సలహా ఇచ్చిందావిడ.

"నేనూ అదే అనుకుంటున్నానండీ! వచ్చే పౌర్ణమినాడు ఉపవాసముండి తెల్లవార్లూ అమ్మవారి ముందు కూర్చుని జపం చేయాలని వుంది. కానీ రాత్రంతా ఇక్కడే కూర్చోవాలంటే భయంగా ఉంది. రాత్రిపూట ఎవరైనా ఇక్కడ కాపలా వుంటారా?'' అమాయకంగా అడిగాడు.

"ఎందుకుండరూ! ఇద్దరు కాపలావాళ్లుంటారు. అయినా మహాభగవతి ఆలయంలో భయమేముంటుంది. నువ్వూ, మీ ఆవిడా నిశ్చింతగా జపం చేసుకోవచ్చు. కానీ నువ్వుమాత్రం బాగా నిష్ఠగా వుండాలి'' అంటూ మళ్ళీ పారందుకుందామె.

"ఈ పూలు చాలా బాగున్నాయండీ. రెండు కోసుకోవచ్చా?''

"పూలదేం భాగ్యం... కోసుకో'' అంటూ వేరే పనిమీద దూరంగా వెళ్ళిందామె.

తన ప్లాన్ పారినందుకు మహదానందపడ్డాడు ఆనంద్. రెండు పూలు కోసి వాసన చూస్తూ గబగబా ఇంటిదారి పట్టాడు.

ఇంట్లోకి అడుగుపెట్టగానే ఎక్కడలేని ఆకలి పుట్టుకొచ్చింది. పొయ్యి వెలిగించి ఓ గిద్దెడు బియ్యం కడిగిపడేశాడు. కూరవండే ఓపిక, కావాలనే తపన లేవు. పచ్చడి, పెరుగుతో భోజనం పూర్తిచేసి కాస్సేపు నిద్రపోయాడు. విచిత్రమైన రకరకాల కలల్లో మునిగితేలాడు. తనకి రెక్కలొచ్చి ఎగిరిపోతున్నాడు. చండిక హెలికాప్టర్‌లో ఎక్కి తరుముతోంది. తుపాకితో కాల్పులు జరుపుతోంది. కానీ తనకొక్కటీ తగలటంలేదు. చివరికి తన రెక్కల్లోని ఒక ఈకతీసి మంత్రించి ఆమె మీదకు విసిరాడు. హెలికాప్టర్ తగలబడిపోతోంది.

"చావు! చావు! కాలి బూడిదైపో!'' పెద్దగా కేకలేస్తూ ఉలిక్కిపడిలేచాడు ఆనంద్. వచ్చిన కలని గుర్తుతెచ్చుకుని కనీసం కలలోనన్నా చండికను చంపగలిగినందుకు సంతోషించాడు. టైమ్ నాలుగయింది. ఇహ చెయ్యవలసిన కార్యక్రమాన్ని గుర్తు తెచ్చుకుంటూ లేచాడు.

ఎనిమిది తొమ్మిదింటి వరకూ మహాభగవతి ఆలయం సందడిగానే ఉంటుంది. కాబట్టి ఎనిమిదింటికి అక్కడకి చేరుకుంటే సరిపోతుంది. ఎవరూ చూడకుండా అక్కడే దాక్కోవాలి. అర్థరాత్రివేళ పని ముగించాలి. సాధ్యమైనంత వరకూ కాపలావాళ్ళని చంపకుండా పని ముగించగలిగితే మంచిది. ఆలోచించే కొద్దీ అతనిలో టెన్షన్ పెరగసాగింది. ఎక్కడా తనకి ప్రతికూలించే అంశాలేవీ కనబడటంలేదు. అయినా ఏదో తెలియని భయం, ఏం జరుగుతుందోననే ఆరాటం మనస్సుని వేధిస్తున్నాయి.

దాదాపు అయిదున్నరకు మహాభగవతి వరప్రసాద్ వచ్చాడు. ఆ సమయంలో అతన్ని చూస్తే ఆనంద్‌కి చిరాకేసింది. మాటలు కలపకుండా ముభావంగా కూర్చున్నాడు.

"ఏంటి అట్లా ఉన్నారు?'' అన్నాడు ప్రసాద్ అనుమానంగా.

"ఏమీలేదు! కాస్త తలనొప్పిగా వుంది'' అంటూ తప్పించుకున్నాడు ఆనంద్.

కాస్సేపు ఇరుగింటి సుందరాన్ని గురించి, పొరుగింటి సుబ్బారావుని గురించి తనకు తెలిసిన చాడీలు చెప్పి వెళ్ళిపోయాడు ప్రసాద్.

అతను వెళ్లాక తలుపులు బిగించి తనపని మొదలుపెట్టాడు ఆనంద్. ఇంటినుంచి తీసుకెళ్లాల్సినవేమీలేవు. ఆత్మరక్షణకు, అవసరమైతే కాపలావాళ్ళను పొడిచి చంపటానికి కత్తికావాలి. ఇంట్లో ఓ చిన్న కత్తివుంది. చిన్నదైనా దాన్నే ఉపయోగించుకోవాలి. తను బయటికెళ్లి కత్తులుకొనటం మంచిదికాదు.




అందంగా, అరుదైన శరీర సౌష్టవంతో అపురూపంగా వుండే ఆమె తన సౌందర్యాన్ని తనివితీరా చూసుకుందుకు ఓ నిలువుటద్దం కావాలనుకుంది.

పేదకుటుంబంలో పుట్టడంతో ఓ పేద గుమస్తానే పెళ్లాడినా ఆమె చిరుకోరికను ఆ భర్త తనకొచ్చే బోనస్‌తో తప్పక తీరుస్తానన్నాడు.

కానీ తీరా అద్దంవచ్చాక అందులో తన మొహాన్ని చూసుకున్న ఆమె కెవ్వుమంది.

కారణం?

**హృదయపు లోతులను స్పృశించే తెలుగు కథ "అజరామరం" కథల పోటీలో బహుమతి పొంది ఆగస్టు 'విపుల'తో మీవద్దకు రాబోతోంది.**

ఆసక్తికరమైన మరో 16 కథలతో
ఆగస్టు సంచిక.

# విపుల

రెండున్నర రూపాయిలే.

ఉన్న కత్తి చిన్నదైనా పదును బాగానేవుంది. ఓ అరగంట కూర్చుని దానికి మరికాస్త పదును పెట్టాడు. ఆరున్నరకి స్నానంచేసి తలదువ్వు కున్నాడు. జడవేసుకోవడం మంచిదికాదని పించింది. ఒకవేళ కావలావాళ్లతో కలబడాల్సి వస్తే జడ అడ్డంవస్తుంది. దాన్నిపట్టుకు రెండు గుంజులు గుంజారంటే తనపని ఖాళీ. పోనీ ఎటుకూడీ తను తప్పించుకుంటాడు కనుక అసలీ జుట్టంతా కత్తిరించేస్తే ఎలా వుంటుందని ఆలోచించాడు. అదంత మంచి పనిగా తోచలా.

పావుగంటసేపు శ్రమపడి గట్టిగా జుట్టు ముడివేసుకున్నాడు. ఇంట్లో రకరకాల చుట్ట పిన్నులున్నాయి. అన్నిటికన్నా దృఢంగా, పొడ వుగావున్న వాటిని ఎంచుకున్నాడు. అవి మొన దేలి చాలా వాడిగావున్నాయి. వాటిని తెచ్చిన ప్పుడు అవసరనమయాల్లో ఆత్మరక్షణక్కూడా ఉపయోగపడతాయని చెప్పింది చండిక. పొర పాటున కావలావాళ్లు తన కొప్పు పట్టుకుంటే చెయ్యి చీరుకుపోవలసిందే!

ఆకలిగా లేకపోయినా మళ్ళీ ఎప్పుడు తింటానో అనుకుని కొద్దిగా పెరుగు కలుపుకుని భోజనకార్యక్రమం ముగించాడు. అప్పుడప్పు డు కూరగాయలు, వెచ్చాలు తేవటానికి డబ్బు లిస్తుండేది చండిక. వాటిల్లో మిగుల్చుకున్నవి ఓ పాతికరూపాయలున్నాయి. వెళ్లేటప్పుడు చండిక మరో యాభైరూపాయలిచ్చి వెళ్లింది. మొత్తం భద్రంగా జేబులో పెట్టుకున్నాడు. కత్తి పదును మరోసారి పరీక్షించి హ్యాండ్‌బ్యాగ్‌లో వేసుకున్నాడు. వీడ్కోలు చెబుతున్నట్లు ఇల్లంతా మరోసారి తిరిగి తలుపులువేశాడు. వరండా తలుపుకు తాళంవేసి నిలబడ్డాడు.

టైమ్ ఏడున్నరయింది. ఆలయం చేరుకో వాలంటే దాదాపు అరగంట నడవాలి. గేటుద గ్గరకొచ్చి వీధిలోకి తొంగిచూశాడు. వీధి నిర్మాను ష్యంగానేవుంది. తను వెళ్లటం ఎవరైనాచూస్తే ఎక్కడికి, ఎందుకు అని ఆరాలుతీస్తారని భయం. ఎదురుగా మహాభగవతి వరప్రసాద్ ఇంటితలుపులు దగ్గరకువేసి ఉన్నాయి. వరండాలో ఎవరూలేరు. లైటుకూడా వేసిలేదు.

చప్పుడుకాకుండా గేటుతీసి బయటకొచ్చి మళ్లీ గేటువేశాడు. మరోసారి ఆ చివర్నుంచి ఈ చివరివరకూ వీధిని పరిశీలించాడు. ఎవరూలే రు. ఉన్నట్లుండి అతనికి సహాయంచెయ్యటా నికన్నట్లు కరంటే పోయింది. మరి ఆలస్యంచె య్యకుండా తలవంచుకుని వడివడిగా నడ వటం ప్రారంభించాడు ఆనంద్. పక్కవీధుల్లో కరెంట్‌బాగానే ఉంది. అంటే తనకోసమే తన వీధిలో కరెంట్ పోయింది. అన్నీ తనకి అను కూలంగా జరుగుతున్నాయి... సందేహంలేదు. ఈరోజుతో తనకీ చెర తప్పుతుంది. ఆ దేవుడు కూడా తనకి సహాయంచేస్తున్నాడు.

'ఆపద్బాంధవా! అనాథరక్షకా! తిరుమలే శా! నన్ను కనికరించి ఈ గండం గట్టెక్కించు స్వామీ! కాలినడకన నీకొండకొస్తాను స్వామీ! నా తలనీలాలర్పించుకుంటాను. ముడుపుకట్టి పదివేలు నీ హుండీలో వేస్తాను స్వామీ! నన్ను కాపాడు' అంటూ దీనంగా భక్తితో మొక్కుకు న్నాడు.

కొండంతధైర్యం వచ్చిందతనికి. మెయిన్‌రో డ్లో తలెత్తుకుని దర్జాగా వెళ్లసాగాడు. వీధుల్లో వెళుతున్న ఆడాళ్లు, పనీపాటలేకుండా పనికి మాలిన కబుర్లు చెప్పుకుంటూ నిలబడి వచ్చే పోయేవాళ్లని చూస్తున్న ఆడాళ్లూ ఒకసారి ఆనంద్‌వంక చూసి రక్షణకవచంలా అతని నడుముచుట్టూ ఉన్న మొలతాడు గమనించి తలలు తిప్పుకుంటున్నారు.

ఏ అడ్డంకులూలేకుండా స్వేచ్ఛగా ఆలయం చేరుకున్నాడు ఆనంద్. లోపల జోరుగా భజనకార్యక్రమం జరుగుతోంది. భజ నలుచేస్తున్న ఆడ మగ జనాభా మంటపంలో కూర్చునివున్నారు. దేవిదర్శనం చేసుకోవటాని కి లోపలికెళుతున్నవాళ్ళు, బయటికొస్తున్నవా ళ్లు చాలామంది కనిపించారు.

ఆనంద్‌కి గుళ్లోకెళ్లాలనిపించలేదు. మంట పానికి ఓ వారగా చతికిలపడ్డాడు. చుట్టుప క్కల పరిసరాల్ని జాగ్రత్తగా గమనించసాగా డు. కావలావాళ్ల జాడెక్కడా కనిపించలేదు. వాళ్లెప్పుడొస్తారు? ఎలావుంటారు? రాత్రంతా తిరుగుతూనే ఉంటారా?- రకరకాల ప్రశ్నలతో బుర్ర వేడెక్కిపోతోంది.

పదిహేను నిమిషాలు గడిచేసరికి అతనికి వినుగుపుట్టింది. అంతూపొంతూ లేకుండా

తెల్లార్లూ భజనచేస్తారేమోనని భయపడ్డాడు. మెల్లగాలేచి దిక్కులు చూసుకుంటూ గుడిదగ్గరకెళ్ళి వెనక్కి తిరిగిచూశాడు. భజనచేస్తున్న వాళ్లెవరూ అతన్ని గమనిస్తున్నట్లు లేరు. అప్పుడేవచ్చిన జంట గుడిచుట్టూ ప్రదక్షిణలు మొదలుపెట్టింది. రెండుసార్లు వెళ్లిరానిచ్చి మూడోసారి వాళ్లకి కాస్తవెనగ్గా అతనుకూడా బయలుదేరాడు. తమవెనుక ఎవరోవస్తున్నారనే ధ్యాసలేకుండా మహాభగవతినామం జపిస్తూ వడివడిగా పోతున్నదా జంట.

గుడిచుట్టూ లైట్లున్నాయి. వెనుకభాగం చేరుకోగానే తనవెనుక మరెవరైనా వస్తున్నారేమోనని ఆగిచూశాడు ఆనంద్. ఎవరూలేరు. గుడి వెనుక తోటవైపు దృష్టిసారించాడు. లైట్లవెలుతురు పడుతున్నమేర ఎటువంటి మానవాకారాలు కనిపించలేదు. మంచి అదను. ఎవరైనా అడ్డువచ్చేలోపల తోటలోకి ప్రవేశించి దాక్కోవాలి. గుండె దడదడలాడింది. వెన్నుపూసనుంచి సన్నగా వణుకు ప్రారంభించింది. వెనకముందు లాడుతూ ఆలస్యంచేసి ప్రయోజనంలేదు. తాడోపేడో తేల్చుకోవాలి.

ధైర్యం కూడగట్టుకుని అడుగులసవ్వడి కానివ్వకుండా తోటవైపు నడిచాడు ఆనంద్. ఒకవేళ ఎవరైనా ఎదురొచ్చి ప్రశ్నిస్తే లఘుశంక తీర్చుకోవటానికి పోతున్నానని సమాధానం చెప్పాలనుకున్నాడు. కాస్తదూరం వెళ్ళి మళ్ళా వెనక్కి తిరిగిచూశాడు. ఎవరూలేరని నిర్ధారణ చేసుకుని మరింత ముందుకెళ్ళి చీకట్లో కలిసిపోయాడు. దట్టంగా పెరిగిన ఒక పొదమాటున కూర్చుని ఆకాశంవంక చూశాడు. అమావాస్య రోజులవటం వలన చీకట్లో బెలూన్ స్పష్టంగా కనిపించటంలేదు.

మరికొద్ది గంటలు ఓపికపడితే చాలు. స్వేచ్ఛావిహంగంలా ఆకాశంలో ఎగురుకుంటూ తన మాతృభూమి చేరుకోవచ్చు. ఎక్కడికి తీసుకుపోతుందోమరి. అసలు మళ్లీ దీన్ని కిందకి దించటం ఎలా? గ్యాస్ ఎక్కించటానికి, తీసెయ్యటానికి ఏదో ఏర్పాటు వుంటుంది. అదెక్కడుందో వెతికి తెలుసుకుంటే చాలు. తేలిగ్గా కిందకి దిగొచ్చు. ఎగిరిపోవటమే సమస్యగాని కిందకి దిగటంలో సమస్యేముంది. అంతగా కావాలనుకుంటే తనే ఓ చిన్న చిల్లిపెడితే చాలు.

కిందకి దిగగానే మొదట ఏంచెయ్యాలి? సంతోషంతో గంతులెయ్యాలి. పిచ్చిగా కేకలు పెట్టాలి. చుట్టూ జనముంటే తనో పిచ్చాడని హడలిచస్తారు. అసలు వీటన్నిటికంటే ముందు ఆకాశంలోకి వెళ్లగానే ఈ వెధవ సిగ తరిగి కిందకి విసిరెయ్యాలి. అది వెళ్లి ఏ బోడిముండ ముఖాన్నయినా పడితే బాగుండు. చండిక ముఖాన పడితే మరింత బాగుంటుంది.

తనలోతనే సరదాగా నవ్వుకున్నాడు. కాస్సేపు కూర్చునేసరికి నడుంనొప్పిపుట్టింది. ఆనుకోవటానికి ఏమైనా ఉంటే బాగుంటుందనిపించింది. కానీ ఏమీలేవు. అటూఇటూ కదిలినప్పుడల్లా శీలరక్షిణి వత్తుకుని ఇబ్బంది కలుగుతోంది. పోనీ కాస్సేపు పడుకుంటే బాగుండుననిపించింది. కానీ ఆ ఆలోచనని అమలు చెయ్యాలంటే భయమేసింది. బాగా నిద్రపట్టి తెల్లారేదాకా మెలకువ రాకపోతే! అమ్మో... అలా జరగటానికి వీల్లేదు. ఎన్ని కష్టాలైనా భరించాల్సిందే.

మంటపంలో భజన కొనసాగుతూనే ఉంది. ఆనంద్ ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి. తను తప్పించుకోగానే బయటి ప్రపంచంలో పెద్ద సంచలనం రేగుతుంది. ఇక్కడివాళ్ళు భయంతో హడలిచస్తుంటారు. ఏపేపర్లో చూసినా తన ఫొటోలే, తన వార్తలే హెడ్‌లైన్లలో ఉంటాయి. తను చెప్పే విషయాలు అద్భుతంగా ఉంటాయి. ముందెవరూ నమ్మరు. పిచ్చివాణ్ణనుకుంటారు. తను ధరించిన బట్టలు ఒకసాక్ష్యం. పెరిగిన గడ్డం, మీసాలు రెండవ సాక్ష్యం. బంగారు మొలతాడు మూడవది. అన్నిటికన్నా ముఖ్యం శీలరక్షిణి. కాని దాన్నెలా చూపించాలి? అందరూ ఎగతాళి చెయ్యరూ! పోతే బెలూన్ ఉండనే ఉంది. తరవాతేమవుతుంది? ప్రమదావని ఎక్కడుందో చూపించాలి. అది కష్టమేంకాదు. అనంతగిరి చుట్టుపక్కల లోయలన్నిటినీ క్షుణ్ణంగా వెతికిస్తేసరి. ప్రమదావని కనిపించింతరువాత పరిస్థితులు ఎలా ఉంటాయి. ప్రభుత్వం ఎలాంటి



చర్యలు తీసుకొంటుంది?

భజన పూర్తయి మంగళహారతులు వినబడసాగాయి. ఆలోచనలు కట్టిపెట్టి శ్రద్ధగా వినసాగాడు ఆనంద్. మరో ఐదునిమిషాలు గడిచేసరికి అవికూడా పూర్తయ్యాయి. ఇళ్ళకి తరలి వెళ్ళే జనం పెద్దపెద్దగా మాట్లాడుకుంటూ బయటికి పోతున్నారు. మోకాళ్ళమీద నిలబడి అందరూ వెళ్ళేదాకా చూశాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. గుడిగేటు తలుపులు తెరిచే ఉన్నాయి. కాపలావాళ్ళ జాడలేదు. అసలు వాళ్ళొస్తారోరారో అర్థంకాలేదు. లేచివెళ్ళి చూడాలనిపించింది. మళ్ళీధైర్యం చెయ్యలేకపొయ్యాడు. ఓపిగ్గా అట్లాగే నిలబడి చూడసాగాడు.

దాదాపు పదిహేను నిమిషాల తరువాత దూరంగా ఎవరివో మాటలు వినిపించాయి. నిశ్శబ్దంగాలేచి నిలబడి మాటలు వినబడుతున్న వైపుచూశాడు ఆనంద్. చిన్నగా మాట్లాడుకుంటూ గేటువైపు నడుస్తున్న స్త్రీలిద్దరు కనిపించారు. వాళ్ళవేషం,చూస్తే కాపలావాళ్ళేనని ఇట్టే తెలిసిపోయింది. ఇద్దరి చేతుల్లోనూ తుపాకులున్నాయి. మెల్లగా నడుచుకుంటూ వెళ్ళిగేటు తలుపులు దగ్గరికి లాగి తాళం వేశారు. కాస్సేపు అక్కడే నిలబడి రోడ్డువంక చూస్తూ మాట్లాడుకున్నారు. నాలుగైదు నిమిషాల తరువాత వెనక్కి తిరిగి గుడివైపు నడవసాగారు. ఆ తరువాత మళ్ళీ వాళ్ళ అలికిడి వినబడలేదు.

అరగంటసేపు ఓపిగ్గా కదలకుండా కూర్చున్నాడు ఆనంద్. ఎంతసేపున్నా ఎక్కడా ఏ శబ్దమూ వినబడలేదు. గట్టిగా గాలివీచినప్పుడల్లా ఆకులగలగలలు, అప్పుడప్పుడు రోడ్డుమీద పోతున్న వాహనాల రొదలు, నిద్రమెలకువ వచ్చినప్పుడల్లా గొంతు సవరించుకునే పిట్టల అరుపులు వింటూ కాలం వెళ్ళబుచ్చసాగాడు ఆనంద్. మరో అరగంట గడిచింది. కాపలావాళ్ళ ఆచూకీలేదు. అతనిలో ఓపిక నశించింది. కాళ్ళు విదిలించుకున్నాడు. లైట్ల వెలుతురు మీదపడకుండా జాగ్రత్తపడుతూ నక్కినక్కి గుడివైపు దారితీశాడు. గుడికి అతిదగ్గరగా ఉన్న ఒకచెట్టు చాటున దాక్కుని తొంగి చూశాడు. కాపలా మనుషులిద్దరూ ముసుగుదన్ని గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. తుపాకులు వాళ్ళ తలలకింద ఉన్నాయి. తెల్లవారేవరకూ వాళ్ళు నిద్రలేచే ప్రశ్నే ఉండదని నిశ్చయించుకున్నాడు ఆనంద్. బహుశా అంతకు ముందెప్పుడూ ఆ ఆలయంలో దొంగతనాలేవీ జరిగుండవు. అందుకనే వాళ్ళంత నిర్భయంగా, నిశ్చింతగా నిద్రపోగలుగుతున్నారు.

అన్నీ తనమంచికే, తనకనుకూలంగానే జరుగుతున్నాయని లోలోపలే సంబరపడ్డాడు ఆనంద్. ధైర్యంచేసి మెల్లగా లైటు వెలుతుర్లో

కి వెళ్ళిటైమ్ చూశాడు. పదకొండు గంటలవుతోంది. మరో గంటఆగితే మంచిదనిపించింది. రెండో ఆట సినిమాకూడా వదిల్తే ఏ ఇబ్బందీ ఉండదు. అందరూ ఎవరిళ్ళలో వాళ్ళు హాయిగా నిద్రపోతారు. తను స్వేచ్ఛగా తప్పించుకుంటాడు. పాపం కొద్ది కాలంలో ప్రమదావని మొత్తం పురుషుల ఆధీనంలోకి వస్తుందని కలలో కూడా వీళ్ళూహించలేరు.

బెలూన్ కట్టి ఉన్నవైపు బయలుదేరాడు ఆనంద్. అతనిలో మరేరకమైన అనుమానాలూలేవు. తప్పించుకోవటం ఖాయం! ఎవ్వరూ ఆపలేరు! ఒక్కగంట! మరొక్క గంటాగితే తను స్వేచ్ఛాజీవి! నిజంగా స్వేచ్ఛ ఎంతో గొప్పది! దానికోసం ఏమైనా చెయ్యొచ్చనుకున్నాడు.

బెలూన్‌కి కట్టివున్న ప్లాస్టిక్ తాడుని పట్టుకుని కొంచెం కిందకి లాగాడు. బరువుగా అనిపించింది. తొందరపడకు దిగివద్దువుగా నిలే అనుకుంటూ మళ్ళీ వదిలేశాడు. అక్కడే నేలమీద వెల్లకిలా పడుకుని ఆకాశం వంకచూస్తూ నిమిషాలు లెక్కపెట్టుకోసాగాడు.

పన్నెండయింది. మరో అరగంట ఆగాడు. ఇహ చాలనిపించింది. కాపలావాళ్ళొస్తారేమోననే ఆలోచనను మనసునుంచి పూర్తిగా దూరంచేశాడు. తాడు పట్టుకుని బెలూన్ని కిందకి లాగటం ప్రారంభించాడు. కాస్సేపటికి బెలూన్ వచ్చి నేలను తాకింది. అతనూహించిన దానికన్నా పెద్దదిగానే ఉంది. తనుకాక మరింకొకరెక్కినా తేలిగ్గా మొయ్యగలదనుకున్నాడు. దాన్ని నేలమీదుంచటానికి ముప్పుతిప్పలు పడవలసి వస్తోంది. ఆలస్యం చెయ్యకుండా సంతోషంతో ఎగసిపడుతున్న గుండెను అదుపులో పెట్టుకుంటూ బెలూన్ అడుగున కట్టబడి ఉన్న బుట్టలోకి దూకి కూర్చున్నాడు ఆనంద్. ఒక్కక్షణం ఆగి గాలికి అటూఇటూ ఊగుతూ పైకి లేచిందా బెలూన్.

బెలూన్‌కీ బుట్టకీ మధ్య ఉన్నచోటు చాలా తక్కువగా ఉంది. ఆనంద్ కూర్చుంటే అతని తలకి జానెడెత్తున బెలూన్ ఉంది. లేచి నిలబడటానికి వీల్లేదు. నిలబడాల్సిన అవసరం అతనికిలేదు. గాలిలో అట్లా నెమ్మదినెమ్మదిగా పైపైకి తేలిపోతుంటే శరీరమంతా తేలికైపోయినట్లు ఏదో తెలియని వింత అనుభూతికి లోనయ్యాడు ఆనంద్.

కొద్దిసేపటికి బెలూన్ ఆగిపోయింది. దానికి కట్టి ఉన్న తాడుని కిందఉన్నప్పుడే కోసెయ్యలేదు ఆనంద్. అట్లా చేస్తే కింద తాడంతా ఒకేచోట కుప్పలా పడి ఉంటుంది. చూసేవాళ్ళకి దాన్నెవరో కిందకి లాగారనే అనుమానం వస్తుంది. అటువంటి అనుమానం కల్పించదల్చుకోలేదతను. బెలూన్ దానంతటదే తెగి ఎటో పోయిందనుకోవాలి. పెళ్ళినుంచి చండిక తిరిగి వచ్చేదాకా తాను తప్పించుకున్న విషయం ఎవ్వరికీ తెలియకూడదు. వెంటనే తెలిస్తే తనిల్లు చేరేలోపలే తనకోసం బయటి ప్రపంచంలో కూడా వాళ్ళువేట మొదలుపెట్టొచ్చు. ఆ ఛాన్సు కూడా అతను వాళ్ళ కివ్వదలచుకోలేదు.

బెలూన్ ఆగిపోగానే హ్యాండ్ బ్యాగ్ తెరిచి కత్తి బయటికి తీసి పరపరా తాడుకోసేశాడు. ఒక్కఉదుటున మళ్ళీపైకి దూసుకుపోసాగింది బెలూన్. గాలికి బెలూన్ అటూఇటూ ఊగుతుంటే బుట్ట అంచులు పట్టుకుని కూర్చున్నాడు. ఆనంద్. పైకి వెళ్ళేకొద్దీ కుదుపులు తగ్గుతున్నాయి. పంతంతో పర్వతాల్నిదాటి పోవాలన్నట్లు బెలూన్ ఇంకాపైకి వెళుతున్న కొద్దీ ఆనంద్‌లో ఉత్సాహం, ఉద్రేకం మరింత పెరగసాగాయి.

వెధవముండల్లారా! ముసుగుతన్ని నిద్రపోతున్నారా? ఇదిగో నేతప్పించుకుపోతున్నాను. దమ్ముంటే పట్టుకోండి చూద్దాం! ఆడముండలు... మీవల్లవుతుందా?

ఎవరికీ కనబడకుండా ఇట్లా నక్కి కూర్చోవటంకాదు. మా ప్రపంచంలోకి రండి తెలుస్తుంది. ఈ భూగోళమంతా మా గుప్పెట్లోవుంది. తెల్లారి లేచేసరికి మీరంతా బూడిదై పోతారు'' అంటూ పెద్దగా కేకలుపెట్టసాగాడు.

మరొక్క పదినిముషాలాగితే అతను పర్వతాలను దాదాపు దాటతాడు.

''ఒసే చండికా! ఇదుగో నాజుట్టు. నీముఖానేసి కొట్టుకో'' అంటూ వళ్లు తెలియని ఉద్రేకంతో అరుస్తూ, పెద్దగా నవ్వుతూ తన ముడిని కత్తితో కోసెయ్యబోయాడు.

హఠాత్తుగా గాలి వేగంగావీచి బెలూన్

అటూ ఇటూ ఊగింది. బాలెన్స్ తప్పి పక్కకు ఒరిగిన ఆనంద్ ఏం జరుగుతుందో, జరగబోతోందో తెలియక అనాలోచితంగా చెయ్యి పైకెత్తాడు. వాడిగావున్న కత్తిమొన బెలూన్‌లోకి దిగబడింది. సన్నగా చప్పుడుచేసుకుంటూ బెలూన్‌లోని వాయువు బైటికి రాసాగింది.

జరిగిందేమిటో అర్థమయ్యేలోపలే పైకిపోవాల్సిన బెలూన్ కాస్సేపు అలాగే ఆగి నెమ్మదిగా కిందికి దిగటం మొదలుపెట్టింది.

"నో నో... వద్దు. కిందకొద్దు. పైకి తీసుకుపో... ప్లీజ్ ప్లీజ్!" అంటూ పిచ్చిగా కేకలుపెట్టాడు ఆనంద్.

పడిన చిల్లికి చెయ్యడ్డంపెట్టటానికి ప్రయత్నించాడు. లాభం లేకపోయింది. వాయువు తగ్గేకొద్దీ మరింత వేగంగా కిందికి పడసాగిందా బెలూన్. నిశ్చేష్టుడై భయంతో గజగజవణుకుతూ ఎక్కడ పడతానోనని గుడ్లప్పగించి కిందకి చూడసాగాడు. వేగంగా పడిపోతున్న బెలూన్ అదృష్టవశాత్తు ఓ చెట్టుని ఢీకొని కొమ్మల్లో చిక్కుకుపోయింది. అక్కడక్కడా చేతులూ, కాళ్లూ గీరుకుపోవటం మినహా ఆనంద్‌కి దెబ్బలేం తగల్లేదు. బతుకుజీవుడా అనుకుంటూ చెట్టుదిగి కిందకొచ్చాడు. చుట్టూ చిమ్మచీకటి. తనెక్కడున్నాడో ఏమిటో అర్థం కాలేదు. అట్లాగే నిస్సహాయంగా కూలబడి, ఊహతెలిసింతరువాత జీవితంలో మొట్టమొదటిసారిగా హృదయవిదారకంగా వెక్కివెక్కి ఏడ్చాడు ఆనంద్.

ఒక గంట గడిచాక అతని మనస్సు కాస్త కుదుటపడింది. జరిగిందేదో జరిగింది. ఇంక జరగాల్సిందేమిటని ఆలోచించాడు. ఇంటికి తిరిగి వెళ్లాలా? వద్దా? తన రహస్యం బయటికి పొక్కుతుందా? మళ్లీ ఈ బానిస బతుకు బతికే కంటే ఇక్కడే పొడుచుకుచస్తే పీడావదుల్తుంది. కానీ చావకూడదు. ఉద్రేకంలో తను చేసిన చిన్నపొరపాటు మూలంగా చేతచిక్కిందనుకున్న స్వర్గం చేజారింది. మళ్లీ ప్రయత్నిస్తే ఈసారన్నా తప్పించుకోవచ్చు. ముందు తెల్లారకుండానే ఇల్లు చేరాలి.

చెట్టు పైకెక్కి తంటాలుపడి ఎట్లాగో బెలూన్ కిందికి తెచ్చాడు ఆనంద్. బుట్టని విరక్కొట్టి చిన్న చిన్న తుంపలుచేసి అటూ ఇటూ చెల్లాచెదురుగా విసిరేశాడు. బెలూన్ రబ్బరుగుడ్డని కూడా నాలుగు భాగాలుగా కోసి దార్లో తను కదిలించగల పెద్దపెద్ద రాళ్లెదురైనప్పుడల్లా వాటికింద ఆ ముక్కల్నిపెట్టి బెలూన్ జాడతెలియకుండా చేశాడు. అదంతా అడవి ప్రాంతంలావుంది. ఎవరికీ అనుమానం వచ్చే ఆస్కారంలేదు. ఎటువెళ్లాలో తెలియకపోయినా మెల్లగా నడకసాగించాడు. అదృష్టవశాత్తు దారిలో అతనికెవరూ తగల్లేదు. ఇల్లు చేరేసరికి తెల్లవారుఝామయింది. తలుపులు తీసి గబగబా వాకిలి చిమ్మి, కళ్లాపిచల్లి, ముగ్గేసి లోపలికెళ్లి పడుకున్నాడు. వెంటనే నిద్రపట్టింది.




**మ**ర్నాడు వుదయం పదిగంటలకి చండిక పెళ్లినుండి తిరిగొచ్చింది. "బాగా జరిగిందా పెళ్లి" అంటూ తనకు జరిగిన పెళ్లిని దాచిపెట్టటానికి చిరునవ్వుతో, హుషారుగా పలకరించాడు ఆనంద్.

"ఓ... బ్రహ్మాండంగా జరిగింది. శౌర్య చెప్పినప్పుడు నమ్మలేదుగాని పెళ్లికొడుకు నిజంగా పట్టుకుంటే కందిపోయేంత సుకుమారంగా వున్నాడు. అంతటి అందగాడికోసం ప్రాణాలైనా త్యాగం చెయ్యొచ్చు" అంది చండిక కుర్చీలో కూలబడుతూ.

"ప్రయాణంచేసి బాగా అలసిపోయినట్లున్నారు. కాఫీపెట్టుకురానా?"

"అరగంట ప్రయాణానికే అలసిపోతానా? కాఫీవద్దులే. వచ్చేటప్పుడు బాగానే పట్టించివచ్చా. త్వరగా వంట పూర్తిచేసెయ్. అర్జంటుగా వెళ్లాలి. అంతలో నేను స్నానంచేసి తయారవుతాను" అంటూ లేచింది చండిక.

"ఏమండీ... " ఏదో అడగాలని సందే హిస్తూ నిలబడ్డాడు ఆనంద్.

"ఏంటి? మళ్లీ ఈరెండురోజుల్లో కొత్త సందే హాలేమైనా వచ్చాయా?"

"ఉఁహూ! మరి ... తాళంచెవి" సిగ్గుని, అవమానాన్ని దాచుకోవటానికి శతవిధాల ప్ర యత్నిస్తూ తలవంచుకు అడిగాడు.

"అదా! మర్చేపొయ్యాను. పాపం ఈ రెండ్రో జులూ బాగా ఇబ్బంది పడ్డావా? ఇబ్బందిపడ్డా అది మన మంచికేగా. ఇప్పుడు నీగురించి నాకే అనుమానాలూలేవు. ఇది లేకపోతే వచ్చిందగ్గర్నుంచీ లక్ష సందేహాలు కలుగు తాయి. అనుమానం మొదలైతే ఇహ కలత లతో, కలహాలతో మన సంసారం పాడవు తుంది. కనీసం ఇంట్లో పెద్దవాళ్ల తోడన్నా వుంటే నీకీబాధ తప్పేది" అంటూ తాళంచెవి ఇచ్చి స్నానానికెళ్లింది చండిక.

శీలరక్షిణి చెరవిడిపించుకుని వంటపని మొదలెట్టాడు ఆనంద్. స్నానంచేసివచ్చి వంటగదిలోనే కూర్చుని హుషారుగా పెళ్లి కబు ర్లు చెప్పసాగింది చండిక.

"అబ్బా! ఆ పెళ్లికొడుకు ఎన్ని తమాషాలు చేశాడో! తల్చుకుంటే ఇప్పుడు కూడా నవ్వొ స్తోంది. ఒక పక్క సిగ్గు, మరోపక్క శౌర్యతో పోటీపడాలనే ఆరాటం. మొలతాడు కట్టించు కునేటప్పుడు శౌర్య వేళ్లు తగిలి చక్కిలిగింత పుట్టిందో ఏమో వంపులు తిరిగి డాన్స్ చే సినంత పనిచేశాడు. తలంబ్రాలుపోసే హడా వుడిలో పళ్లెం ఎత్తి శౌర్యనెత్తిన పొయ్యాల్సింది తన నెత్తినే పోసుకున్నాడు. గడ్డానికి నాలుగైదు మల్లెరేకులు చిక్కుకుని చీకట్లో వెలిగే చుక్కల్లా కనిపిస్తుంటే వచ్చినవాళ్లంతా నవ్వలేక చచ్చా రనుకో! పాపం వాళ్ల మామగారు చేయించిన ఉంగరం బిర్రయిందో ఏమో శౌర్య ఉంగరం తొడగబోతుంటే నాలుగైదుసార్లు చెయ్యి వెనక్కి లాక్కుని చివరికి బడిలో చిన్నపిల్లలు చూ పించినట్లు చిటికిన వేలు చూపించాడు. శౌర్య కూడా నవ్వాపుకోలేకపోయింది. మొత్తానికి భలే సరదామనిషిలా ఉన్నాడు. నువ్వూ ఉన్నావ్! ఏం లాభం? ఎప్పుడూ సందేహాలు, అలకలు తప్ప సరదాగా ఉందామనుకోవు" అంటూ కాస్త నిష్ఠూరమాడింది చండిక.

"మీ పద్ధతులు, అలవాట్లు తెలియని వాణ్ణి. నా మానాన నన్నుండనివ్వక ఇక్కడ కట్టిపడేసి సరదాగా ఉండమంటే ఎట్లా?" అన్నాడు ఆనంద్ కాస్త చిన్నబుచ్చుకుంటూ.

"ఉడుక్కోకు. నీలో ఏ ప్రత్యేకతా లేకపోతే ఇన్ని కష్టాలుపడి నిన్నెందుకు తెచ్చుకునేదా న్ని. నీలాంటి వాళ్ళు నాకిక్కడెవరూ కనబ డలా"

"ఏమిటో ఆ ప్రత్యేకత?"

"నీ అందమే! సుకుమార్ నాజూగ్గా ఉన్నా డనే కాని అందంలో నీతో పోటీపడలేడు. నువ్వూ కాస్త గతాన్ని మర్చిపోయి ఆనందంగా ఉంటే ప్రమదావనిలో నాకన్నా అదృష్టవంతులుండ రు"

"మీరు మరీను! నా అందమేంటో నాకు తెలుసుగాని పొగడ్తలు ఆపండి. ఇంతకీ శౌర్య గారు సుకుమార్ని చేసుకోవటం వారి పెద్ద లకు ఇష్టంలేదన్నారుగా. మరి వాళ్ళు పెళ్ళికొ చ్చారా?"

"వచ్చారు. కానీ వచ్చిందగ్గరనుంచి రుస రుసలాడుతూ ప్రతి చిన్న లోపానికి నిందలు మోపటంతోనే వాళ్ళకి సరిపోయింది. వాళ్లని మెప్పించి సంసారం ఈదుకురావాలంటే పాపం సుకుమార్కి కష్టమే!"

"వాళ్ళతో సుకుమార్ కేం పని? శౌర్యగారు ఉద్యోగం చేస్తున్నది వేరే ఊళ్ళో కదా! అక్కడే కాపురం పెట్టరూ?"

"మొదట్లో అంతే అనుకున్నాం. కానీ కా పురం పెడితే శౌర్య సంపాదన ఇంటద్దెకీ, తిండి తిప్పలకే సరిపోతుందని అసలా ఉద్యో గమే మానెయ్యమన్నారు"

"ఉద్యోగం మానేస్తే ఎట్లా? మరింకేం చేస్తా రు?"

"వాళ్ళ స్వంత ఊర్లోనే ఏదో ఒక ఉద్యోగం చూపిస్తానన్నారు శౌర్య అమ్మగారు. అక్కడైతే స్వంత ఇల్లు, పాడి ఉంది. పెద్దగా ఖర్చు లుండవు. పెళ్ళయి ఆ మగపిల్లలిద్దరూ వెళ్ళి పోతే ఇహ వీళ్ళెట్లా ఖర్చు పెట్టుకున్నా అడిగే వాళ్ళుండరు"

"మరి శౌర్యగారి తల్లిదండ్రులు అల్లుణ్ని

ఇబ్బంది పెట్టకుండా ఆదరించగలరా?"

"ఎందుకాదరించరు? కట్నం పెద్దగా తేలేదని వాళ్లకి కాస్త కష్టంగా ఉంది. నాలుగు రోజులు గడిస్తే అన్నీ మర్చిపోతారు. చిన్నప్పటి నుంచీ నాకు వాళ్ళు బాగా తెలుసు. చాలా మంచివాళ్ళు"

"ఏమిటో ఇవన్నీ వింటుంటే నా మతిపోతోంది. మగాడి బతుకు అత్తమామల దయ మీద ఆధారపడాలా. ఎంత ఘోరం! అయినా నాకెందుగ్గాని వంటయింది వడ్డించమంటారా?"

"నాదేం ఆలస్యంలేదు. నువ్వు కూడా వడ్డించుకో ఒక్కసారే పని తీరిపోతుంది"

"వద్దులెండి. నేను తరువాత భోంచేస్తా"

"అదుగో... అందుకే నాక్కోపమొచ్చేది. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ కలిసి భోం చేద్దామంటే వినవేం. ఇద్దరికీ వడ్డించు" అంటూ లేచింది చండిక.

మారుమాట్లాడకుండా వడ్డించి తనుకూడా చండిక పక్కనే కూర్చుని తినసాగాడు ఆనంద్.

"నువ్విక నీ గతాన్ని మర్చిపోవాలి. చక్కగా జీవితాన్ని అనుభవించాలిగాని గతాన్ని తల్చుకుని దిగులుపడితే ఏంలాభం? నువ్వు నావాడివి. అన్ని రకాలుగా నిన్ను సంతోషపెట్టటం నా కర్తవ్యం. చెప్పు నీకేం కావాలో" లాలనగా అడిగింది చండిక.

"నాకేమీ అక్కర్లేదు" అన్నాడు ఆనంద్ ఇబ్బందిగా.

"చక్కటి నెక్లెస్ చేయించమంటావా?"

"ఊహుం! వద్దు. నేనవి భరించలేను" ఛీదరించుకుంటున్నట్లు అన్నాడు.

"పోనీ నీకేమిష్టమో చెప్పు... తెస్తాను"

"ఇప్పుడు నాకేం తక్కువని? ఏమి వద్దులెండి" ఇదెక్కడి గోలరా దేవుడా అనుకుంటూ గబగబా ముద్దలు మింగసాగాడు ఆనంద్.

"అరె... అదేం తింటం! మగాళ్ళు కాస్త నిదానంగా, అందంగా తినాలి. ఇంకెవరి ముందన్నా అట్లా తిన్నావంటే నా పరువు పోతుంది. ఇన్నాళ్ళూ నీతో కలిసి భోంచెయ్యక పోవటం పొరపాటయింది" అంటూ నొచ్చుకుంది చండిక.

"కనీసం ఇష్టమొచ్చినట్లు తినే స్వేచ్ఛ కూడా లేదా?" విసుక్కున్నాడు ఆనంద్.

"ఇందులో స్వేచ్ఛ సమస్యేముంది. మగాడు అణకువగా ఉండాలి. ఏ పని చేసినా అందంగా చెయ్యాలి. సర్లే... ఇప్పుడు ఉపన్యాసాలొద్దు. సాయంత్రం మంచి సినిమాకెళదాం రడీగా ఉండు!"

"అబ్బ ఆ వెధవ సినిమాలు నేను చూడలేను"

"పోనీ సరదాగా అలా పార్కు కెళ్ళొద్దాం" అంటూ తినటం ముగించి చెయ్యి కడుక్కుంది చండిక.

ఎదురు చెప్పలేక సరేనన్నట్లు తల ఊపుతూ తనుకూడా లేచాడు ఆనంద్.

ఆ సాయంత్రం ఇద్దరూ కలిసి పార్కుకి బయల్దేరారు. పార్కు దగ్గరలోనే ఉండటంవల్ల నడిచి వెళదామన్నది చండిక. ఆనంద్ అభ్యంతరం చెప్పలేదు. బజార్లన్నీ సందడిగా ఉన్నాయి. ఏవేవో కబుర్లు చెబుతూ అప్పుడప్పుడు ఆనంద్ భుజం మీదనో, నడుం మీదనో చెయ్యి వెయ్యసాగింది చండిక. ఆనంద్‌కి ఒక వంక సిగ్గు, మరోవంక చిరాకు కలిగాయి. ఆమె చెప్పేమాటలకి ఊం కొడుతూ తల వంచుకుని నడవసాగాడు. ఒకటి రెండు చోట్ల రోడ్డు దాటవలసి వచ్చినప్పుడు అతని చెయ్యి పట్టుకుని అవతలి పక్కకి దాటించబోయింది చండిక.

"నేనేం చిన్నపిల్లాణ్ణి కాదు. రోడ్డు దాటగలను" అంటూ విసుక్కున్నాడు ఆనంద్.

"నాభయంనాది! నీకేమైనా జరిగితే భరించగలనా?" అంటూ చెయ్యి మరింత గట్టిగా పట్టుకుని అవతలికి లాక్కెళ్ళింది చండిక.

ఆనంద్ పార్కు మీదగా చాలాసార్లు బజారు కెళ్ళినా లోపలికెప్పుడూ ప్రవేశించలేదు. అతనూహించిన దానికన్నా చాలా పెద్దదిగా, అందంగా ఉందా పార్కు. అప్పుడప్పుడే అలముకుంటున్న చీకటిని పారదోలుతూ రంగురంగుల విద్యుద్దీపాలు కనుల విందుగా వెలుగుతున్నాయి. ఎటు చూసినా పచ్చని లాన్లు,



అందంగా కత్తిరించిబడ్డ రకరకాల మొక్కలు, పెద్దపెద్ద చెట్లు ఆకర్షణీయంగా ఉన్నాయి. ఒంటరిగా వచ్చిన మగాళ్ళెవరూ లేరు. ఇద్దరు ముగ్గురుగా కలసి వచ్చిన వాళ్ళు అక్కడక్కడ, సిమెంటు బెంచీల మీద కూర్చుని ముచ్చట్లాడుకుంటున్నారు. కాలక్షేపం కోసం స్నేహితుల్తో కలిసి వచ్చిన స్త్రీలు పనున్నా లేకపోయినా ఫోజులు కొడుతూ ఆ పురుషుల ముందు అటూఇటూ పచార్లు చేస్తున్నారు. పెద్దలతో ప్రమేయం లేని పిల్లలు ఆటపాటల్లో, తిను బండారాలు కొనుక్కోవటంలో మునిగిపోయారు. పార్కంతాకోలాహలంగా ఉంది.

చుట్టూ అంతమంది స్త్రీలు తనని గుచ్చిగుచ్చి కొరుక్కుతినేసేలా చూస్తుంటే చాలా సిగ్గుగా, ఇబ్బందిగా ఫీలయ్యాడు ఆనంద్. అతని నడుం చుట్టూ చెయ్యి వేసి తనకి మరింత దగ్గరగా లాక్కుంది చండిక.

"అబ్బ ఊరుకోండి. అందరూ మనవంకే చూస్తున్నారు" అన్నాడు ఆనంద్ సిగ్గుపడుతూ.

"చూడనివ్వు. మనమేమన్నా తప్పుడు పని చేస్తున్నామా సిగ్గుపడటానికి, భయపడటానికి. అదుగో, ఆలైట్ స్థంభం కింద చూడు.. ఆవిడ ఎంచక్కా అతని ఒళ్ళో తలపెట్టి పడుకుంది. వాళ్ళు సిగ్గుపడుతున్నారా?" అంటూ ఓ జంటని చూపించింది చండిక.

వాళ్ళవంక చూశాడు ఆనంద్. పడుకుని ఉన్న స్త్రీముఖంలో ఎటువంటి సిగ్గు, బిడియాలు లేవు. కానీ ఆ పురుషుడి పరిస్థితి మాత్రం వేరుగా ఉన్నట్లనిపించింది. అతను తనవళ్ళో పడుకున్న స్త్రీ వంకే చూస్తూ ఆమె మాటలకు తలఊపుతూ ఊఁ కొడుతున్నాడు. అప్పుడప్పుడూ చిన్నగా నవ్వుతున్నాడు. అతని చూపులో, నవ్వులో, ప్రతి కదలికలో అతనికి తెలియకుండానే నరనరాల జీర్ణించుకుపోయిన సిగ్గు, బేలతనం కనబడుతున్నాయి. అది కేవలం అతనికి మాత్రమే పరిమితమైంది కాదు. ప్రమదావనిలో ప్రతి పురుషుడూ దాదాపు అంతే!

'ఇంత చేతకానితనం వీళ్ళకెట్లా వచ్చింది? ఏంచేస్తే ఇదిపోతుంది? బాగా తిండి తినమంటే వళ్ళొస్తుందని భయపడతారు. కష్టపడి కండలు కరిగించాల్సిన పనిలేదు. వ్యాయామం చెయ్యటం మాట దేవుడెరుగు కనీసం ఇంట్లో గబగబ నడవటం కూడా తప్పే. ఆటలేమో చెమ్మచెక్క, పచ్చీసు తప్ప ఇంకేమీ రావు. ఎంత నాజూగ్గా ఉంటే అంత గొప్పనుకుంటారు. ఇహ వీళ్ళకి శరీర దారుఢ్యం ఎట్లా వస్తుంది? చదువుకోవటమంటే అదేదో పెద్ద అపరాధం చెయ్యమన్నట్లు భయపడే వీళ్ళు మానసికంగా ఎప్పటికి ఎదగ్గలుగుతారు?

అయినా వీళ్ళెట్లా చస్తే నాకేం! వాళ్ళకు

వట్టిన గతి నాకు పట్టకూడదు' అనుకుంటూ చండికవెంట పార్కంతా తిరిగి చూశాడు.

"ఎట్లా వుంది పార్కు" అని అడుగుతూ ఒక సిమెంటు బెంచీమీద కూర్చుంది చండిక.

"బాగానే వుంది" అంటూ ఆనంద్ కూడా చండిక పక్కన కూర్చున్నాడు. వాళ్ళు కూర్చున్న బెంచి ముందుగా ముగ్గురు యువకులు నడిచి వెళుతున్నారు. ముగ్గురూ దాదాపు పద్దెనిమిది నుంచీ ఇరవై ఏళ్ళలోపు వాళ్ళే. ఎర్రగా, సన్నగా, చేసుకున్న అలంకరణలో మరింత అందంగా కనబడుతున్నారు. వాళ్ళకి కొంచెం వెనగ్గా ఇద్దరు యువతులు ఏవో జోక్సు వేస్తూ వెంబడిస్తున్నారు.

"మీ నడకలు చూస్తే మనసోతుంది, కులుకులు చూస్తే మతిపోతుంది" అంటూ కూనిరాగం అందుకున్న ఒక యువతి చండికని చూసి గొంతు తగ్గించింది.

అంతలో వాళ్ళకి కొంచెం దూరంలో హఠాత్తుగా "దొంగ! దొంగ! పట్టుకోండి" అంటూ పెద్దగా అరుపులు వినపడ్డాయి. బాగా ఎత్తుగా, లావుగా ఉన్న ఒక స్త్రీ వాళ్ళవైపు వేగంగా పరిగెత్తుకురావటం కనిపించింది. ముందునడుస్తున్న ముగ్గురు యువకులూ కెవ్వున కేకపెట్టి ఒకళ్ళనొకళ్ళు వాటేసుకున్నారు.

వాళ్ళవెనుక వస్తున్న యువతులు జరుగుతున్నదేమిటో గ్రహించి ఎదురుగా పరిగెత్తుకు వస్తున్న స్త్రీని పట్టుకోవడానికి ముందుకురికారు. కాని ఆదొంగ వాళ్ళని విదిలించి కొట్టి ముందుకు పరుగెట్టింది. రెప్పపాటులో జరిగిన ఆసంఘటనని అప్పటివరకూ చూస్తూ కూర్చున్న చండిక ఒక్క ఉదుటున లేచి ఆదొంగ వెంట పరుగెత్తింది. కిందపడ్డ యువతులిద్దరూ లేచి మళ్ళీ పరుగుపెట్టారు.

వాళ్ళు కనుమరుగయిం తరువాత ఆనంద్ బొమ్మల్లా నిలబడ్డ ఆయువకుల దగ్గరకెళ్ళాడు. భయంతో వాళ్ళ శరీరాలు కంపించటం అతనికి స్పష్టంగా కనిపించింది.

"ఎందుకలా పిరికివెధవల్లా వణుకుతున్నారు?" అన్నాడు వాళ్ళని అసహ్యంగా చూస్తూ.

వాళ్ళు ముగ్గురూ ఆనంద్ని అసలు గమనించలేదు.

"అమ్మో... ఇవ్వాళ లేచినవేళ మంచిదయింది" అన్నాడొకడు వణుకు తగ్గించుకోకుండానే.

"పార్కులకి, సినిమాలకి వెళ్ళేటప్పుడు బంగారపు గొలుసులు వేసుకెళ్ళొద్దని మానాన్న చెబుతూనే ఉన్నాడు. ఇంకానయం ఆదొంగది పోతూపోతూ నాగొలుసు లాక్కుపోలా" అన్నాడు మరొకడు మెడచుట్టూ ఉన్న చాంతాడంత గొలుసు తడుముకుంటూ.

వాళ్ళతో మాట్లాడటం దండగనిపించి తిరిగి వెనక్కొచ్చి బెంచీమీద కూర్చున్నాడు ఆనంద్. ఐదు నిమిషాల తరువాత ఆయాసపడుతూ తిరిగి వచ్చింది చండిక.

"దొరకలా! కొద్దిలో తప్పించుకుంది. ఇక్కడ నువ్వొక్కడివే ఉన్నావని దాన్నొదిలి పెట్టాను కాని లేకపోతే ఎంతదూరమైనా వెంటబడి పట్టుకునేదాన్ని" అంది రొప్పుతూ.

"ఎం కాజేసిందట?"

"ఎవరో ఒకాయనది బంగారు మొలతాడు తెంపుకుపోయిందట. ఛీ ఛీ! ఉన్నకొద్దీ ప్రమదావనిలో దుష్ట స్త్రీలెక్కువౌతున్నారు. నిర్భయంగా మగాళ్ళు బయటికి రావాలంటే వీల్లేకపోతోంది" అంది చండిక కోపంగా.

"భయం లేకుండా ముందు ఇంట్లో తిరగ్గలిగితే తరువాత బయటకూడా తిరగ్గలుగుతారు" అన్నాడు ఆనంద్ కసిగా.

అతని మాటల్ని చండిక పట్టించుకోలేదు.

"ఎన్నడూలేంది మహాభగవతి పుష్పకవిమానం హఠాత్తుగా మొన్న మాయమైందట. ఎవరో దుష్ట స్త్రీలే దాన్ని కాజేసి ఉంటారు. ఇహనుంచీ నైవేద్యాల పండగనాడు తప్పితే ముందుగా పుష్పకాన్ని ఎగరేయకూడదని నిర్ణయించారు" అంటూ చెప్పుకుపోసాగింది.

ఉలిక్కిపడినవాడిలా లేచినుంచుని "అబ్బ... ఆకలేస్తోంది. ఇహపోదాం" అన్నాడు ఆనంద్ చండిక వంక చూడకుండా.

చండిక కూడా లేచి నిలబడి టైమ్ చూసుకుంది.

"అబ్బో ఎనిమిది దాటింది. ఇహ ఇప్పుడు ఇంటికెళ్ళి వంటేం చేసుకుంటాంగాని చక్కగా

ఏదైనా హొటల్‌లో తిందాం" అంది బద్ధకంగా వళ్ళు విరుచుకుంటూ.

"ఎందుకు డబ్బు దండుగ. ఒక్క గంట ఓపికపడితే వంటంతా పూర్తి చేస్తాను" అన్నాడు ఆనంద్.

"మన సంతోషంకోసం ఎంత డబ్బు ఖర్చు పెట్టినా ఫరవాలేదు. ఈటైములో నిన్ను కష్టపెట్టటం నాకిష్టం లేదు" అంటూ అతని చెయ్యి పట్టుకుని నడవటం ప్రారంభించింది చండిక.

ఇద్దరూ పార్కు బయటికొచ్చారు. అటుగా పోతున్న ఆటోనాపి ఏదో అడ్రస్ చెప్పింది చండిక. ఇద్దరూ ఎక్కి కూర్చున్నారు. పదినిమిషాల్లో ఆటోవాళ్ళనొక పెద్దహొటల్ ఆవరణలో దించింది. ఆటోకి డబ్బుచెల్లించి ఆనంద్‌ని వెంటపెట్టుకుని లోపలికి నడిచింది చండిక.

"ప్రమదావనిలో అన్నిటికన్నా ఖరీదైన హొటల్ ఇదే. బిల్లు ఎక్కువ అవుతుందని వెనకాడకు. నీ కిష్టమైనవన్నీ ఆర్డరివ్వు." అంటూ నవ్వింది.

ఆహొటల్ చాలా ఖరీదైన ఫర్నిచర్‌తో అందంగా అలంకరించ బడివుంది. మత్తెక్కించే సువాసనలు గుబాళిస్తున్నాయి. విశాలమైన డైనింగ్‌హాల్ గుడ్డిగా వెలుగుతున్న రంగురంగుల దీపకాంతుల్లో వింతలోకంలా కనిపిస్తోంది. ఎత్తుగా వున్న స్టేజి మీద నుంచి ఆర్కెస్ట్రా బృందం వీనులవిందైన సంగీతం వినిపిస్తోంది. ఖాళీగా వున్న టేబుల్ చూసి కూర్చున్నారు. వెయిటర్ వచ్చి గ్లాసుల్లో ఐస్‌వాటర్ పోసి మెనూకార్డు అందించింది.

మెనూకార్డు అటూఇటూ తిరగేస్తూ "ముందు ఒకగ్లాసు లెమన్‌జ్యూస్, ఒక పెగ్ విస్కీ పట్టుకురా" అంటూ ఆర్డరిచ్చింది చండిక.

"మీకు... మీకా అలవాటుందా?" అంటూ ఆశ్చర్యంగా అడిగాడు ఆనంద్ వెయిటర్ వెళిపోయిం తర్వాత.

"అలవాటు లేదు కానీ ఎప్పుడన్నా సరదాకి తీసుకుంటుంటాను" అంటూ నవ్వింది చండిక.

ఐదు నిమిషాల తర్వాత వెయిటర్ వచ్చి లెమన్ జ్యూస్ వున్నగ్లాసు ఆనంద్ ముందు, విస్కీగ్లాసు చండికముందు పెట్టింది. చండిక సిగరెట్ వెలిగించుకుని నెమ్మదినెమ్మదిగా విస్కీ సిప్ చేస్తుంటే ఆనంద్‌కి ప్రాణం ఉసూరుమంది. తన గ్లాసులోని లెమన్‌జ్యూస్ గడగడ తాగేసి స్టేజి వంక చూస్తూ కూర్చున్నాడు. మరి కొద్దిసేపటికి స్టేజీమీదకి ఇద్దరు యువకులు వచ్చి నాట్యం చేయనారంభించారు. వాళ్ళ వస్త్రధారణ, నాట్యం చేసేతీరు చూస్తే అసహ్యమేసింది ఆనంద్‌కు.

"ఛీ ఛీ! ఇవేం డాన్సులు" అన్నాడు ఏవగింపుగా.

"ఏం? ఎంచక్కా డాన్స్ చేస్తుంటే బాగా లేదంటావేం! ఇప్పుడేముంది ఇంకాస్సేపటికి వాళ్ళు కొంచెం కొంచెం స్ట్రిప్ చేస్తున్నప్పుడుంటుంది మజా" అంటు గ్లాసులోని ద్రవాన్ని మరోగుటకేసింది చండిక.

"మజానా నాబొందా! అదేదో నువ్వే చూసి తగలడు" అని తిట్టుకుంటూ మౌనంగా తల వంచుకు కూర్చుని మెల్లగా భోంచెయ్యటం ప్రారంభించాడు.

తిరిగి ఇల్లు చేరేసరికి పదకొండు గంటలైంది. పొద్దుటి నుండీ విశ్రాంతి లేకపోవటం వల్లనేమో చండిక వెంటనే నిద్రపోయింది. ఆనంద్‌కి మాత్రం ఒకపట్టాన నిద్రపట్టలేదు. బెలూన్ విషయంలో చండిక తననేమీ అనుమానించకపోవటం అతనికి కొండంత ధైర్యాన్నిచ్చింది. కానీ తప్పించుకోవటానికి మళ్ళీ బెలూన్ని ఉపయోగించుకోవటం సాధ్యపడదు. వేరే పద్ధతులు ఆలోచించాలి. తప్పించుకోవటానికి రకరకాల మార్గాలు అన్వేషిస్తూ అతనికి తెలియకుండానే నిద్రలోకి జారుకున్నాడు.

ఒకరోజు సాయంత్రం ప్రసాద్ వచ్చాడు.

"రేపటి నుండీ ఆలయంలో పురాణం చెబుతారట. మన వీధిలో చాలామంది వెళుతున్నారు. మీరు కూడా వస్తారా?" అని అడిగాడు.

"ఆమెనడిగి చూస్తాను... ఏమంటుందో మరి?" అన్నాడు ఆనంద్.

"ఏమంటారు. అందులోనూ పురాణం చెప్పేది సర్వజ్ఞులైన లోపాముద్రగారు. చాలా అరుదుగా లభించే అవకాశం. సాయంత్రం వంట ముగించుకుని వెళ్ళొచ్చు. మళ్ళీభోజనాల వేళకల్లా తిరిగి రావొచ్చు" అన్నాడు.

ఆరాత్రి భోం చేసేటప్పుడు ఆ విషయం చండికతో చెప్పాడు ఆనంద్. ఆమె ఎటువంటి అభ్యంతరం చెప్పలేదు. దీని మూలంగా నీకు నష్టమేముంది. పురాణాలు విని నాబుర్ర మరింత చెడిపోతే నీకు మరింత లాభం-అని మనస్సులో తిట్టుకున్నాడు ఆనంద్.

మర్నాడు సాయంత్రం ఆరున్నరకల్లా ఆ వీధిలో పదిమందితో కలిసి పురాణకాలక్షేపానికి బయల్దేరాడు ఆనంద్. తనూహించినదానికన్నా చాలా ఎక్కువమందే వచ్చారు. దాదాపు అందరూ పురుషులే. ఆలయ ప్రాంగణమంతా పచ్చని చెట్లతో మనోహరంగా, ప్రశాంతంగా ఉంది. మిగతావాళ్ళందరూ ముందుగా దేవి దర్శనానికి వెళ్ళారు. పూలతో అలంకరించబడ్డ వేదికపైన ఆసీనులై వున్నారు లోపాముద్ర.

ఆమె ఆకారంలో ఒకరకమైన గంభీరత, ఆకర్షణ ఉన్నాయి. శ్రావ్యమైన కంఠంతో ముందుగా భగవతిని స్తుతిస్తున్నారు. ఆమె ముందు బారులు తీరి కూర్చున్న జనం మౌనంగా కళ్ళు మూసుకుని మనస్సులో దేవిని ధ్యానిస్తున్నారు. దూరంగా వినబడుతున్న గుడిగంటలు మనస్సుని పులకింపజేస్తున్నాయి. ఎవరితోనూ కలవకుండా కొంచెం దూరంగా ఒక చెట్టు కింద చతికిలబడ్డాడు ఆనంద్.

కొద్దిసేపట్లోనే పురాణం మొదలైంది. సర్వశక్తి స్వరూపిణి అయిన మహాభగవతి ప్రపంచాన్ని జీవరాసుల్ని ఏ విధంగా సృష్టించిందీ వివరిస్తున్నారు లోపాముద్ర. శ్రోతలు మంత్రముగ్ధుల్లా తలలూపుతూ వింటున్నారు. అప్పుడే వచ్చిన నలుగురు పురుషులు ఆనంద్ కూర్చున్న చెట్టుకిందే అతనికి కొంచెం ఎడంగా కూర్చున్నారు. ఒకసారి వాళ్ళవంక చూసి మళ్ళీ పురాణం వినసాగాడు.

"సకల జీవరాసుల్ని సృష్టించిన పిదప ఆ మహాభగవతి తన అంశతో తన ఆకారంతో మానవిని సృష్టించింది. భూలోకానికి ఆమెను అధికారిణిగా చేసింది. ఆమెకు రెండు వందల సంవత్సరాల ఆయువునిచ్చింది. జీవితకాలంలో సంకల్ప మాత్రంగా కోరినంత మంది సంతానాన్ని కనేవరం ఇచ్చింది. కొన్ని సంవత్సరాలపాటు ఆదిమానవి ఒంటరిగా ప్రపంచాన్నంతా తిరిగి చూసింది. చివరికామె మహాభగవతిని ధ్యానించి ప్రత్యక్షం చేసుకుని 'తల్లీ... దేవదేవీ! ప్రపంచంలోని జీవరాసులన్నిటిలోనూ భగవిచక్షణ చూపించావు. ఆడ మగ జంతువులన్నీ జతకట్టి జంటగా తిరుగుతుంటే నాకీ ఒంటరితనమేమిటి? నన్ను కరుణించి నాకు కూడా తోడు చూపించు మాతా'- అని ఆమెను ప్రార్థించింది.

అప్పుడా విశ్వమాత చిరునవ్వుతో– 'ఓ మానవీ! సృష్టిలోని జీవరాసులన్నిటికన్నా నీకు ఎక్కువ ఆయుర్దాయం ఇచ్చాను. నీ ఆయువులో సగం త్యాగంచెయ్యగలిగితే నీ కోరిక నెరవేరుతుంది... అంగీకరించగలవా?...'— అని ప్రశ్నించింది.

మానవి సంతోషంగా తన అర్ధ ఆయుర్దాయం త్యజించటానికి సిద్ధపడింది. అప్పుడా భగవతి పురుషుణ్ణి సృష్టించి– 'ఓ మానవీ! ఇతడు నీకు తోడుగావుండి సృష్టికార్యంలో చిన్న పాత్రవహిస్తాడు. నీకు విధేయుడిగా వుండే ఇతణ్ణి పోషించి రక్షించేభారం నీదే'-- అనిచెప్పి అదృశ్యమైంది.

"వాట్ నాన్సెన్స్!" అని కొంచెం బిగ్గరగా అరిచాడు ఆనంద్‌కి దగ్గరలో కూర్చున్నవ్యక్తి.

ఉలిక్కిపడి ఆ మాటలన్న వ్యక్తివంక చూశాడు ఆనంద్. అతనా మాటలు నిజంగా అన్నాడా లేక తన భ్రమా అనే అనుమానం కలిగింది.

అనుమానం తీర్చుకోవటానికి అతనికి కొంచెం దగ్గరగా జరిగి "డూయూ రియల్లీ థింక్ సో" అన్నాడు.

ఆ అపరిచితవ్యక్తి కూడా అదిరిపడి ఆనంద్‌వంక ఆశ్చర్యంగా చూశాడు.

ఆనంద్ అనుమానమంతా ఒక్క త్రుటిలో తొలగిపోయింది. తప్పకుండా ఇతను నాలాగే బయటి ప్రపంచం నుంచి వచ్చినవాడే నను కున్నాడు.

"మీ పేరేంటి? ఈ నరకంలోకి ఎట్లా వచ్చిపడ్డారు?" ఆత్రుతని అణచుకుంటూ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నలోని ఆంతర్యం ఆ కొత్తవ్యక్తికి కూడా అర్థమైంది.

"నా పేరు రామారావ్. స్వస్థలం గుంటూరు. మరి మీరో?" అన్నాడు.

ఆనంద్ తనని తాను పరిచయం చేసుకున్నాడు. వాళ్ళ మాటలు పురాణం వింటున్న రామారావు స్నేహితుల కిబ్బంది కలిగించాయి. తలలు తిప్పి చూశారు.

"ఇందాకట్నుంచీ నేను గమనించలా. ఇతను నా స్నేహితుడు ఆనంద్. చాలాకాలానికి కనబడ్డాడు. మీరు పురాణం వింటుండండి. మేం కాస్త అలా వెళ్ళి కబుర్లు చెప్పుకుంటాం" అని వాళ్ళతో అంటూ ఆనంద్ చెయ్యిపట్టుకు లేవదీసి దూరంగా తీసుకెళ్ళాడు రామారావు.

"మీరిక్కడికెట్లా వచ్చారు? ఎవరి చేతచిక్కారు?" కుతూహలంగా అడిగాడు ఆనంద్.

"నేను గుంటూర్లో ఒక బ్యాంక్ మేనేజర్‌గా పనిచేస్తుండేవాణ్ణి. కట్నం బాగా వస్తుందని ఓ సత్తిదాన్ని కట్టుకున్నా. ఒక్కతే కూతురు కాబట్టి ఆస్తంతా మాకే వస్తుందనుకున్నా. పెళ్ళయి ఏడాది తిరక్కుండానే మావగారు వ్యాపారంలో నష్టపోయి దివాలా తీశారు. పెళ్ళినాడు ఇస్తామన్న కట్నం పూర్తిగా తెమ్మని దాన్ని పుట్టింటికి తరిమేశా. నెల్రోజులుండి వట్టిచేతుల్తో తిరిగొచ్చింది. కోపం పట్టలేక చావగొట్టా. నాఖర్మకాలి ఆయువుపట్టున తగిలి అది చచ్చూరుకుంది. పోలీసు కేసులూ, కోర్టు సమన్లూ, పేపరు ప్రచారాలు అన్నీ తట్టుకుని ఎట్లాగో గట్టెక్కా.

"మళ్ళీ పెళ్ళి చేసుకోవాలని ప్రయత్నిస్తే విశాఖపట్నంలో ఓ మంచి సంబంధం వుందని తెలిసింది. అంతదూరం ఎక్కువమందివెళితే ఖర్చులు చాలా అవుతాయని ఒక్కణ్ణే వెళ్ళా. పెళ్ళికూతురు నాతో ఒంటరిగా మాట్లాడాలని కార్లో ఎక్కించుకుని ఊరిబయటకు తీసుకెళ్ళి చావగొట్టి స్పృహతప్పిన నన్నిక్కడికి చేర్చింది. ఆర్నెల్లు చిత్రహింసలుపెట్టి పెళ్ళిచేసుకుంది. దాంతో ఈ పన్నెండేళ్ళుగా కాపురం చెయ్యలేక చస్తున్నా" తన వివరాలన్నీ చెప్పాడు రామారావు.

తనే పరిస్థితిలో అక్కడికొచ్చిందీ వివరించాడు ఆనంద్. చివరికి,

"పన్నెండేళ్ళుగా ఇక్కడుంటున్నారు. మరి ఎప్పుడూ తప్పించుకోవటానికి ప్రయత్నం చెయ్యలేదా?" అడిగాడు.

"మొదట్లో ఆ ఆలోచన చేశా. కానీ అసాధ్యమనిపించి మానుకున్నా. ఏదేరకంగా ప్రాణాల్తో వుంటే చాలనిపించింది. ఇక్కడి మగాళ్ళెవరూ మనకి సహకరించరు. అసలు వాళ్ళకీ పర్వతాల అవతల వేరే ప్రపంచం వుందనే సంగతే తెలియదు. మనమేదన్నా చెప్పబోతే పిచ్చివాణ్ణి చూసినట్లు చూస్తారు. ఏంచెయ్యను... పరిస్థితులతో రాజీపడాల్సి వచ్చింది" అన్నాడు రామారావు విచారంగా.

"మనలాంటివాళ్ళు మీకింకెవరూ తగల్లేదా?" అన్నాడు ఆనంద్.

"తగలకేం. ఓ పదిమందితో బాగానే పరిచయం ఉంది. మరో ఇరవైమందితో ముఖపరిచయం ఉంది"

"మరైతే మీరంతా కలిసికట్టుగా తప్పించుకునే ఆలోచన చెయ్యలేదా?"

"ఎట్లా వీలౌతుంది? ఎవరి సంసారాలు వాళ్ళవి. తీరికెక్కడ చచ్చింది. పోనీ తీరిక దొరికినా బయటికి కదలాలంటే పెళ్ళాం పర్మిషన్ కావాలి. అందువల్ల ఎవరికివారు చప్పబడిపోయ్యారు. మన బతుకులిలా వెళ్ళబారిపోవాల్సిందే" అన్నాడు రామారావు నిస్పృహగా.

"అలా నీరసపడితే ఎలా? పట్టుదలుంటే సాధించలేనిదంటూ ఉండదు. మనమందరం సంఘటితమైతే మనకేదో ఒకదారి దొరక్కపోదు. ఈ నరకంనుంచి బయటపడగలుగుతాం" పట్టుదలగా అన్నాడు ఆనంద్.

"ఆలోచించటం తేలికేగాని ఆచరణ అసాధ్యం. ఇక్కడి స్త్రీలందరూ రాటుతేలినవాళ్ళు. మనమందరం కల్సినా యాభైమందిముంటామేమో! కొండను ఢీకొనటం అవివేకం" అన్నాడు రామారావు అనుభవపూర్వకంగా.

"కొండను తలతో ఢీకొనటం మూర్ఖత్వమే... కాదనను. కానీ మానవుడు ఉపాయంతో కొండల్ని పిండిచేస్తున్నాడు. అంతకంటే పెద్దపనేమీ కాదు ఇక్కణ్నుంచి తప్పించుకోవటం"

"నీ మాటలు వింటుంటే నాకూ ధైర్యం వస్తోంది. కానీ మనిద్దరం ఏం చెయ్యగలం... మిగతావాళ్ళు సహకరించొద్దూ?" అన్నాడు రామారావు.

"మీకు పదిమందితో బాగా పరిచయంవుందన్నారు. వాళ్ళలో కనీసం కొంత మందినైనా రేపిక్కడికి తీసుకురండి. మనం సమావేశమై చర్చించుకుంటే బాగుంటుంది. ఇక్కడ దాదాపు నెలరోజులు పురాణకాలక్షేపం ఉంటుంది. ఇంటికన్న గుడిపదిలం అన్నట్లు మనం తరచుగా కలుసుకోవటానికి ఇది అనువైనచోటు. మళ్ళీ రేపిక్కడ ఇదేచోట కలుద్దాం" అన్నాడు ఆనంద్ ఆశగా.

"సరే... ప్రయత్నించి చూద్దాం. కానీ చాలా జాగ్రత్తగా ఉండాలి. ఏమాత్రం మన సంగతి బయటకు పొక్కినా మన ప్రాణాలుండవు" హెచ్చరిస్తూ వెళ్ళిపోయాడు రామారావు.

ఆ రాత్రి ఉత్సాహంగా గడిపాడు ఆనంద్. అప్పుడే తప్పించుకు బయటపడ్డంత సంబరపడ్డాడు. కానీ మర్నాడు అన్నమాట ప్రకారం రామారావు రాకపోయేసరికి అతను డీలాపడిపోయాడు. బహుశా ఏదో ఇబ్బందివల్ల రాలేకపోయాడేమోనని సమాధానం చెప్పుకున్నాడు. అతని ఊహ నిజమే అయింది. ఆ మర్నాడు రామారావు మరో నలుగుర్ని వెంటబెట్టుకొచ్చాడు. వాళ్ళలో ఒకతను శేషాచలం- అక్కడికి రాకపూర్వం మంచి ప్రాక్టీసున్న లాయరు. రెండోవ్యక్తి వాసుదేవరావు- వ్యాపారస్తుడు. మూడోవాడు శేఖర్- ఒక లక్షాధికారికి వారసుడు. చివరివాడు గోపాలరావు- ఇంజనీర్. పరిచయాలయ్యాక చాలాసేపు చర్చించుకున్నారు.

"ముందు మనం సాధ్యమైనంత ఎక్కువ మందిని సేకరించాలి. అప్పుడు మనకి మరింత ధైర్యం వస్తుంది. అప్పుడు జాగ్రత్తగా ఆలోచించి పథకం తయారుచేసుకోవచ్చు" అన్నాడు శేఖర్.

"బాగా ప్రయత్నిస్తే ఓ ముప్పైమందిని కూడగట్టొచ్చు. స్వేచ్ఛకోసం పరితపిస్తున్నవాళ్ళు నాకో నలుగురైదుగురు తెలుసు" అన్నాడు గోపాలరావు.

"వాళ్ళు రావటంలేదు వీళ్ళు రావటంలేదు అనుకోకుండా ఈ నెలరోజులూ వీలైనంతవరకూ ప్రతిరోజూ మనం కలుసుకోవాలి" రామారావు హెచ్చరించాడు.

"మానసికంగా మనకి బలం చేకూరాలంటే ప్రాణాలుపోయినా ఈ పని నుంచి విరమించుకోమని దేవుడిమీద మనమందరం ప్రమాణంచెయ్యాలి" అన్నాడు శేషాచలం.

దానికందరూ అంగీకరించారు. మహాభగవతి పేరుతో విసిగిపోయినవాళ్ళకి తమ తమ ఇష్టదైవాలమీద ప్రమాణంచెయ్యటం కొండంతబలాన్ని ఆత్మవిశ్వాసాన్ని కలిగించింది.

"ఒక్క మెషీన్‌గన్ సంపాదించగలిగితే కొనవూపిరున్నంత వరకూ ఇక్కడి ఆడాళ్ళని పిట్టల్లా కాల్చేస్తా" అన్నాడు ఆనంద్ కసిగా.

పురాణం జరుగుతున్నంతసేపూ స్త్రీలని ఇష్టమొచ్చినట్లు తిడుతూ ఆనందించారు వాళ్ళంతా. చివరికి నూతనోత్సాహంతో ఇళ్ళు చేరుకున్నారు.

పదిరోజులు గడిచేసరికి వాళ్ళసంఖ్య పాతిక్క పెరిగింది. అంతమందీ గుంపుగా ఒకేచోట కూర్చుని పెద్దగా చర్చలు జరపటం ప్రమాదమని అయిదు జట్లుగా విడిపోయారు. ఒక్కొక్క జట్టుకీ ఒక నాయకుడుంటాడు. విడివిడిగా జట్లన్నీ ముందు చర్చలు జరిపేవాళ్ళు. ఆ తరువాత నాయకులందరూ ఒకచోట చేరి సంప్రదించుకునేవారు. ఒకళ్ళకి తెలిసిన విషయాలు మరొకరికి చెప్పుకోవటంద్వారా విలువైన సమాచారం సేకరించగలిగారు.

ఆ లోయచుట్టూ వలయంగా ఉన్న పర్వతాలపైకి ఎగబ్రాకటం అసాధ్యమైన పనని అందరూ అంగీకరించారు. పోతే అక్కడి స్త్రీలు పర్వతాలపైకి చేరుకోవటానికి ఉపయోగించే లిఫ్ట్ తూర్పుదిశగా ఉంది. అక్కడ పటిష్టమైన కాపలావుంటుంది. దాదాపు పదిమంది స్త్రీలు కాపలా కాస్తుంటారు.

వారివద్ద స్టెన్‌గన్‌లూ, లైట్ మెషీన్‌గన్‌లూ ఉంటాయి. వాళ్ళని ముఖాముఖి ఎదుర్కోవటం మృత్యువుని కోరి తెచ్చుకోవటమే. లోయకి ఉత్తరదిక్కున దాదాపు రెండు ఫర్లాంగుల దూరంవరకూ ఎత్తయినగోడ నిర్మించబడి ఉంది. ఆ గోడవతల ఏముందో ఎవరికీ తెలియదు. కానీ ఆ గోడ దాటితే స్వేచ్ఛ లభించిన ట్లేనని చూచాయగా తెలిసింది. గోడదాటటం సులువైన పనికాదు.

గోడమీద బారుకి ఎలక్ట్రిక్ వైర్లుంచబ

డ్డాయి. పైగా గోడ దాదాపు పన్నెండడుగుల ఎత్తుంటుంది. గోడకు మధ్యన నలభై అడుగుల ఎత్తున్న టవర్ నిర్మించబడ్డది. ఆ టవర్లో లాంగ్‌రేంజ్ మెషిన్‌గన్స్ అమర్చబడ్డాయి. వాటినుపయోగించటానికి ఎనిమిదిమంది స్త్రీలుంటారు. గోడపొడవునా ఫ్లడ్‌లైట్లు తెల్లవార్లూ వెలుగుతుంటాయి. నలుగురు సెంట్రీలు ఆ చివర్నుంచి ఈ చివరకు ఎప్పుడూ తిరుగుతుంటారు.

తప్పించుకోవటానికున్న రెండుమార్గాల్లో ఏది తేలికైందో నిర్ణయించటానికి అనేక తర్జన భర్జనలు జరిగాయి. లిఫ్ట్‌ని వశపరచుకుంటే పదినిమిషాల్లో పర్వతాలపైకి చేరుకోవచ్చని అభిప్రాయపడ్డారు.

ఆనంద్‌కి ఆ ఆలోచన నచ్చలేదు. నాయకుల్నుద్దేశించి అతనిలా అన్నాడు- "నేను స్వయంగా చూడకపోయినా మనకి తెలిసిందాన్నిబట్టి లిఫ్ట్‌వైపు జనసంచారం ఎక్కువ. ఎటువంటి ఘర్షణా లేకుండా పదిమంది సాయుధులైన స్త్రీలని ఎలా వశపరచుకోగలం? అర్ధరాత్రి ఇల్లుదాటి రావటం మనకి కుదరని పని.

"మనం దాడిచెయ్యాలంటే అది తొమ్మిది గంటలలోపే జరగాలి. ఆ టైమ్‌లో లిఫ్ట్‌వైపు రద్దీ ఎక్కువ. ఎలాగో కష్టపడి లిఫ్ట్ వశపరచుకున్నా కింద కాపలా ఉన్నట్లే పైనకూడా కాపలా వుండొచ్చు. మధ్యలో పవర్ కట్‌అయితే మనం లిఫ్ట్‌లోనే ఇరుక్కుపోతాం. ఏవిధంగా చూసినా లిఫ్ట్‌ని ఎటాక్‌చెయ్యటం శ్రేయస్కరంకాదు"

మిగతావాళ్ళేమంటారోనని ఒక్కక్షణం ఆగి వాళ్ళవంక చూశాడు ఆనంద్. అందరికీ అతను చెప్పేది సబబేననిపించింది.

"మరి గోడ దూకటంకూడా సామాన్యమైన విషయంకాదు కదా" అన్నాడు రామారావు.

"అది తేలికని నేననటంలేదు. గోడ దాదాపు పన్నెండడుగులుంటుంది కాబట్టి మనకి నిచ్చెన అవసరం ఉంది. దాన్ని సంపాదించగలం. పోతే గోడపైనున్న కరెంట్‌వైర్లు, మన ఉనికిని తెలిపే ఫ్లడ్‌లైట్లు కరంట్‌తో ముడిపడి ఉన్నాయి. మనం రెండు జట్లుగా విడిపోవాలి. ఒక జట్టు పవర్‌స్టేషన్‌మీద దాడి చేసి పవర్ కట్‌చెయ్యాలి. రెండవజట్టు గోడ దరిదాపుల్లో పొంచివుండి పవర్ కట్‌కాగానే నిచ్చెన సహాయంతో గోడ దాటటం ప్రారంభించాలి. ఈలోగా మొదటి జట్టుకూడా గోడను చేరుకోవచ్చు. కరెంట్‌పోవటంవల్ల టవర్ మీదున్న కాపలావాళ్ళు మనల్ని చూడలేరు. మనలో ఏ ఒక్కరం గోడదాటినా మనకష్టం ఫలించినట్లే. పౌరుషమున్న ఏ మగాడూ ఆడదాని పెత్తనాన్నంగీకరించకూడదు. ఇంత బతుకూ బతికి ఈ ఆడముండలకి ఊడిగంచెయ్యటంకన్నా చావటం నయం. ఈ స్త్రీ సంస్కృతిని నాశనంచెయ్యటమో, మనం నాశనం కావటమో తేల్చుకోవాలి" ఉద్రేకంగా అన్నాడు ఆనంద్.

అతని మాటలు అందరికీ ఆవేశాన్ని కలిగించాయి. కాస్సేపటికి ఆ ఆవేశం చల్లారింతర్వాత శేషాచలం తన అనుమానాన్ని వ్యక్తంచేశాడు.

"పవర్‌స్టేషన్ వివరాలేమిటి? అదెక్కడుంది? ఎటువంటి కాపలా ఉంటుంది? ముందీ వివరాలు తెలుసుకోకుండా ఈ పథకం నిర్ధారణ చేసుకోవటం మంచిదికాదు"

"రేపట్నుంచీ మనం ఆ ప్రయత్నంలోనే వుందాం. విషయాలు తెలియగానే మరింత స్పష్టంగా పథకం తయారుచెయ్యొచ్చు" అన్నాడు ఆనంద్.

ఆరోజు సమావేశం అందరికీ ఉత్సాహాన్నీ, ఆశనూ కలిగించింది. మూడురోజుల తర్వాత పవర్‌స్టేషన్ గురించిన సమాచారం వాళ్ళకు లభించింది. అది వాళ్ళకనుకూలంగా ఉంది.




అమావాస్య చీకటిని చీల్చిచెండాడటానికి ప్రయత్నిస్తున్నాయి ఎలక్ట్రిక్ దీపాలు. ఊరికి

దూరంగా నిర్జనప్రాంతంలో చీకటిమాటున నడుస్తున్నారు కొంతమంది పురుషులు. పవర్ స్టేషన్ వాళ్ల గమ్యం. రహదారిన వచ్చేపోయేవాళ్ల కంటబడటం ప్రమాదమని అడ్డదార్లెంచుకున్నారు. దారి తెలిసిన వ్యక్తి ముందు నడుస్తున్నాడు. మిగతావాళ్ళు నిశ్శబ్దంగా అతన్ననుసరిస్తున్నారు. వాళ్లదగ్గర చిన్నచిన్న కత్తులు, ఇనుపకడ్డీలున్నాయి. వాళ్లందరి మనస్సులో ఏదో తెలియని భయాందోళన లున్నాయి.

చల్లని గాలివీస్తున్నా వాళ్ల వళ్ళు చెమటతో తడిసిపోతోంది. బానిసత్వంపై తిరుగుబాటు చెయ్యాలనే దృఢసంకల్పం, దాస్యశృంఖలాల్ని తెంచుకుని స్వేచ్ఛా ప్రపంచంలోకి అడుగుపెట్టాలనే ఆరాటం వాళ్లని మునుముందుకు నడిపిస్తున్నాయి.

హఠాత్తుగా ముందునడుస్తున్న వ్యక్తి ఆగి చిన్నగొంతుకతో "అదుగో చూడండి" అన్నాడు.

అందరూ ముందుకొచ్చి చూశారు. దూరంగా పవర్‌స్టేషన్ లైట్లు దేదీప్యమానంగా వెలుగుతూ వారి కంటపడ్డాయి.

"ఇప్పుడు మనం ప్రదర్శించబోయే ధైర్యసాహసాల మీద మన బతుకులేకాక యావత్పురుష ప్రపంచపు భవిష్యత్తు ఆధారపడివుంది. ఇంకా ప్రాణాలమీద తీపివున్న వాళ్లెవరైనా ఉంటే ఇప్పుడే వెళ్లిపోవటం మంచిది" అన్నాడు ఆనంద్.

"మాటల్తో కాలయాపన చెయ్యొద్దు. ఇక్కడ పిరికి వాళ్లెవరూలేరు. చావో బతుకో తేల్చుకుందాం పదండి" అన్నాడో వ్యక్తి.

"అంతే! అంతే! పదండి" అన్నారందరూ ముక్తకంఠంతో.

"ఇప్పట్నుంచీ మనంచేసే ప్రతిపనీ నిశ్శబ్దంగా, చురుగ్గా, వేగంగా చెయ్యాలి. అందుకు మనం ధరించిన దుస్తులు ఆటంకం కావొచ్చు. ముందు వాటినొదిలెయ్యండి" అన్నాడు ఆనంద్.

అందరూ వాళ్ల దుస్తులు తీసేసి డ్రాయర్లతో నిలబడ్డారు.

"పదండి... మరింత దగ్గరకెళదాం" అన్నాడు ఆనంద్.

అందరూ నిశ్శబ్దంగా నడవసాగారు. లైట్ల కాంతి మీదపడకుండా చెట్లను చాటుచేసుకుంటూ ముందుకిపోయారు. పవర్‌స్టేషన్‌కి ఇరవైగజాల దూరంలో పొదలమాటున నక్కి కూర్చుని పరిశీలనగా చూశారు. వాళ్లకందిన సమాచారం ప్రకారం స్టేషన్‌గేటు ముందు ఇద్దరు సెంట్రీలుండాలి. కానీ వాళ్లకు ఒక్క సెంట్రీ మాత్రమే కనిపించింది. ఆవిడ చేతిలో తుపాకి పట్టుకుని అటూఇటూ పచార్లు



చేస్తోంది. మరి రెండో సెంట్రీ ఏమైందో వాళ్ల కర్థంకాలేదు.

"బహుశా రెండో ఆవిడ లోపలికెళ్ళుండొచ్చు. ఆవిడకూడా వస్తుందేమో కాస్సేపు చూద్దాం" అన్నాడు ఆనంద్.

"ఆ రెండో సెంట్రీ అసలు ఉందని నమ్మకమేముంది? ఆమెకోసం ఎదురుచూస్తూ టైమ్ వేస్ట్ చెయ్యకూడదు" అన్నాడు వాళ్లలోని ఒక వ్యక్తి.

"ఆల్‌రైట్. నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. మనం మొత్తం పదిహేనుమంది మున్నాం. నాతో మరో ఆరుగుర్ని తీసుకుని నేను కొంచెం దూరంగా వెళతాను. పది నిమిషాలాగి మీలో ఒకరు ముందుకెళ్లి 'రక్షించండి, రక్షించండి' అంటూ కేకలెయ్యండి. ఆ కేకలు విని సెంట్రీలు ఏమైందో తెలుసుకోవటానికి తప్పనిసరిగా ఇటువస్తారు.

"వాళ్లు కేకలువేస్తున్న వ్యక్తిని సమీపించగానే వెనక దాక్కున్నవాళ్లంతా ఒక్కసారిగా వాళ్లమీద విరుచుకుపడి చంపెయ్యాలి. రెండో సెంట్రీ కూడా ఉండి ఇక్కడికివస్తే మీపని కొంచెం కష్టంకావచ్చు. ఒక్కరేవస్తే అతి సులువుగా మీపని పూర్తవుతుంది. సెంట్రీ దగ్గరుంది మామూలు తుపాకి కాబట్టి మనం భయపడాల్సిన పనిలేదు. మనలో ఒక్కర్నికాల్చి చంపేలోపలే ఆమె పని మనం పట్టొచ్చు. సెంట్రీ రోడ్డుదాటి మీ దగ్గరకురాగానే మేమంతా స్టేషన్‌లోకి ప్రవేశిస్తాం. మనకి తెలిసిందాన్నిబట్టి లోపల ముగ్గురు ఎలక్ట్రీషియన్లుంటారు. వాళ్ల సంగతి మేం చూస్తాం. ఈలోపల మీరు పనికానిచ్చి మీరు కూడా లోపలికి రావాలి.

ఫ్యూజులు పీకేసి సాధ్యమైనంత వేగంగా గోడ దగ్గరకు పరిగెత్తాలి. ఈపాటికే గోడదగ్గర పొంచివున్న మనవాళ్లు కరెంట్‌పోగానే నిచ్చెన ఏర్పాటుచేసి గోడమీద వైర్లు కత్తిరిస్తారు. మనం చెయ్యబోతున్న పని ఎంత ముఖ్యమైందో మీకు తెలును. కొన ఊపిరున్నంతవరకూ అందరం పోరాడాలి" అంతకుముందే వేసుకున్న పథకాన్ని మళ్ళీ వివరించాడు ఆనంద్.

"నీతో వచ్చే ఆరుగుర్ని తీసుకుని నువ్వెళ్లు. ఇక్కడ చెయ్యాల్సిన పని నేచూస్తాను" అన్నాడు శేషాచలం.

"ఓకే... మేం వెడుతున్నాం. మరోగంటలో మనమంతా స్వేచ్ఛాజీవులమవుతాం" అంటూ ఆనంద్ తనతో రావాల్సినవాళ్లను తీసుకుని దూరంగా వెళ్లాడు.

రోడ్డుకి సాధ్యమైనంత దగ్గరగా పొదలమాటున కూర్చుని గేటుముందు కాపలాకాస్తున్న సెంట్రీవంక చూడసాగారు వాళ్లంతా. ఐదు నిమిషాలు నిశ్శబ్దంగా దొర్లిపోయాయి. జరగబోయేది ఊహించుకుంటూ సస్పెన్స్ భరించలేక సతమతమవుతున్నా రందరూ.

మరో రెండు నిముషాలు గడిచాయి. స్టేషన్ లోపల్నుంచి ఎవరో ఒక స్త్రీ బయటికొచ్చి సెంట్రీతో మాట్లాడటం వాళ్ల కంటపడింది. ఆ వ్యక్తి యూనిఫారంలోలేదు కాబట్టి రెండవ సెంట్రీగా భావించే అవకాశంలేదు. బహుశా ఎలక్ట్రీషియన్లలో ఒకరై వుంటారనుకున్నాడు ఆనంద్ ఆమెవంక చూస్తూ. అతని మనస్సంతా ఉద్వేగంతో నిండిపోయింది.

తన పథకం పారబోతోంది. తను స్వేచ్ఛాజీవి కాబోతున్నాడు... స్వేచ్ఛ! స్వేచ్ఛ! ఎంత మధురమైంది. ఇకనుంచీ పెందలాడే లేచి కసవు వూడ్చి అంట్లు తోమనవసరం లేదు. గంటల తరబడి పొయ్యిముందు కూర్చుని వంట చెయ్యనక్కరలేదు. ఈ జుట్టూ, దుస్తుల గొడవుండదు. హాయిగా ఇష్టంవచ్చినట్లు నిద్రపోవచ్చు. సిగరెట్లు కాల్చొచ్చు, తాగొచ్చు... అంతా తనిష్టమే.

ఇక్కణ్నుంచి బయటపడగానే ముందు స్నేహితులందరికీ మంచి పార్టీ ఇచ్చి తను చేసిన సాహసాన్ని తెలియచెప్పాలి. ఆ తరువాత సాధ్యమైనంత త్వరలో మళ్ళీ పెళ్ళిచేసుకోవాలి. ఆ వచ్చేదాని మీద తన కసంతా తీర్చుకోవాలి.

మైగాడ్! ఇక్కడ ఎంత నీచమైన జీవితం గడపాల్సొచ్చింది. ఆడదానికి ఊడిగం చేస్తూ - ఛీ ఛీ! ఆలోచించటానికే అసహ్యంగా ఉంది. ఇదంతా ఒక పీడకల. మళ్ళీ తను సుందరస్వప్నాలను కాంచబోతున్నాడు. జీవితం ఎంత విలువైందో ఇప్పుడు బాగా అర్థమవుతోంది.

ఇంత విలువైన జీవితాన్ని మరింత స్వేచ్ఛగా, మరింత ఆనందంగా అనుభవించాలి.

"నేను స్వేచ్ఛాజీవిని" అని పెద్దగా అరవాలనిపించింది ఆనంద్‌కి. అతికష్టంమీద ఆ కోర్కెని అవుకున్నాడు. అయితే నిశ్శబ్ద నిశీధిని చీల్చుకుంటూ మరోరకమైన కేకలు అతని చెవిసోకాయి.

"రక్షించండి... రక్షించండి!"

పోరాటానికి సిద్ధమవమని హెచ్చరిస్తున్న సంకేత స్వరం.

'హెల్ప్! హెల్ప్! రక్షించండి!'

గేటుదగ్గర నిలబడి మాట్లాడుకుంటున్న స్త్రీలు మాటలాపి కేకలు వినిపిస్తున్నవైపు పరికించి చూడటం గమనించాడు ఆనంద్.

'మొద్దుల్లా నిలబడి చూస్తారేం... పరిగెత్తండి. ఆపదలో ఉన్న ఓ అబలుణ్ణి రక్షించండి. తరువాత మీ పాడెలు కట్టించుకోండి. అవకాశముంటే మిమ్మల్ని రేప్‌చేసి చంపేవాళ్ళం. మీకంత భాగ్యంలేదులే. వెళ్లండి! చావండి!' కసిగా మనస్సులో తిట్టుకోసాగాడు ఆనంద్.

'హెల్ప్! ప్లీజ్... రక్షించండి...'

ఆగకుండా మరింత బిగ్గరగా కేకలు వినిపించసాగాయి. గేటువద్ద స్త్రీలు ఒకరి ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు. యూనిఫారంలోవున్న సెంట్రీ తుపాకి గురిపెట్టి ముందుకి పరుగెత్తింది. రెండో యువతి కూడా ఆమె వెనకాలే పరుగెత్తింది.

"గెట్‌రెడీ" ఆనంద్ తన అనుచరుల్ని హెచ్చరించాడు.

ఇద్దరు స్త్రీలూ రోడ్డు దాటగానే ఆనంద్ ఒక్కసారిగా ముందుకి దూకి స్టేషన్‌గేటువైపు పరుగుతీస్తూ- "కమాన్... ఫాలోమీ" అని అరిచాడు. మిగతా వాళ్ళంతా ఆనంద్ వెనుక పరుగుతీశారు. రోడ్డుదాటి గేటు చేరే సమయానికి దూరంగా రోడ్డుమీద ధన్‌ధన్‌మంటూ చప్పుడు వినిపించింది.

ఆనంద్ ఒక్కక్షణం ఆగి రోడ్డువంక చూశాడు. దాదాపు రెండు ఫర్లాంగుల దూరంలో మోటార్‌సైకిల్ హెడ్‌లైట్ కనపడ్డది. ఆగి దాన్ని గురించి ఆలోచించే వ్యవధిలేదు. వచ్చేది ఏ పోలీస్ జీపో, ట్రక్కో కానందుకు సంతోషించాడు. రోడ్డుకవతల నుండి కేకలు వినబడుతున్నాయి. తలతిప్పి పవర్‌స్టేషన్ వంక చూశాడు. లోపల్నుంచి ముగ్గురు స్త్రీలు వస్తున్నారు. ఒకామె యూనిఫాం ధరించి తుపాకి పట్టుకునివుంది. బయట కనబడని రెండవ సెంట్రీ ఆమే కాబోలనుకున్నాడు ఆనంద్.

"ఎటాక్ దెమ్" అని పిచ్చిగా అరుస్తూ ముందుకు దూకాడు ఆనంద్.

సెంట్రీ చేతిలోని తుపాకి ధన్‌మంటూ పేలింది. చావు కేకపెట్టి ఒక వ్యక్తి కూలిపోయాడు. మిగతావాళ్ళు ఆ ముగ్గురు స్త్రీలతో కలబడ్డారు. రోడ్డుకవతలున్న వాళ్ళు తమ పనిముగించుకుని స్టేషన్ వైపు పరుగుతీస్తున్నారు. తన వాళ్ళతో ఫైట్‌చేస్తున్న ఆ ముగ్గురివంకా చూశాడు ఆనంద్. చేతిలో ఏ ఆయుధమూ లేకుండా కర్రలూ, ఇనుపకడ్డీలతో దాడిచేస్తున్న పురుషుల్ని చాకచక్యంగా ఎదుర్కొంటున్న వాళ్ళ ధైర్యాన్ని మనస్సులోనే అభినందిస్తూ మెయిన్‌స్విచ్‌లు ఎక్కడున్నాయో వెతకటం ప్రారంభించాడు.

జట్టులోని మిగతావాళ్ళు స్టేషన్‌లోపలికి ప్రవేశించారు. వాళ్ళ వెనకనే మోటార్‌సైకిల్ కూడా వచ్చింది. మోటార్‌సైకిల్ మీది స్త్రీని ముగ్గురు ఎటాక్‌చేశారు. అలాంటిదేదో జరుగుతుందని ఊహించినట్లుగా ఆ స్త్రీ ఒక్క ఉదుటున మోటార్‌మీదినుండి నేర్పుగా దూకి వాళ్ళతో తలపడ్డది. ఆమె పోరాడుతున్న తీరు ఫైటింగ్‌లో ఆమె దిట్ట అని తెలియజేస్తోంది. ఒక్క నిమిషంలో ఆమెని ఎటాక్ చేసిన ముగ్గురూ బాధతో మూలుగుతూ కిందపడి గిలగిల తన్నుకోసాగారు.

మెయిన్ స్విచ్ కనుక్కొని దాన్ని ఆపే ప్రయత్నంలో ఉన్న ఆనంద్ ఆమె కంటబడ్డాడు. ఆమె వేగంగా అటు పరుగెత్తింది. పదిమంది పురుషులు చుట్టూచేరి ఇనపకడ్డీలతో తీవ్రంగా కొడుతూ ఆ ముగ్గురు స్త్రీలనీ దాదాపు చంపేశారు. ఆనంద్ మెయిన్ స్విచ్ ఆపెయ్యటమూ, కొత్తగా వచ్చిన స్త్రీ అతనిమీద దూకటమూ ఒకేసారి జరిగాయి.

పవర్‌కట్ కావటంతో ఒక్కసారిగా ఆ ప్రాంత మంతా గాడాంధకారంలో మునిగిపోయింది.

"పరుగెత్తండి... పరుగెత్తండి" అంటూ ఎవ రో బిగ్గరగా కేకలుపెట్టారు. తమతో తెచ్చుకున్న టార్చిలైట్ల వెలుతురుతో అందరూ పరుగె త్తటం మొదలుపెట్టారు.

"ఆగండి... కొంతమంది ఇటురండి. నన్నె వరో పట్టుకున్నారు" గొంతు చించుకుని భయంతో కేకలు పెట్టాడు ఆనంద్.

అతని అరుపులు వినబడుతున్నా ఎవరూ ఆగలేదు. భయంతో ఆనంద్ గుండెలది రాయి. ఇప్పటివరకూ పడ్డ శ్రమంతా ఈ మూర్ఖులమూలంగా నాశనమవుతుందా? ఒంటరిగా తనమీద కలబడుతున్న స్త్రీని ఎంత సేపు తనాపగలడు. ఆమె మెయిన్ మళ్ళీవేస్తే ఏంజరుగుతుంది. గోడదాటటానికి ప్రయత్ని స్తున్నవాళ్ళంతా పిట్టల్లా కాల్చివేయబడతారు. ఏంచెయ్యాలి? ఒక్క పదినిమిషాలైనా ఈమెని ఆపగలగాలి. ఎంత బాధకైనా ఓర్చుకోవాలి.

తనతో కలబడుతున్న స్త్రీని గట్టిగా వాటేసు కున్నాడు ఆనంద్. ఇద్దరూ కిందపడ్డారు. అత నిపట్టు విడిపించుకోవటానికి ఆమె తీవ్రంగా ప్రయత్నిస్తోంది. పిడికిళ్ళతో పొడుస్తోంది, మోకాళ్లతో కుమ్ముతోంది. అయినా అతను పట్టువదల్లేదు. చివరికి అతని జుట్టు పట్టు కుని బలంగా గుంజింది.

ఆనంద్ మాడంతా విపరీతమైన మంటపు ట్టింది. తల పైచర్మంతోసహా వూడివచ్చినంత బాధకలిగింది. కళ్లమ్మట నీళ్లొచ్చాయి. జుట్టు పొడవుగా వుండటం ఎంత అనర్థమో అతనికి బాగా తెలిసొచ్చింది. అయినా అతను పట్టువ దల్లేదు. అతనితో పోరాడుతున్న స్త్రీ అతని పట్టుదలకి కొంచెం ఆశ్చర్యపడ్డది. శతవిధాల ప్రయత్నించినా విడిపించుకోవటానికి వీలుకా కపోవటంతో చివరికామె విసిగి మోకాల్తో బలంగా అతని వృషణాలమీద పొడిచింది.

కెవ్వున కేకపెట్టి బాధతో గిలగిలలాడుతూ పట్టువదిలాడు ఆనంద్. ఆమె లేచి మెయిన్ బాక్స్‌వంక వెళ్లింది. జేబులోనుంచి అగ్గిపెట్టె తీసి పుల్ల వెలిగించి ఆ వెలుతుర్లో మెయిన్ ఆన్‌చేసింది. లైట్లు వెలిగాయి.

"అంతా అయిపోయింది. వెధవలు, మూ ర్ఖులు, కోరి చావుతెచ్చుకున్నారు." అంటూ బాధ అనుభవిస్తూనే గొణుక్కోసాగాడు ఆనంద్.

వాళ్ల పథకాన్ని భగ్నం చేసిన యువతి పరుగెత్తుకుంటూవెళ్లి వంటినిండా గాయా లతో, రక్తసిక్తమైన శరీరాలతో అచేతనంగా పడివున్న స్త్రీలని పరీక్షించసాగింది. ముగ్గురిలో ఎవ్వరూ బతికిలేరు. ఆమెలేచి కళ్లు మూసు కుని మౌనంగా ఒక నిమిషం నిలబడ్డది.

"స్త్రీ జాతి గర్వపడేవిధంగా వీరమరణాన్ని పొందిన మీరు ధన్యులు. మహాభగవతి మిమ్మ ల్ని తనలో ఐక్యం చేసుకుంటుంది" అంటూ మనస్సులోనే మరణించిన సాటి స్త్రీలకు జోహార్ల ర్పించింది.

హఠాత్తుగా గాలివాలుకు వేగంగా తుపాకీ కాల్పులశబ్దం వినిపించింది.

"అవి మెషీన్‌గన్‌లే. కనీసం ఒక్కర్నయినా గోడదాటించి మాకు స్వేచ్ఛ ప్రసాదించు భగ వంతుడా! దారుణం! ఘోరం! పిట్టల్లా కాల్చి పారేస్తున్నారు. ఒక్క చిన్న పొరపాటుకి మొత్తం అందరూ ప్రాణాల్ని బలిచేసుకుంటున్నారు" కళ్లు మూసుకుని పంటి బిగువున బాధను భరిస్తూ మనస్సులో అనుకున్నాడు ఆనంద్.

మృతదేహాలవద్దనున్న స్త్రీ నెమ్మదిగా ఆనంద్ వద్దకొచ్చింది. ఒకపక్కకు పడివున్న అతన్ని వెల్లకిలా తిప్పింది. ఆనంద్ కళ్లు తెరిచిచూశాడు. అతని ముందున్నది చండిక.

★ ★ ★

ఈ సృష్టికి అర్థమేమిటి? భూమ్యాకాశాలు, గ్రహాలు, నక్షత్రాలు అనంతవిశ్వంలో గతి తప్ప కుండా ఎలా వుండగలుగుతున్నాయి? సృ ష్టించే భగవంతుడు నిజంగా వున్నాడా? లేక పోతే ఇదంతా ఎలాసాధ్యం? నిజంగా దేవు డంటూవుంటే, అతను కరుణామయుడైతే మనుషుల జీవితాల్లో ఇన్ని కష్టాలెందు కుండాలి! అసలు సృష్టికర్తను దేముడని పురు షునిగా ఎందుకు తీసుకోవాలి?

ప్రమదావనిలో అందరూ మహాభగవతి ఈ ప్రపంచాన్ని సృష్టించిందంటారు. ఏది నిజం? ప్రపంచంలో ఇప్పటివరకూ వచ్చిన ప్రవక్త లందరూ పురుషులే కాబట్టి సృష్టికర్తను వాళ్లు

పురుమడిగా వూహించుకున్నారు. అంటే ఈ దేవుళ్లందరూ మానవ కల్పితాలేనా? బహుశ జంతువులు ఆలోచించగలిగితే అవి వాటిరూ పాల్లో దేవున్ని వూహించకుండా వుంటాయా? కుక్కలకు కుక్కదేముడు, పిల్లులకు పిల్లిదేముడు, పందులకు పంది దేముడు.

దేముడున్నాడనుకున్నా అతన్ని ఆరాధించటమెందుకు? ప్రాణం ఇచ్చిందుకు కృతజ్ఞత ప్రకటించుకోటానికా లేక పూజించకపోతే కష్టాలు పెడతాడని భయమా! పూజలందుకుని సుఖాలిచ్చేవాడు మహాత్ముడు కాదు- క్రూరుడైన నియంత. నిర్మలమైన కృతజ్ఞత మనస్సులోవుంటే సరిపోదూ. జుట్టిస్తే కరుణించే దేముడూ, నైవేద్యాలకూ, కానుకలకూ ప్రసన్నమయ్యే దేవుడూ, బలులకూ, భజనలకూ లొంగిపోయే దేవుడూ ఎలాంటివాడు!

ఎంత మూర్ఖం! ఎంత నీచం! మనిషి ఈ మూర్ఖత్వంనుంచి బయటపడలేడా? తెలివైన వాళ్లకి తెలివితక్కువవాళ్లని అజ్ఞానంలో వుంచటం ఎంతో లాభం. తియ్యని మత్తు మాటల్తో అజ్ఞానాన్ని పంచిపెడతారు. పొరుగువాడు దుర్భర దారిద్ర్యంలో వుంటే పట్టించుకోనివాళ్లు బైబిళ్లూ, గీతలూ, ఖురాన్‌లు అచ్చేయించి పంచటానికి లక్షలు ఖర్చుపెడతారు.

దేముడి గురించి వదిలేసినా మనిషి జీవితానికి అర్థమేమిటి? పుట్టటం, చావటం, బతికినన్నాళ్లూ కుళ్లు కుతంత్రాలు, బాధలు, కన్నీళ్లూ. ఇంత ప్రగతి, విజ్ఞానం సంపాదించిన మనిషి ఏం సుఖపడగలుగుతున్నాడు. నిజమైన స్వేచ్ఛ, ఆనందం ఎంతమంది అనుభవించగలుగుతున్నారు. స్వేచ్ఛ, సమానత్వాల గురించి ఎన్ని గ్రంథాలు రాసినా, ఎన్ని ప్రసంగాలు చేసినా అవి ఎంతమందికి లభిస్తున్నాయి? దీనికంతటికీ ఎవరు బాధ్యులు? లోపం ఎక్కడుంది?

పది సంవత్సరాలుగా జైల్లో మగ్గుతున్న ఆనంద్ జీవితం గురించి రకరకాలుగా తాత్విక చింతనచేస్తూ సాధువుగా మారిపోయాడు. ప్రమదావని నుంచి తప్పించుకునే పథకం విఫలమవటంతోపాటు అందులో పాల్గొన్న ఇరవైమంది మరణించారు. మిగిలినవారు కోర్టులో విచారించబడి యావజ్జీవ కారాగారశిక్ష విధించబడ్డారు.

జైలు జీవితపు దుర్భర బాధల్ని తట్టుకుని ఇంకా జీవించివుంది ఆనంద్ ఒక్కడే. నిద్రాహారాలు సరిగ్గాలేక మనిషి బాగా చిక్కిపోయి ఎముకల గూడులా వున్నాడు. బాగా పెరిగిన గడ్డమూ, మీసాలూ, తల వెంట్రుకలు నెరిసి అట్టగట్టి చూడటానికి అసహ్యంగా, భయంకరంగా వున్నాయి. అతని ముఖంలో కనబడుతున్నవి గుంటలువడి పీక్కుపోయిన జీవంలేని కళ్లు మాత్రమే.

జైల్లోని అందరూ అతన్ని పిచ్చివాడిగా భావించేవాళ్లు. కానీ అతని మూలంగా ఎటువంటి ప్రమాదమూలేదు కాబట్టి పిచ్చాసుపత్రికి పంపటమో, ఒంటరి ఖైదులో వుంచటమో చేయలేదు. చెప్పినపని మౌనంగా చక్కగా చేసేవాడు. ఎవరితోనూ మాట్లాడేవాడుకాదు. ఒంటరిగా ఒక మూల కూర్చుని ఆలోచిస్తూ తనలోతానే గొణుక్కుంటూ అప్పుడప్పుడూ పెద్దగా నవ్వుకుంటూ వుండేవాడు.

బయటి ప్రపంచం మాటెలావున్నా కనీసం ప్రమదావని విశేషాలుకూడా అతనికెన్నడూ తెలియలేదు. తెలుసుకోవాలనే కోరికకూడా అతనిలో లేదు. ఏదో ఒక విధంగా తను రక్షింపబడతాడనే ఆశ మొదట్లో అతనికి కొంచెం వుండేది. ఇప్పుడు కనీసం అటువంటి ఆలోచనలు కూడా రావటంలేదు. ఎప్పుడైనా తనని చూడటానికి చండిక వస్తుందేమో, తన ద్వారా కలిగిన బిడ్డని చూపిస్తుందేమోనని కొన్నాళ్లు ఎదురుచూశాడు. పోనుపోను చండికను పూర్తిగా మర్చిపోయాడు. అంతకుముందే స్మృతిపథంలో నుండి పార్వతి రూపు పూర్తిగా చెదిరిపోయింది. చావుకోసం సహనంగా ఎదురుచూస్తున్న జీవచ్ఛవం అతను.

మరో రెండు సంవత్సరాలు గడిచింతర్వాత ఒకనాడు అతన్ని జైలు అధికారిణి ముందు హాజరుపరిచారు. దర్పంగా కాలుమీద కాలువేసుకుని సిగరెట్ తాగుతూ కుర్చీలో చేరగిలపడి కూర్చున్న జైలు వార్డెన్ ఆనంద్‌ని పైకీ కిందికీ పరికించి చూసింది.

"ఒరేయ్ ముసలోడా... నీకో శుభవార్త" అతని ముఖం మీదకు పొగవూదుతూ ఉల్లా

నంగా అన్నదామె.

ఆనంద్ తలవంచుకుని మౌనంగా నిల్చు న్నాడు. ఆ పొగవాసన భరించటం కష్టమని పించింది.

"పదమూడేళ్లకోసారి వచ్చే మహాభగవతి నగ్నదర్శనోత్సవం సందర్భంగా నిన్ను విడుద లచేయటానికి అనుమతి వచ్చింది. నువ్విక స్వేచ్ఛగా వెళ్లిపోవచ్చు. వెళ్ళి మహాభగవతిని దర్శించుకుని ముక్తిపొందు" అన్నదామె పరి హాసంగా.

ఆనంద్ కదలకుండా అట్లాగే నిలబడ్డాడు. స్వేచ్ఛ లభించబోతుందన్న సంతోషం అతని ముఖంలో ఏకోశానా లేదు.

"ఏరా... చూడబోతే నీకీ జైల్లోనే బాగున్న ట్లుంది. పోవాలని లేదా?" అంత మంచి వార్త చెప్పినందుకు సంతోషించకుండా నిర్వికా రంగా నిలబడ్డ అతన్ని చూస్తే వళ్లు మండిందామెకు.

ఆనంద్ తలఎత్తి ఆమెవంక చూశాడు. చిన్నగా నవ్వాడు.

"ఎక్కడికెళ్లను. ఈ చిన్న జైల్లో నుండి మరింత పెద్ద జైల్లోకా. వద్దు... నన్నిక్కడే వుండనివ్వండి. నాకే స్వేచ్ఛా అక్కర్లేదు" అన్నాడు గొణుగుతున్నట్లుగా.

అతని ధోరణి ఆమెకు చిరాకు కలి గించింది.

"అందరూ ఎప్పుడెప్పుడు జైల్లో నుంచి బయటపడదామా అని ఎదురుచూసేవారైతే నువ్విక్కడే ఛస్తానంటావేం! నిన్ను విడుదల చెయ్యమని ఆర్డర్లొచ్చాయి. నిన్నిక్కడుంచే అధికారం నాకులేదు. పో... శుభ్రంగా స్నా నంచేసి మంచిబట్టలేసుకుని ఏడువ్. ఇట్లా వెళ్లావంటే పిల్లలు దయ్యమనుకుని దడుచు కుంటారు" తీసుకెళ్లమన్నట్లు తల వూపిందామె.

అతనిచేత శుభ్రంగా తల స్నానంచే యించి, మంచిబట్టలు ధరింపజేసి వద్దంటు న్నా కొంత డబ్బు చేతిలోపెట్టి జైలు ఆవరణ బైట వదిలిపెట్టారు. చాలాసేపు అతనక్కడే చెట్టుకింద కూర్చున్నాడు. ఏం చెయ్యాలో అర్థంకాలేదు. ఎక్కడికెళ్లాలి? ఎలా బతకాలి? అసలు బతికే అవసరమేముంది. కానీ బతక్క చేసేదేముంది. చావాలి! ఎలా? తనే ప్రయత్న మూ చెయ్యకూడదు. చెప్పాపెట్టకుండా వచ్చిన ప్రాణం ఎప్పుడో దానంతటదే పోతుంది. పోనీ! దానిష్టమొచ్చినప్పుడదే పోతుంది. చావు బతు కులు రెండూ తనకు సమానమే. చచ్చిసా ధించేదీ లేదు... బతికి ప్రయోజనమూ లేదు.

అలా కూర్చుని కూర్చుని విసుగుపుట్టి లేచి నడవటం ప్రారంభించాడు. మధ్యాహ్నంవేళ ఎండ తీవ్రంగా వుంది. దారీ తెన్నూలేకుండా నడుస్తున్నాడు. ఈ పన్నెండేళ్లకాలంలో చాలా మార్పులొచ్చినట్లనిపించింది. తిరిగే కొద్దీ తనకు పరిచయమున్న ప్రాంతాలన్నీ లీలగా గుర్తుపట్టసాగాడు. బస్‌స్టేషన్, మార్కెట్, సిని మాహాళ్లు-- అన్నీ అలాగే వున్నాయి. అంతక్రి తంలేని కొత్తవి అనేకం వచ్చాయి. తిరిగి తిరిగి మహాభగవతి ఆలయం చేరుకున్నాడు. ఆల యంలోని కోనేటివద్దకెళ్లి కాళ్లు, ముఖం కడు క్కుని దాహం తీర్చుకున్నాడు.

అలసట అనిపించింది. దూరంగా ఉన్న ఒక చెట్టుకింద మేను వాల్చాడు. అలసిన మేను నిద్రలోకి జారుకుంది.

పెద్దగా వినబడుతున్న మేళతాళాల మోత కి మేలుకున్నాడు ఆనంద్. సాయంత్రమైంది. ఆకాశమంతా దట్టమైన మబ్బులతో కప్పబడి ఏక్షణాన్నయినా వర్షం కురిసేటట్లుంది. ఊరే గించటానికి మహాభగవతి విగ్రహాన్ని రథం మీదకి చేరుస్తున్నారు.

ఆలయమంతా రకరకాల స్త్రీలతో కోలాహ లంగా ఉంది. వీనుల విందు చేస్తున్న మహాభ గవతి దివ్యమంగళ విగ్రహానికి లేచి నిలబడి నమస్కరించి ఆలయం వెలుపలికి నడిచాడు ఆనంద్. అనాలోచితంగా అతని కాళ్లు చండిక ఇంటివైపు దారితీశాయి.

ఇల్లు తేలిగ్గానే గుర్తుపట్టాడు. చండిక ఇంకా ఆ ఇంట్లోనే నివసిస్తోందా? ఒకవేళ ఉంటే తనని చూసి గుర్తుపడుతుందా? ఆదరి స్తుందా? ఆమె ఆదరణ పొందాలని తనిక్కడికొ చ్చాడా? కాదు... అది నిజం కాదు. తనకెవరి దయాదాక్షిణ్యాలూ అక్కర్లేదు. తిరిగి వెళ్ళిపో దామనుకున్నాడు. కానీ కుతూహలాన్ని చంపు కోలేక గేటు ముందు నిలబడి లోపలికి తొంగి





చూశాడు. వరండాలో ఎవరో కుర్చీలో కూర్చుని ఉన్నారు. చండిక కాదు. ఎవరో పురుషుడు. పిల్లాడిలా ఉన్నాడు. చండిక కొడుకై ఉంటాడా?

''బాబూ'' చిన్నగా పిలిచాడు.

కుర్చీలో కూర్చుని ఏదో చదువుకుంటున్న ఆపిల్లవాడు తలతిప్పి చూశాడు. గేటువద్ద ఉన్న ఆనంద్‌ని చూసి లేచి దగ్గరకొచ్చాడు.

''ఎవరు కావాలి?''

''ఈ ఇల్లు చండిక గారిదేనా బాబూ?''

''అవును... ఎందుకు?''

''ఆమె మీ అమ్మగారేనా?''

''అవును. ఇంతకీ నువ్వెవరు?''

''అమ్మ ఇంట్లో ఉందా?''

''లేదు''

''నీకు అక్కచెల్లెళ్ళుగానీ, అన్నదమ్ములు గానీ ఉన్నారా బాబూ?''

''లేరు... ఇంతకీ నువ్వెవరయ్యా?'' కొంచెం విసుగ్గా అడిగాడా పిల్లాడు.

ఆనందంతో అతని కళ్ళు అశ్రుపూరితమయ్యాయి. కళ్ళెదురుగా నిలబడ్డ కన్నకొడుకుని తనివితీరా చూసుకున్నాడు. కానీ ఏంలాభం! తన కొడుకొక అర్భకుడిగా, అప్రయోజకుడిగా పెంచబడుతున్నాడు. భారంగా నిట్టూర్చి వెనుదిరిగాడు.

ఏది ప్రయోజకత్వం, ఏది అప్రయోజకత్వం. పురుషుడు సంపాదించకుండా ఇంట్లో ఉండి ఇంటి పనిచేస్తే అప్రయోజకుడు. ఎంత సంపాదిస్తున్నా ఇంటిపని చెయ్యని ఆడది ఆడదేకాదు. ఉద్యోగం పురుషలక్షణం. ఊడిగం చెయ్యటం స్త్రీత్వం. ఎంత అర్థర

హితంగా ఉన్నాయి కట్టుబాట్లు. ప్రతి విషయంలోనూ స్త్రీ పురుషునికన్నా మిన్నని ప్రమదావనిలోని స్త్రీలు రుజువు చేస్తున్నారు.

భిన్నమైన ఈ రెండు ప్రపంచాల్లో ఏది సత్యమైంది? అసలు విశ్వంలో శాశ్వతమైన సత్యమంటూ ఒకటుందా! చావు పుట్టుకలు సత్యాలే. కానీ ఎంతవరకు? ఈ భూమి సమూలంగా నాశనమైతే అప్పుడు చావుపుట్టుకలు అసత్యాలు కావా? ఆది అంతాలు లేని శక్తి పదార్థము ఇవే శాశ్వతమైనవి, సత్యమైనవీ. అవే దేముడు. అవే జీవుడు. వాటికొక గమ్యంలేదు, నియమంలేదు, ఎప్పుడు ఎందుకు ఎలా పరిణామం చెందుతాయో వాటికే తెలియదు. అంతా గుడ్డిగా యాదృచ్ఛికంగా జరిగిపోతుంది.

ఇంత అల్పమూ, యాదృచ్ఛికమైన ఈ జీవితానికిన్ని కట్టుబాట్లెందుకు? పుట్టినందుకు జీవించాలి... తప్పదు. ఉన్న నాలుగురోజులూ ఈర్ష్యాద్వేషాలు, కక్షలు, కార్పణ్యాలు, వ్యత్యాసాలు లేకుండా మనిషి హాయిగా జీవించలేడా? స్త్రీ పురుషభేదాలు, జాతిమత విచక్షణలు- ఎంత మూర్ఖం! ఎంత అవివేకం!

హోరుగాలి వీస్తోంది. ఆకాశం ఉరుములతో, మెరుపులతో నిండిపోయింది. సన్నగా జల్లు ప్రారంభమైంది. అతను నడుస్తూనే ఉన్నాడు. అతని మనస్సంతా ఏదో తెలియని ఆవేశంతో, ఆవేదనతో నిండిపోయింది.

వర్షం పెద్దదై కుండపోతగా కురుస్తోంది. అయినా అతను నడుస్తూనే ఉన్నాడు. దూరంగా ఎత్తైన గోడమీద వరుసగా అమర్చబడిన విద్యుద్దీపాలు కనబడుతున్నాయి. కాలికేదో తగిలి జారి కిందపడ్డాడు ఆనంద్. పూర్తిగా తడిచి ముద్దయిన వళ్ళు బురదతో నిండిపోయింది. అతను లేవటానికి ప్రయత్నించలేదు. కళ్ళు మూసుకుని అలాగే పడుకున్నాడు.

'ఎందుకు లేవాలి? లేచి ఎక్కడికెళ్ళాలి? ఇది నా జీవితానికి చరమరాత్రి. నేను చేసిన ద్రోహాలకి నాకీ దిక్కులేని చావే సరైన శిక్ష. కట్టుకున్న భార్యపట్ల కసాయివాడిలా ప్రవర్తించినందుకు ప్రకృతి మాత విధిస్తున్న మరణదండన. ఓ పంచభూతములారా... నన్ను మీలో ఐక్యంచేసుకోండి. తరతరాలుగా పురుషాహంకారానికి బలైన స్త్రీమూర్తులారా... నన్ను క్షమించండి. ప్రాణాల్ని పణంగాపెట్టి నాకు ప్రాణం పోసిన నువ్వు మరణిస్తే ఒక్కకన్నీటి బొట్టుకూడా రాల్చని ఈ పాపిని ఓ మాతృమూర్తీ మన్నించు'

మొహంమీద పడుతున్న చినుకుల్తో కలిసి ప్రవహిస్తున్నాయి అతని కన్నీళ్ళు. హఠాత్తుగా ఆకాశంలో ప్రకాశవంతమైన ఓ మెరుపు మెరిసింది. దిక్కులు పిక్కటిల్లేటట్లు శబ్దం చేసుకుంటూ ఓ పిడుగుపడింది. ఆమోతకు ఆనంద్ గుండెలవిశాయి. కొద్దినిమిషాలపాటు తనెవరో, ఎక్కడున్నాడో అర్థంకాని అచేతనావస్థలో పడ్డాడు.

కాస్సేపటికే తేరుకుని చుట్టూ కలయజూశాడు. అంతా గాడాంధకారంగా ఉంది. అంతకుముందు గోడబారున కనబడ్డ లైట్లు కనబడటంలేదు. ఉండి ఉండి మెరుస్తున్న మెరుపు వెలుగులో పిడుగుపాటుకు పడిపోయిన గోడ అస్పష్టంగా అతని కంటపడ్డది. శక్తినంతా కూడదీసుకుని లేచి మరింత దగ్గరకెళ్ళాడు. నిజంగానే పిడుగుపడినచోట గోడ పైభాగం కొంతపడిపోయి బీటలువారింది. వైర్లు కాలి తెగిపోవటంవల్ల లైట్లు వెలగటంలేదు.

ఒక్కసారిగా అతనికి అమితమైన ఆనందాశ్చర్యాలు కలిగాయి. ఎంత వింత! జాగ్రత్తగా పథకం వేసుకుని తప్పించుకోవటానికి ప్రయత్నించినప్పుడు ఇరవైమంది ప్రాణాల్ని బలిగొన్న ఈ గోడ ఇప్పుడు మరణించాలనుకున్న తనకు దారి చూపించి బతకమంటోంది.

తెగినవైర్లు ఎటుపడి ఉన్నాయోనని జాగ్రత్తగా పరికించి చూశాడు. అతను దాటవలసిన చోటుకి దూరంగానే ఉన్నాయవి. భయం భయంగానే పడిపోయిన గోడరాళ్ళని తాకిచూశాడు. ప్రమాదమేమీలేదు. వాటిగుండా కరంట్ ప్రవహించటంలేదు.

దూరంగా విజిల్స్ వినబడ్డాయి. టార్చిలైట్లు పట్టుకుని ఎవరో వస్తున్నట్లున్నారు. బహుశా సెంట్రీలుకావొచ్చు. ఆలస్యం చేయకుండా పడుతూలేస్తూ పడిపోయిన రాళ్ళమీదుగా గోడెక్కి అవతలిప్రక్కకు దూకాడు. లేని ఓపిక తెచ్చుకుని వేగంగా పరిగెత్తటం మొదలుపె

ట్టాడు. చికట్లో దారితెలియటంలేదు. మెరుపుల వెలుగే అతని మార్గాన్ని నిర్దేశిస్తోంది.

పది నిమిషాల తర్వాత పరుగుమాని నడవటం ప్రారంభించాడు. పొద్దుట్నుంచీ ఏమీ తినకపోవటంవలన విపరీతమైన నీరసంగా ఉంది. అడుగుతీసి అడుగువెయ్యటానికే ప్రయానపడవలసి వస్తోంది. అలాగే తూలుతూ నడకసాగించాడు.

అరగంట తర్వాత అతనికి దూరంగా వీధి లైట్లు కనబడ్డాయి. ఇది మనుషులుండే చోటే. నిర్జనప్రాంతం కాదని ధైర్యం తెచ్చుకున్నాడు. లైట్లు దగ్గరయ్యే కొద్దీ ఇళ్ళు కనబడసాగాయి. దాదాపుగా ఇళ్ళన్నీ క్వార్టర్స్‌లా ఒకే రకంగా వున్నాయి.

అతనికి ఓపిక పూర్తిగా నశించింది. ఇహ నడవలేననుకున్నాడు. ప్రయత్నిస్తే ఎవరైనా ఆ రాత్రికి ఆశ్రయమిస్తారేమోననిపించింది. ఎదురుగా కనబడుతున్న ఒక ఇంట్లోకి ప్రవేశించి వరండాలో నిలబడి పిలవటానికి ప్రయత్నించాడు. నోరు పెగల్లేదు. అతికష్టంమీద తలుపులు దబదబబాది నిలబడలేక కుప్పగా కూలి స్పృహకోల్పోయాడు.



ఉదయం పదకొండుగంటలకి మెల్లగా కళ్ళువిప్పి చూశాడు ఆనంద్. క్రితం రాత్రి జరిగిందంతా లీలగా గుర్తొచ్చింది. తనున్న గదిని కలియచూశాడు. పరిశుభ్రంగా నిరాడంబరంగా ఉందాగది. గదిలో మరెవరూలేరు. మంచం పక్కగా స్టాండ్‌కి వేలాడుతున్న సెలైన్ బాటిల్ చూసి తనకి ట్రీట్‌మెంట్ ఇవ్వటం జరిగిందని గ్రహించాడు.

ఎంత అదృష్టం. చావటం ఖాయమనుకున్న తను బతకబోతున్నాడు. మృత్యువాపని నుండి బయటపడి స్వేచ్ఛ పొందబోతున్నాడు. ఇంతకీ తనకి ప్రాణదానం చేసిన ఆ పుణ్యాత్ములెవరు? ఏంచేసి వాళ్ళ రుణం తను తీర్చుకోగలడు.

"అమ్మా!" బాధతో మూలుగుతూ కష్టపడి లేచి దిండుకానుకుని కూర్చున్నాడు.

అవతలి గదిలోనుంచి ఎవరో నడిచి వస్తున్న శబ్దమైంది. తలతిప్పిచూశాడు. తలుపు తెరుచుకుని లోపలికో స్త్రీ ప్రవేశించింది. వేషధారణలో ప్రమదావని స్త్రీలకూ, ఆమెకూ ఏమాత్రం తేడాలేదు. కానీ ఆమె ముఖం ఎక్కడో చూసినట్లు, బాగా పరిచయమున్నట్లు ఫీలయ్యాడు. ఎవరామె? స్మృతిపథంలో వెనక్కి... ఇంకా వెనక్కి వెళ్ళి ఆలోచించాడు.

"పార్వతి!" హఠాత్తుగా అప్రయత్నంగా అతనినోట వెలువడిందామాట.

అతని దగ్గరకొచ్చిన ఆ స్త్రీ ఒక్కక్షణం నిశ్చేష్టురాలై తొట్రుపడింది. అతని ముఖం వంక జాగ్రత్తగా పరిశీలనగా చూసింది. నెమ్మదిగా ఆమె ముఖంలోని ఆశ్చర్యం తొలగి ఏదో స్ఫురణకు వచ్చింది.

"నువ్వు... నువ్వు ఆనంద్‌వికదూ!" తడబడ్డాయి ఆమె మాటలు.

అవునన్నట్లు తలఊపాడు ఆనంద్. సూటిగా ఆమె కళ్ళలోకి చూడలేక తలదించుకున్నాడు. ఇన్నేళ్ళ తర్వాత ఈ స్థితిలో కనిపించిన తన గురించి ఆమె ఏమనుకుంటుందో? అసహ్యించుకుంటుందా? వెళ్ళగొడుతుందా? ఈమె కంటబడకుండా చచ్చినా బాగుండేది. కానీ ఇప్పుడీమె తన ప్రాణదాత. కృతజ్ఞత తెలుపుకోవటం తన కనీసధర్మం.

"పార్వతీ... నన్ను క్షమించగలవా?" తలెత్తి నిర్వికారంగా ఆమెవంక చూస్తూ అన్నాడు.

"ఎవర్నెవరూ క్షమించనవసరంలేదు. గతాన్ని మర్చిపోండి. నేను వెనుకటి మీ భార్య పార్వతిని కాను. అసలెవరికీ భార్యనుకాను. నాపేరు స్వేచ్ఛామయి. ఆపదలో ఉన్న వ్యక్తిని ఆదుకోవటం మానవధర్మం. నా కర్తవ్యాన్ని నేను నిర్వహించాను.

"మిమ్మల్నిప్పుడొక సాటి మనిషిగా గౌరవిస్తాను... ఆదరిస్తాను. అంతే. దయచేసి నా గురించి వేరేవిధంగా ఊహించుకోకండి. మీరంటే నాకెటువంటి ద్వేషమూలేదు. భయపడకండి'' నిజంగానే ఆమె ముఖంలో రాగద్వేషాల కతీతమైన ప్రశాంతత గోచరిస్తోంది.

అతని హృదయం బాధతో బరువెక్కింది. కళ్ళు మూసుకుని భారంగా నిట్టూర్చాడు.

"మీరు బాగా బలహీనంగా ఉన్నారు. చక్కగా విశ్రాంతి తీసుకోండి. నే వెళ్ళి కాఫీ తీసుకొస్తా''

ఆమె పక్కగదిలోకెళ్ళింది. తను విన్నమాటల్ని మననం చేసుకున్నాడు ఆనంద్.

"నేను వెనుకటి మీ భార్య పార్వతిని కాను. అసలెవరికీ భార్యనుకాను. నాపేరు స్వేచ్ఛామయి''

పార్వతి తనని భర్తగా ఆదరించబోవటంలేదు. అసలెవరికీ భార్యను కాదన్నది. అంటే ఆమె మళ్ళీ పెళ్ళిచేసుకోలేదన్నమాట.

ఆ ఆలోచన అతనికి చెప్పలేని సంతోషాన్ని సంతృప్తిని కలిగించింది. అంతలోనే మళ్ళీ తన ఆలోచనలోని నీచత్వం బోధపడింది.

ఛీఛీ... ఈ మనస్సెంత స్వార్థపూరితమైంది. సహధర్మచారిణిగా పార్వతినేనాడూ గౌరవించలేదు. ఆమె పోతే మరొకర్ని కట్టుకోవచ్చు అనుకున్నాడు. ఇప్పుడామె మళ్ళీ పెళ్ళిచేసుకోలేదంటే తనకెందుకింత సంతోషం? ఆమేదో తన సొంత వస్తువైనట్లు, తన హక్కయినట్లు ఎందుకీ తపన? ఆమె అంగీకరిస్తే మళ్ళీ భార్యగా స్వీకరించి పెత్తనంచెయ్యాలనే కోరికేదో బహుశా తన అంతరాంతరాలలో వుండి వుంటుంది. ఇన్ని అనుభవాలయినా అవకాశం రాగానే బుద్ధి మళ్ళీ వక్రిస్తూనే వుంది. ఎంత నీచ మనస్తత్వం?

కాఫీ కప్పుతో తిరిగొచ్చింది స్వేచ్ఛామయి.

"చిన్న సందేహం... తీర్చుకోవచ్చా?'' కప్పందుకుంటూ అడిగాడు.

"ఏవిషయమైనా నిర్మొహమాటంగా అడగొచ్చు'' అతని మంచంమీదనే ఒక పక్కగా కూర్చుంటూ అన్నదామె.

"మన పాప ఏమైంది?''

"ఏమీ అవలేదు. చక్కగా చదువుకుంటూ ఇక్కడేవుంది. దానిపేరు క్రాంతి. అది కాకుండా నాకు మరో ఇద్దరు పిల్లలున్నారు. ఒక బాబు, ఒక పాప. ఆదివారం అందరూ వస్తారు... చూద్దురుగాని''

ఆమె మాటలు విని మ్రాన్పడిపోయాడు ఆనంద్. కొద్దిసేపటి క్రితం ఎవరికీ భార్యను కానన్నది. ఇప్పుడేమో ఇద్దరు పిల్లలున్నారంటోంది. రెండింటికీ పొంతన కుదరటంలేదు. ఎలా సాధ్యం.

"మీరు మళ్ళీ పెళ్ళి చేసుకోలేదనుకుంటా!'' సందేహంగా అడిగాడు.

ఒకప్పుడు 'ఒసే! ఏమే! దొంగముండ!' అని పిలిచిన వ్యక్తిని ఇప్పుడు 'మీరు' అని పిలవటం కష్టంగా తోచిందతనికి.

స్వేచ్ఛామయి కతని అనుమానం అర్థమైంది.

"నిజంగానే నేను పెళ్ళిచేసుకోలేదు. అసలిక్కడ భార్య, భర్త, పెళ్ళి అనే మాటలకర్థంలేదు. మాతృత్వం స్త్రీ జన్మహక్కు. మనస్సులు కలిసిన స్త్రీ పురుషులు శారీరకంగా ఒకటవుతారు. అయినా ఎవరి జీవితాలు వాళ్ళవే. ఇష్టం లేనప్పుడు విడిపోవచ్చు. పిల్లలు కలిగితే వాళ్ళ బాధ్యత ప్రభుత్వమే వహిస్తుంది. వాళ్ళ విషయంలో ఎటువంటి చింతా వుండదు. భర్తనేపేరుతోనో, భార్యనేపేరుతోనో ఒకళ్ళమీద మరొకరు పెత్తనం చెలాయించాలంటే కుదరదు. ఎవరి వ్యక్తిత్వం వాళ్ళకుంటుంది. ఎవరి సంపాదన వాళ్ళదే'' అక్కడి పద్ధతి వివరించింది స్వేచ్ఛామయి.

ఆ మాటలతనికి రుచించలేదు.

"ఇదేం పద్ధతి. స్త్రీకి తల్లయ్యే హక్కుంటే పురుషుడికి తండ్రయ్యే హక్కు కూడా వుంటుంది. ఆడది తనకిష్టమైన మగాళ్ళందరితోనూ తిరిగితే ఎవరిద్వారా పిల్లల్ని కన్నదో ఎట్లా తెలుస్తుంది. పుట్టినవాళ్ళు తన పిల్లలేనని మగాడెలా నమ్మగలుగుతాడు. ఇంతకంటే నీతిమాలిన పనుంటుందా?'' అసహ్యాన్ని వ్యక్తంచేస్తూ అన్నాడు ఆనంద్.

"నీతి మనిషి జ్ఞానంమీద, ఆర్థిక, సామాజిక

స్థితిగతులమీద ఆధారపడి వుంటుంది. బయటి ప్రపంచంలో తొంభైశాతం మనుషులు పైకి నీతులు చెబుతూ చాటుమాటు వ్యవహారాలు సాగించేవాళ్ళే. నీమటుకు నువ్వు పెళ్ళవక ముందు, అయింతర్వాత ఎంతమంది స్త్రీలతో సంబంధం పెట్టుకోలేదు. నీతి గురించిన ఆలోచన అప్పుడు రాలేదా? నీలాగే నీ భార్యకూడా ప్రవర్తించలేదని నమ్మకమేమిటి? అనుమానించటం మొదలుపెడితే ప్రపంచంలోని ఏ పురుషుడూ స్త్రీ తనద్వారానే సంతానాన్ని పొందిందని ఖచ్చితంగా చెప్పలేడు. ఇక్కడి స్త్రీ పురుషులెవరికీ చాటుమాటు వ్యవహారాలు సాగించాల్సిన అవసరం వుండదు. పరిపూర్ణమైన స్వేచ్ఛ, సమానత్వాలున్నచోట మమతానురాగాలే తప్ప ఈర్ష్యా అసూయలుండవు. నీకిప్పుడివి చెప్పినా అర్థంకావు. విశ్రాంతి తీసుకో' అంటూ వెళ్ళిపోయిందామె.

అర్థంకాని ఆలోచనలతో సతమతమౌతూ నిద్రలోకి జారుకున్నాడు ఆనంద్.

మళ్ళీ అతనికి మెలకువ వచ్చేసరికి పక్కగదిలో నుండి మాటలు, నవ్వులు వినబడుతున్నాయి. కుతూహలాన్ని చంపుకోలేక నీరసపడుతూనే లేచివెళ్ళి తలుపులు తెరిచాడు.

స్వేచ్ఛామయికెదురుగా ఎవరో పురుషుడు కూర్చుని కబుర్లు చెబుతున్నాడు. ఆనంద్‌ని చూసిన ఆమెలో ఎటువంటి మార్పూ రాలేదు.

"రా ఆనంద్... ఇంకా నిద్ర లేవలేదేమో అని ఎదురుచూస్తున్నాను. ఇడుగో, ఇతను నా స్నేహితుడు కరుణాకర్. నిజంగా నీ ప్రాణాలు కాపాడిందితనే. రాత్రి వర్షంలో తడుచుకుంటూ వెళ్ళి డాక్టర్‌గార్ని తీసుకొచ్చాడు" పరిచయం చేసిందామె.

"నమస్తే! ఇప్పుడెలావుంది మీకు?" అన్నాడు కరుణాకర్.

"కొంచెం నీరసంగా వుంది. అంతకంటే ఏంలేదు" ప్రతినమస్కారం చేస్తూ ఖాళీగావున్న కుర్చీలో కూర్చున్నాడు ఆనంద్.

"మీరు మాట్లాడుకుంటూ వుండండి. నేవెళ్ళి పండ్లరసం తీసుకొస్తా" అంటూ లోపలికెళ్ళింది స్వేచ్ఛామయి.

ఏంమాట్లాడాలో తెలియక మౌనంగా కూర్చున్నాడు ఆనంద్. కరుణాకరే మాట కలిపాడు.

"ప్రమదావనినుంచి బయటపడటం అసాధ్యమంటారే. మరి మీరు ఎలా తప్పించుకున్నారు?"

"యాదృచ్ఛికంగా జరిగింది. పిడుగుపాటుకు గోడ కొంచెం పడిపోయింది. నేనప్పుడక్కడే వున్నా. ఎట్లాగో కష్టపడి దాన్ని దాటగలిగా"

"మీరు చాలా అదృష్టవంతులు" అన్నాడు కరుణాకర్.

"పాపం ఆనంద్‌కి నాములానే ఇన్ని కష్టాలొచ్చాయి" అంది స్వేచ్ఛామయి గ్లాసుతో పండ్లరసం తెచ్చి అందిస్తూ.

"ఎన్నికష్టాలుపడ్డా ప్రమదావని నుంచి తప్పించుకున్న ఘనత ఆనంద్‌గారికే దక్కుతుంది" అన్నాడు కరుణాకర్.

"ఈ ప్రాంతం పేరేంటి?" ఇహ ఆ విషయం ప్రస్తావించనివ్వకుండా అడిగాడు ఆనంద్.

"ఇది సమతావని. మొదట్లో ఇదికూడా ప్రమదావనిలో భాగమే. కానీ ఆ తర్వాత ప్రమదావని జీవిత విధానంతో విసుగెత్తిన కొందరు స్త్రీలు ఈ ప్రాంతానికొచ్చి మంచి వ్యవస్థ నేర్పాటుచేసుకున్నారు. ప్రమదావనిలోని పురుషులందరూ ఇటు మొగ్గు చూపుతారనే భయంతో రాకపోకలకి వీల్లేకుండా మధ్యన వాళ్ళు గోడ నిర్మించారు" వివరించింది స్వేచ్ఛామయి.

"స్త్రీలక్కూడా రాకపోకలు నిషిద్ధమేనా?"

"అదేం లేదు. కానీ ఏదైనా ముఖ్యమైన పనివుంటే మాత్రమే మేం అటువెళ్ళి వస్తాం"

"ఇక్కడి పురుషుల్ని బయటి ప్రపంచంలోకి వెళ్ళనిస్తారా?"

ఆ ప్రశ్నకు కరుణాకర్ జవాబు చెప్పాడు.

"వెళ్ళకూడదనేమీ లేదు. కానీ వెళ్ళటానికి మాకే మనస్కరించదు. ఆ మురికి ప్రపంచం అంటే మాకసహ్యం. ఎక్కడచూసినా దుమ్ము, ధూళి, పొగ, మురికివాడలు -- వాటికన్నా కుళ్ళిపోయిన మనుషుల మనస్తత్వాలు. అంతకంటే ఏముందక్కడ? ఎప్పుడన్నా వెళ్ళదల

చుకుంటే బృందాలుగా ఏర్పడి, సుందరమైన ప్రకృతిగల ప్రాంతాలకు వెళతాం''

''అలా వెళ్ళినప్పుడు మీలో ఒక్కరికి కూడా అక్కడే ఉండిపోవాలనిపించలేదా?'' ఆశ్చర్యంగా అడిగాడు ఆనంద్.

''అమృతం రుచిచూసిన తర్వాత గరళాన్నెవరైనా కోరుకుంటారా?'' నవ్వుతూ అన్నాడు కరుణాకర్.

''పోనీ నేనిక్కడి నుంచి వెళ్ళిపోవచ్చా?''

''నాకు తెలియదు. ఇటువంటి పరిస్థితి ఇంతకు ముందెప్పుడూ రాలేదు. ఎవర్నయినా అడిగి తెలుసుకుని చెబుతాను'' అన్నాడు కరుణాకర్.

''రేపటికల్లా ఆనంద్‌గారు కోలుకోవచ్చు. అలాగయితే సెలవు కేన్సిల్ చేసుకొని రేపు డ్యూటీకి ఎటెండ్ అవుతాను'' అన్నది స్వేచ్ఛామయి.

మరో అరగంట కబుర్లుచెప్పి మర్నాడు కలుస్తాననిచెప్పి వెళ్ళిపోయాడు కరుణాకర్.

మర్నాటికి నిజంగానే ఆనంద్ పరిస్థితి బాగా మెరుగైంది. ఉదయాన్నే నిద్రలేచి వరండాలోకి వచ్చిన అతనికి స్వేచ్ఛామయి వ్యాయామం చేస్తూ కనిపించింది. అతన్ని చూసి చేస్తున్న వ్యాయామం ఆపకుండానే ''గుడ్‌మార్నింగ్'' అని విష్ చేసింది.

''రోజూ ఇంతపెందలాడే లేచి, వ్యాయామం చేస్తారా?'' అన్నాడు ఆనంద్ ఆశ్చర్యంగా.

''ఇక్కడి వాళ్ళకు అన్నిటికన్నా పెద్ద వ్యసనం ఆటలాడటం, వ్యాయామం చెయ్యటం. ప్రతి వందమందికి ఒకక్లబ్ ఉంటుంది. రోజూ ఉదయమూ సాయంత్రమూ అక్కడికెళ్ళి ప్రాక్టీస్ చేసుకోవచ్చు'' అందామె ఆ పూటకు తనప్రాక్టీస్ చాలిస్తూ.

''మరిక్కడ కాలక్షేపానికి సినిమాలు, పేకాట క్లబ్‌లూ ఉండవా?''

''సినిమాలుంటాయి -- కానీ రోజుకొక్క ప్రదర్శన మాత్రమే. వాటిపట్ల ఎవరికీ క్రేజ్ ఉండదు. ఇహపోతే పేకాట, జూదంలాంటి వ్యసనాలకిక్కడ తావులేదు. బయటి ప్రపంచంలో ఉన్న లోపమే అది. సిగరెట్ కాల్చటం, మద్యపానం చేయటం ప్రమాదకరమని హెచ్చరిస్తూనే డబ్బుకోసం వాటినుత్పత్తి చేయిస్తుంటారు. అసలవి లేకపోతే ఏగొడవా ఉండదుకదా. ఒక పక్క వాటిని ప్రోత్సహిస్తూ రెండో పక్క శిక్షలు అమలు పరచటం ఎంత అవివేకం''

''అట్లా అన్నిటికీ ఆంక్షలు పెడితే వ్యక్తి స్వేచ్ఛ ఏమవుతుంది? స్వేచ్ఛలేని బతుకు ఏంబ్రతుకు'' అన్నాడు ఆనంద్ నిరసనగా.

''ఉన్న స్వేచ్ఛలేవో అందరికీ సమానంగా ఉండాలి. అవి వ్యక్తులకు, సమాజానికి చేటు కలిగించేవి కాకూడదు. మాకు స్వేచ్ఛలేదని బాధపడేవాళ్ళు, నిరసన ప్రదర్శించేవాళ్ళు ఇక్కడ ఒక్కరుకూడా కనపడరు. రండి... ఓపికేమైనా ఉంటే పనిలో నాక్కాస్త సహాయం చేద్దురుగాని'' అంటూ లోపలికి దారి తీసిందామె.

చకచకా పనంతా ముగించుకుని స్నానం చేసింది. ఇద్దరూ కలిసే ఫలహారం తిన్నారు. ఎనిమిది గంటలకల్లా డ్యూటీకి వెళ్ళటానికి బయల్దేరింది.

''మీ ఉద్యోగమేంటి?'' ఆమేదో తగనిపని చేస్తున్నట్లడిగాడు.

''డిపార్టుమెంటల్ స్టోర్స్‌లో పనిచేస్తాను. నేను మరో తొమ్మిదిమంది కలిసి దాన్ని నిర్వహిస్తాం'' ఒకళ్ళమీద ఆధారపడి బతకాల్సిన అవసరం తనకులేదనే గర్వం తొణికిసలాడిందామె స్వరంలో.

''జీతమెంతుంటుంది?'' కొంచెం వెటకారంగా అడిగాడు.

''ఇక్కడ జీతభత్యాల్లో తారతమ్యాలుండవు. అసలు డబ్బు అవసరం చాలా తక్కువ. కావలసినవన్నీ ఉచితంగానే లభిస్తాయి. రోజుకి ఐదుగంటలు పనిచేస్తే చాలు. ఏరకం పనైనా దాన్ని పనిగానే భావించి గౌరవిస్తారు ఇక్కడి వాళ్ళు. వేతనాల్లో తేడా ఉండదు కాబట్టి ఎవరికీ అసంతృప్తి కలుగదు. అర్హతని బట్టి అవకాశాన్నిబట్టి పని ఇవ్వబడుతుంది. ఏపనీ లేకుండా సోమరిగా తిరిగే వాళ్ళెవరూ ఉండరు''

''ఇది నాది, నాసొంతం అని చెప్పుకోటానికి

వీళ్లేని ఈ బతుకులేం బతుకులు" ఈస డించుకుంటూ అన్నాడు ఆనంద్.

"అలా ఎందుకనుకోవాలి. ఈ సమతావని నాది. ఈసమాజం, ఈ మనుషులందరూ నావాళ్ళు. మనిషిగా పుట్టినందుకు సమాజ పురోగతికి నావంతు పాత్ర నేను నిర్వహిస్తున్నాను. అందుకు నేను గర్విస్తున్నాను. ఇప్పుడు నీతో మాట్లాడుతూ కాలక్షేపం చేసే టైమ్ లేదు. నేవెళుతున్నా... సాయంత్రం నాలుగింటికల్లా వచ్చేస్తా. నీవరకు వంటచేసి ఉంచా. ఆకలైనప్పుడు వడ్డించుకుతిను. పోతే ఈ వీధి చివర సెలూన్ వుంది. వెళ్ళి ఆ జుట్టుభారం వదిలించుకో"

ఆమె వెళ్ళిం తర్వాత కాస్సేపు బద్దకంగా కూర్చున్నాడు ఆనంద్. తరువాత సెలూన్ కెళదామని బయల్దేరాడు. అప్పటివరకూ అతను స్వేచ్ఛామయి ఇచ్చిన నైట్‌డ్రస్ లోనే ఉన్నాడు. కొద్దిగా కురచగావున్నా బాగానే సరిపోయాయి. వాటితో బయటికి వెళ్ళటానికి కొంచెం సంకోచించాడు. మామూలు బట్టలు వేసుకెళ్ళినా తనజుట్టు చూసి నవ్వుతారు కాబట్టి ఇప్పుడే వెళ్ళటం మంచిదనుకుని బయల్దేరాడు. ఇంటికి తాళం వేద్దామని చూస్తే తాళమంటూ ఎక్కడా కనిపించలేదు. తలుపులు గడియపెట్టి రోడ్డు మీదకెళ్ళాడు.

అందరూ పనుల్లోకి వెళ్ళటంవలన వీధుల్లో జనసంచారం తక్కువగా ఉంది. తనకెదురుపడిన మొట్టమొదటి వ్యక్తిని సెలూన్ ఎటుందో అడిగాడు. అతను ఆనంద్‌వంక వింతగా చూస్తూ ఎటువెళ్ళాలో చెప్పాడు. అతను చెప్పిన గుర్తుల ప్రకారం తేలిగ్గానే సెలూన్ని కనుక్కోగలిగాడు ఆనంద్.

సెలూన్ ముందు సిమెంట్ బెంచిమీద ఒక స్త్రీ, ముగ్గురు పురుషులు కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆనంద్ రాకతో వాళ్ళు మాటలాపి అతనివంక గుడ్లప్పగించి చూడసాగారు. ఆ నలుగురూ యాభై ఏళ్ళు పైబడినవాళ్ళే.

"భయపడకండి... నేనూ మీలాంటి మనిషినే. ప్రమదావని నుంచి తప్పించుకొచ్చాను" అన్నాడు బలవంతాన నవ్వు ముఖంపెట్టి.

ఆ నరికే లోపల క్షవరం చేస్తున్నవాళ్ళు, చేయించుకుంటున్నవాళ్ళు ఆ వింతమనిషిని చూట్టానికొచ్చారు.

"ప్రమదావనినుంచి వచ్చావా? అందుకే ఇంత బలహీనంగా ఉన్నావు. పాపం ఎన్నికష్టాలుపడివచ్చావో. అక్కడి మా స్త్రీలు స్త్రీలుకాదు, రాక్షసులయ్యా. వాళ్ళ తరపున నేను క్షమాపణలు చెప్పుకుంటున్నాను" అక్కడ కూర్చున్నామె అన్నది.

"ఇహ నువ్విక్కడ ప్రశాంతంగా బతకొచ్చు. నీకేమైనా సహాయం కావాలంటే చెప్పు చేస్తాను" అన్నాడు మరోవ్యక్తి.

"అబ్బే... అవసరం లేదండి. స్వేచ్ఛామయి అని ఇదిగో ఈ వీధిలోనే ఉంటోంది. నన్నాదుకుని ఆశ్రయం ఇచ్చింది" అన్నాడు ఆనంద్ కృతజ్ఞతా పూర్వకంగా.

"మాకు తొందరేం లేదులే. ముందు మీరెళ్ళి క్షవరం చేయించుకోండి. చూడటానికే ఘోరంగా ఉంది. పాపం ఇన్నాళ్ళిలా భరించారో!" మరో వ్యక్తి అన్నాడు.

అందరూ అతన్నాదరించి సానుభూతి ప్రకటించారే తప్ప ఒక్కరూ అసహ్యించుకోలేదు. చక్కగా క్రాఫ్‌చేసి గడ్డం మీసాలు తీసేశారు.

"ఇప్పుడు మీరు చక్కగా ఉన్నారు. ఇంతకీ మీపేరేంటి" అతని హెయిర్‌కట్ చేసిన యువతి అడిగింది.

"ఆనంద్" అన్నాడతను నిజంగానే ఆనందం ప్రకటిస్తూ.

పన్నెండేళ్ళ తర్వాత తన మొహాన్ని పూర్తిగా చూసుకున్నాడతను. వెంట్రుకల భారంవదలి చాలా హాయిగా ఫీలయ్యాడు. ఇంటికొచ్చి స్నానం చేసిన తర్వాత మరింత హాయనిపించింది. భోంచేసి కాస్సేపు నిద్రపోయాడు.

సాయంత్రం నాలుగుంబావుకల్లా స్వేచ్ఛామయి వచ్చేసింది.

"అమ్మయ్య... ఇప్పుడే ఇబ్బందిలేకుండా మిమ్మల్ని చూడాలనిపిస్తోంది" అన్నది సంతోషంగా.

ఆనంద్ కొంచెం సిగ్గుపడ్డాడు.

"ఇవిగో! ఏదో నాకు చేతనైనట్లు సెలక్ట్

చేసుకొచ్చా. మీకు సరిగ్గానే సరిపోవచ్చు'' అంటూ నాలుగు జతల దుస్తులు చూపించింది.

ఒకప్పుడు తనామె అవసరాల్నేమీ పట్టించుకోలేదు. ఆమెమీద డబ్బు ఖర్చుపెట్టటం దండుగని భావించేవాడు. ఇప్పుడు తనామెకేమీకాడు. కానీ ఎంత ఆదరం చూపిస్తోంది. నిజంగా మనుమలింత మంచిగా ఉండగలరా? తనైతే ఆ పరిస్థితిలో ఎలా ప్రవర్తించి ఉండేవాడు?

అతనిలో పశ్చాత్తాపం చోటు చేసుకుంది.

''మీరు డ్రస్ మార్చుకోండి. నేను కాస్త కాళ్ళు మొహం కడుక్కొస్తా. క్లబ్‌కెళదాం'' అంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళిందామె.

పది నిముషాల తర్వాత ఇద్దరూ క్లబ్‌కి బయల్దేరారు.

''తాళం ఎక్కడుంది? పొద్దున్న ఎంతవెతికినా కనిపించలేదు'' అన్నాడు ఆనంద్.

''దొంగలుండే చోట తాళాలు కావాలి. ఇక్కడ వాటి అవసరంలేదు'' అన్నదామె నవ్వుకుంటూ.

క్లబ్ అక్కడికి దగ్గరే అవటంవల్ల నడుచుకుంటూ వెళ్ళారు. వాళ్ళకంటే ముందే కరుణాకర్ అక్కడికి చేరుకున్నాడు.

''హల్లో! మీరిప్పుడు చాలా బాగున్నారు'' అన్నాడతను ఆనంద్‌తో కరచాలనం చేస్తూ.

''రండి... ముందు కొంచెం కాఫీతాగి ప్లేగ్రవుండ్ కెళదాం'' అన్నది స్వేచ్ఛామయి.

''మీరు వెళ్ళండి. ఇప్పుడే ప్రమీల, నేను వెళ్ళొచ్చాం. ఆమె అటు బ్యాట్‌మింటన్ కోర్టు కెళ్ళింది. అంతలో మీరొచ్చారు'' అన్నాడు కరుణాకర్.

ఆనంద్‌ని క్యాంటీన్‌వైపు తీసుకెళ్ళిందామె.

అక్కడ సర్వ్ చెయ్యటానికి ఎవరూలేరు. క్యూలో నిలబడి వెళ్ళి ఎవరికి కావలసినవి వాళ్ళు తెచ్చుకుంటున్నారు. ఆవేళప్పుడు కేవలం కాఫీ, టీ, బిస్కెట్లు మాత్రమే

ఉంటాయి. కాఫీ త్రాగి ఎవరికప్పులు వాళ్ళు శుభ్రంగా కడిగిపెట్టి వెళుతున్నారు.

"ఎంత మంచి పద్ధతి" అనుకున్నాడు ఆనంద్.

ఇద్దరూ ఒకటేబుల్ ముందు కూర్చుని కాఫీ తాగుతుంటే ఎవరో ఒకతను వెనగ్గావచ్చి స్వేచ్ఛామయి కళ్ళు మూసాడు.

"ఎవరది?" అంటూ చేతులు విడిపించుకుని వెనక్కు తిరిగి చూసిందామె.

"నువ్వా గోపి... ఎక్కడికెళ్ళావ్? నాల్రోజులుగా కనబడకపోతే ఆరోగ్యం బాగా లేదేమోననుకున్నా. మీ ఇంటికి వద్దామంటే తీరిక చిక్కలేదు" అందామె అతన్ని ఆప్యాయంగా చూస్తూ.

"కాలు బెణికి వాచిందక్కా! అస్సలు నడవనివ్వలేదు. ఈ నాల్రోజులు హాస్పిటల్‌లోనేవున్నా" అన్నాడు గోపి.

"ఇరుగో, వీరు ఆనంద్‌గారని ప్రమదావని నుంచొచ్చారు" అంటూ పరిచయం చేసిందామె.

"ఏమిటీ! ప్రమదావని నుంచా! అద్భుతం... మహాద్భుతం! రేపే వార్త మా పత్రికలో వేయించాలి. అసలీ సాహసకృత్యం ఎలా చేయగలిగారో చెప్పండి?" అంటూ ఆనంద్ పక్కన కూలబడ్డాడు గోపి.

"అబ్బ... నీగొడవ ఆపవయ్యా! ఇవ్వాళ ఫుట్‌బాల్ ఆడవా?" అన్నదామె నవ్వుకుంటూ.

"మరో వారందాకా కాలికి విశ్రాంతిచ్చేస్తున్నా" అన్నాడు గోపి కాలివంక చూసుకుంటూ.

"అయితే ఆనంద్‌గార్ని ప్లేగ్రౌండ్ అంతా తిప్పి చూపించు. నేను అట్లా టెన్నిస్ కోర్టుకెళ్తా" అంటూ లేచింది స్వేచ్ఛామయి.

"రండి... ముందు ఫుట్‌బాల్ గ్రౌండ్‌కెళదాం" అంటూ ఆనంద్‌ని లాక్కెళ్ళాడు గోపి.

వయోభేదం, స్త్రీ, పురుష విచక్షణ లేకుండా చిన్నపిల్లల్లా ఉత్సాహంగా, పట్టుదలగా రకరకాల క్రీడల్లో పాల్గొంటున్న ఆ మనుషుల్నిచూస్తూ తనను తానే మర్చిపోయాడు ఆనంద్.

ఎప్పుడో చిన్నతనంలో ఆటలాడేవాడు తను. వయసొచ్చాక స్నేహితుల్తో కలిసి ఏదో ఒక సెంటర్లో నిలబడి వచ్చేపోయే ఆడవాళ్ళని గుచ్చిగుచ్చి చూస్తూ జోక్స్ వెయ్యటమో, సినిమాల కబుర్లు చెప్పటమో చేసేవాడు. మరింత పెద్దయ్యాక క్లబ్‌లో పేకాటతోనూ, బార్లో తాగుడుతోనూ అందమైన సాయంత్రాలు వెళ్ళమార్చేవాడు.

గతాన్ని తల్చుకుంటే సిగ్గేసిం దతనికి. యువతని నిర్వీర్యం చెయ్యటానికి కావలసినన్ని సినిమాలు, సెక్స్ పుస్తకాలు, బార్లు, వేశ్యా గృహాలువుండే ప్రపంచంలో నిష్కల్మషమైన ఆనందం ఎలా వుంటుంది? సోమరితనాన్ని లేకితనాన్ని ప్రోత్సహించే సమాజం అది. ఇక్కడ వాటికి తావులేదు.

"మీకేం ఆటలొచ్చు?" అడిగాడు గోపి.

"అబ్బే... నాకేవీ సరిగ్గారావు" సిగ్గుపడుతూ అన్నాడు ఆనంద్.

"వాలీబాల్ ఆడగలరా?"

"అమ్మో! వేళ్ళు విరుగుతాయి."

"పోనీ బ్యాట్‌మెంటన్"

"కొద్దిగా తెలుసు"

"అయితేరండి... మీరు కూడా కాస్సేపాడుదురుగాని" అంటూ బ్యాట్‌మెంటన్ కోర్టుకి తీసుకెళ్ళాడు.

అప్పుడే కొత్తగా రెండో గేమ్ మొదలుపెట్టబోతున్నారు.

కోర్టుమధ్యకు వెళ్ళినిలబడి, "ఒక్క నిమిషం. వీరు ఆనంద్‌గారని కొత్తగా ఇక్కడికొచ్చిన మన అతిథి. ఒక గేమ్ వీరిని కూడా ఆడనిస్తారా?" అంటూ అడిగాడు గోపి.

"రండి... నాబదులాడండి" అంటూ దాదాపు ఐదారుగురు బయటికొచ్చారు.

"అబ్బే... వద్దండీ, నాకు సరిగ్గా చాతకాదు" అన్నాడు ఆనంద్.

"ఇదేం బ్రహ్మవిద్యా! రెండు పాట్లు కొడితే అదే వస్తుంది. తీసుకోండి" అంటూ ఒక వ్యక్తి అతనికి బ్యాట్ అందించాడు.

మొదట్లో కొన్ని పొరపాట్లు చేసినా పోనుపోను బాగానే ఆడగలిగాడు. గేమ్ పూర్తయ్యేసరికి అలసిపోయినా ఏదో తెలియని ఉత్సాహం,

ఆనందం కలిగాయి.

"భలేవాళ్ళే... చేతకాదని బ్రహ్మాండంగా ఆడారు" అన్నాడు గోపి మెచ్చుకోలుగా.

చీకటిపడేవేళకి అందరూ ఇళ్ళకు బయల్దేరారు.

"ఇవ్వాళ వంటపనిలేదు. డైనింగ్ హాల్‌కి వెళదాం. ముగ్గురికీ కలిపి మధ్యాహ్నమే ఆర్డర్ చేసేశా" అంది స్వేచ్ఛామయి కరుణాకర్‌ని ఉద్దేశించి.

"అరె! ఎందుకు డబ్బు దండగ? పోనీ నీకు బద్ధకమనిపిస్తే నేవచ్చి వంటచేసేవాణ్ణిగా" అన్నాడతను.

"పోన్లే... ఒక్కరోజుకేముంది. మన డైనింగ్ హాల్స్ ఎలా వుంటాయో ఆనంద్‌గారిక్కూడా తెలుస్తుంది. నువ్వు ఆలస్యం చెయ్యకుండా వెంటనే వచ్చేయ్" అంటూ ఆనంద్‌ని వెంట బెట్టుకెళ్ళింది.



ఇంటికి వెళ్ళి స్నానంచేసి అలా వరండాలో కూర్చునేసరికి కరుణాకర్ తన పనులు ముగించుకుని వచ్చేశాడు.

"మీ విషయం కనుక్కున్నా. ముందు మీరు న్యాయసభకో అర్జీ పెట్టుకోండి. మీ విషయం పరిశీలించటానికి ఒక సంఘాన్ని వేస్తారు. ఆ సంఘం ఇచ్చేసలహా మీద మీరు బయటి ప్రపంచంలోకి వెళ్ళేదీ లేనిదీ ఆధారపడి వుంటుంది" అన్నాడు.

"కొంచెం శ్రమనుకోకుండా ఆ అర్జీ రాసిపెడతారా? ఈ పదమూడేళ్ళుగా ఒక్కసారి కూడా పెన్ను పట్టుకోలేదు"

కరుణాకర్‌లేచి వెళ్ళి పెన్ను పేపర్‌తెచ్చి రాయటం మొదలుపెట్టాడు. పూర్తయింత ర్వాత చదివి వినిపించాడు.

"ఇది పోస్టుచేసే భారం కూడా మీదే" అన్నాడు ఆనంద్ సంతకంచేసి కాగితాన్ని అతనికే తిరిగి ఇచ్చివేస్తూ.

"ఇంక వెళదాం... నాకాకలిగావుంది" అంటూ లేచింది స్వేచ్ఛామయి.

డైనింగ్‌హాల్ చాలా విశాలంగావుంది. వంద మందికిపైగా ఒకేసారి కూర్చుని భోంచెయ్యొచ్చు. అక్కడ కూడా వడ్డించేవాళ్ళెవరూలేరు. వండిన పదార్థాలన్నీ యాంత్రికంగా వడ్డించబడతాయి. ప్లేటు తీసుకెళ్ళి బటన్ నొక్కితే చాలు వంటకాలు ప్లేట్లలోకి వస్తాయి. భోంచేసింతర్వాత ఎవరి ప్లేటు, స్పూన్లు వాళ్ళే శుభ్రంగా కడిగి వరుసలో అమర్చి వెళ్ళిపోతారు.

"సొంతంగా వండుకుంటే ఖర్చుండదు. కాని ఇక్కడ భోంచెయ్యాలంటే డబ్బు చెల్లించాలి. అలా కాకపోతే బద్ధకించి వండుకోవటం మానేస్తారు" అని చెప్పింది స్వేచ్ఛామయి.

సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించారు.

"సినిమాకెళదాం" అంటూ కొత్తప్రపోజల్ తెచ్చాడు కరుణాకర్.

"అబ్బ... ఏం సినిమాలెద్దూ! మరెప్పుడైనా వెళ్లొచ్చు" అంది స్వేచ్ఛామయి బద్ధకంగా.

"మళ్ళీ ఓపదిపదిహేనురోజులు నాకు తీరదు. కొత్త పెయింటింగ్ మొదలుపెట్టబోతున్నా". అన్నాడు కరుణాకర్.

"ఏం సినిమాలున్నాయి?"

"నందాదేవి బాగుందన్నారు. హాల్‌కూడా దగ్గరే... వెళదామా?"

"ఏదో ఒకటి... పదండి" అంది స్వేచ్ఛామయి.

వెన్నెల్లో చల్లగాలికి కబుర్లు చెప్పుకుంటూ నడిచి సినిమాహాల్ చేరుకున్నారు. కరుణాకర్ టిక్కెట్లు కొనితెచ్చాడు. అక్కడ వేరువేరు తరగతుల్లేవు. హాల్ అందంగా పరిశుభ్రంగా ఉంది.

'నందాదేవి' అనే మంచు పర్వతాన్ని స్త్రీపురుషులు కలిసి ఉన్న ఒక బృందం అనేక కష్టనష్టాల్ని విధివైపరీత్యాల్ని ఎదుర్కొని అధిరోహించి విజయం సాధించటం ఆ సినిమా కథ.

మొత్తం ప్రదర్శన గంటకంటే ఎక్కువ పట్ట లేదు. చూస్తున్నంతసేపు ఎంతో థ్రిల్లింగ్‌గా, ఎక్సయిటింగ్‌గా ఉంది. కానీ ఆనంద్‌కేదో అసంతృప్తి కలిగింది.

సినిమా అయింతర్వాత కరుణాకర్ తన ఇంటికి వెళ్ళిపోయాడు. స్వేచ్ఛామయి, ఆనంద్ ఇల్లు చేరేసరికి పదిగంటలైంది.

"ఎలా ఉంది సినిమా?" అందామె డ్రస్ మార్చుకొచ్చి.

"బాగానే ఉంది. కానీ కథేం లేదు. డాన్స్‌లూ, డ్యూయట్లూ వుండవా మీ సినిమాల్లో" అన్నాడతను.

"ఉండవు. మనిషి సాహసాన్ని, విజ్ఞానాన్ని పెంపొందించే కథలే తీసుకుంటారు. ప్రేమ కథలకి తావులేదు"

"ఎందుకని?"

"ఎందుకంటే స్వచ్ఛమైన ప్రేమకి కథ ఉండదు. ప్రేమచుట్టూ మోసాలూ, ద్వేషాలు, కుతంత్రాలు ఉన్నప్పుడే కథ ఉంటుంది. హీరో హీరోయిన్లు ప్రేమించుకుంటారు. పెద్దలో, దుష్టులో అవరోధాలు కల్పిస్తారు. వాటినెదుర్కొని చివరికి వాళ్లు పెళ్ళిచేసుకోవటమో, మరణించటమో జరుగుతుంది. ఎన్ని మలుపులు తిరిగినా అన్ని ప్రేమకథలూ ఇంతే! ఇక్కడ ప్రేమకు ఏ అవరోధాలూ ఉండవు. ఇంక కథేం వుంటుంది?"

"మీరేమీ అనుకోనంటే ఓవిషయం అడుగుతాను?" అన్నాడు ఆనంద్ సంకోచిస్తూ.

"నిర్భయంగా అడగండి"

"మీరూ, కరుణాకర్ కలిసి ఎందుకు జీవించరు?"

"జీవించ కూడదనేమీలేదు. చాలామంది కలిసే జీవిస్తారు. ప్రేమంటే ఒకళ్ళనొకళ్లు పూసుకుతిరగటం కాదు. దూరంగా ఉన్నప్పుడు ఆప్యాయతలు పెరుగుతాయని ఇట్లా వుంటున్నాం"

"మరి మీరు భార్యాభర్తలని లోకానికెట్లా తెలుస్తుంది?"

"ఇక్కడ ప్రతివాళ్ళకి గుర్తింపు కార్డులుంటాయి. పుట్టినతేదీ, తల్లి దండ్రులు చేస్తున్న ఉద్యోగం, ఎవరితో కలిసి జీవిస్తున్నదీ వివరాలన్నీ వుంటాయి. కార్డులు లేకుండా తిరగటం నేరం. కొంతకాలం కలిసి జీవించి విడిపోయిన వాళ్ళతో జీవితం పంచుకోవటానికి దాదాపు ఎవరూ తొందరగా ఇష్టపడరు" అక్కడి పద్ధతులు వివరంగా చెప్పింది స్వేచ్ఛామయి.

"తరచి చూస్తే ఈ వ్యవస్థ చాలా ఉన్నతమైనదనిపిస్తోంది. ప్రపంచమంతా ఇట్లా ఉంటే ఎంత బాగుంటుంది?" అన్నాడు ఆనంద్.

"మా కోరికా అదే. అందుకే దేశంలోని వివిధ పట్టణాల్లో మా సంస్థలు స్థాపించాం. ప్రపంచాన్ని మార్చగల శక్తి స్త్రీలకే వుందని మా అభిప్రాయం. ఎందుకంటే సమాజంలో వాళ్ళే ఎక్కువగా దోపిడికి గురౌతున్నారు కాబట్టి వాళ లోని అజ్ఞానాన్ని పోగొట్టి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి సంఘటిత పరచటం మా లక్ష్యం. ఆ లక్ష్యసాధనలో భాగంగా అనాథబాలికల్ని చేరదీసి మా పద్ధతుల్లో పెంచి పెద్దచేస్తున్నాం. మరో వంద సంవత్సరాలకైనా స్త్రీలే ఈ ప్రపంచానికి విముక్తి కలిగిస్తారు" అన్నది స్వేచ్ఛామయి ఉద్రేకంగా.

"మీ కృషి ఫలిస్తుందని ఆశిస్తాను" అన్నాడు ఆనంద్ నిర్మలమైన మనస్సుతో.

"మీలో ఇంత మార్పు వచ్చినందుకు ఆనందంగా ఉంది. పొద్దుపోయింది... నిద్రపొండి." అంటూ లైటు తీసేసి తను కూడా వెళ్ళి నిద్రకుపక్రమించిందామె.

ఆ తర్వాత నాలుగురోజులు సమతావనంతా తిరిగి చూశాడు ఆనంద్. అక్కడి పద్ధతులు అతణ్ని అబ్బుర పరచాయి. వాళ్ళ చదువుల్లో, సాహిత్యంలో, సినిమాల్లో, మనుమల మాటల్లో చేతల్లో స్వార్థం, అనూయలను పెంపొందించే అంశాలు పొరపాటున కూడా కనబడలేదు.

పిల్లల్ని అత్యుత్తమంగా పెంచటానికి అన్ని

టికన్నా ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు వాళ్ళు. అందుకయ్యే ఖర్చంతా ప్రభుత్వమే భరిస్తుంది. ఏడాది వయసొచ్చేవరకూ పిల్లలకు పాలివ్వటం మినహా తల్లికి ఎటువంటి బాధ్యతా ఉండదు.

ఉదయం పనిలోకెళ్ళేటప్పుడు తను పనిచేసే చోటుకి అతి దగ్గరలోఉన్న బేబీ కేర్ హోమ్‌లో పిల్లల్ని వదలి వెళుతుంది తల్లి. తరువాత రెండు మూడుసార్లు వెళ్ళి పాలిచ్చి వస్తుంది. సాయంత్రం, ఇంటికి వెళ్ళేటప్పుడు తనతోపాటు తీసుకెళుతుంది.

ఐదేళ్ళు నిండిన పిల్లల్ని స్కూళ్ళలో చేరుస్తారు. స్కూల్ హాస్టల్‌లోనే వాళ్ళుంటారు. శలవు దినాల్లో తల్లిదండ్రులు వెళ్ళి పిల్లల్ని ఇంటికి తెచ్చుకోవటమో లేక వాళ్ళే అక్కడ గడిపి రావటమో చేస్తారు. అత్యున్నతమైన విద్యా ప్రమాణాలు వారివి.

ప్రపంచంలో ఆయుధాల ఉత్పత్తికయ్యే ఖర్చులో నగం పెడితే పిల్లలందర్నీ చక్కగా పెంచొచ్చనుకున్నాడు ఆనంద్. కాని ప్రపంచానికా విషయం పట్టదు. రక్తపాతాల్ని సృష్టించటమే కానీ పిల్లల్ని మంచిగా పెంచుకోవటం చాతకాదు. సుఖశాంతుల కంటే మనిషికింకేం కావాలి?

ఆదివారం ఉదయం కరుణాకర్ వెళ్ళి స్వేచ్ఛామయి పిల్లలందర్నీ వెంటబెట్టుకొచ్చాడు.

"ఈయనెవరమ్మా?" అంటూ కొత్తగావున్న ఆనంద్‌వంక చూస్తూ అడిగారు చిన్నపిల్లలైన ధాత్రి, సూరజ్‌లు.

"ఈయన క్రాంతక్కయ్య నాన్నగారమ్మా. అక్కయ్యని చూద్దామనొచ్చారు. ఏమ్మా క్రాంతి... నాన్నగార్ని ఒక్కసారైనా చూడలేదని విచారించేదానివి కదా! ఇరుగో ఇప్పుడుచూడు... వీరే మీ నాన్నగారు" అంటూ తండ్రీకూతుళ్ళని పరిచయం చేసింది స్వేచ్ఛామయి.

"నాన్నా" అంటూ పరుగునవచ్చి తండ్రిని ముద్దుపెట్టుకుంది పధ్నాలుగేళ్ళ క్రాంతి.

"ఏమ్మా... బాగున్నావా?" అంటూ వాత్సల్యంగా క్రాంతి తలనిమిరాడు ఆనంద్.

ముచ్చటగా ఆరోగ్యంగావున్న కూతుర్ని చూసుకుని మురిసిపోయాడు. ఆ రోజంతా పిల్లల ఆటపాటల్లో, కబుర్లతో హాయిగా గడిచిపోయింది. రాత్రి భోజనాలైన తర్వాత కరుణాకర్ వెళ్ళిపోయాడు.

పిల్లలు కథ చెప్పమని మారాంచేస్తుంటే పడుకోబెట్టి కథ చెప్పసాగింది స్వేచ్ఛామయి.

చల్లగాలికి ఆరుబయట మంచంవేసుకొని పడుకున్నాడు ఆనంద్. క్రాంతి వచ్చి పక్కనే కూర్చుంది.

"నన్ను చూస్తే అసహ్యం కలగటంలేదా క్రాంతీ" బాధగా అడిగాడు ఆనంద్.

"అసహ్యమెందుకు నాన్నా?" ఆశ్చర్యపడ్డది క్రాంతి.

"అమ్మకూ, నీకూ చేసిన ద్రోహానికి"

"అమ్మ నాకంతా చెప్పింది నాన్నా! నువ్వంటే నాకసహ్యం లేదు. నువ్వు పుట్టిపెరిగిన సమాజంలో నీ స్థితిలో ఉన్నవాళ్ళెవరైనా దాదాపుగా అలాగే ప్రవర్తించేవాళ్ళు. తప్పు వ్యక్తిది కాదునాన్నా... వ్యవస్థది"

ఆ క్షణం క్రాంతిలో ఒక మహాజ్ఞానిని దర్శించగలిగాడు ఆనంద్.

"చిన్నదానివైనా ఎంత చక్కగా చెప్పావమ్మా!" కూతురి చేతిని తనచేతిలోకి తీసుకుంటూ అన్నాడు.

"నాన్నా!"

"ఏమ్మా!"

"నువ్విక్కడనుంచి వెళ్ళిపోతావా?"

అతను సమాధానం చెప్పలేక మౌనంగా ఉండిపోయాడు.

"వద్దునాన్నా... అక్కడ నీకెవరున్నారు? ఇప్పుడు అమ్మ నీకేమీ కాకపోయినా నేను నీ కూతుర్నేకదా! నాకోసం ఉండిపోవూ?"

ఆనంద్ కళ్ళు చెమ్మగిల్లాయి.

"అలాగే నమ్మా. నిన్ను విడిచి నేనెక్కడికీ వెళ్ళను. అదీగాక ఇక్కడ నేను చేయాల్సింది చాలా ఉన్నట్లనిపిస్తోంది కూడాను" అన్నాడు వాత్సల్యం నిండిన స్వరంతో.

చల్లనిగాలి వీస్తోంది. నిర్మలమైన ఆకాశంనుండి వెండి వెన్నెల కురిపిస్తోంది జాబిల్లి.

★

ప్రస్తుత నవలా లోకంలో రాజ్యం చేస్తున్న తాత్కాలిక ఆకర్షణల జోలికి పోకుండా రచయితల పేరుప్రఖ్యాతులకన్నా రచనే ముఖ్యంగా భావిస్తూ, పాఠకులను ఆకర్షించాలనుకోవడం సాహసమే అవుతుంది. కానీ, తనదైన దారిలో వైవిధ్యంగల ఉత్తమ నవలల్ని మాత్రమే అందిస్తూ, పెరుగుతున్న పాఠకాదరణతో 'చతుర' ఆ సాహసాన్ని సాధించి, గర్వంగా పయనిస్తోంది.

'చతుర'లోని ప్రతి పేజీ ఆసక్తికరమైందే-- మిమ్మల్ని మీరు మరచిపోయేలా చదివింపజేసే పసందైన నవల, రసవత్తర ఘట్టాలకు రంగు రంగుల చిత్రాలు, ఆహ్లాదకరమైన రూపంతో అందర్నీ అలరిస్తుంది 'చతుర'. నవలతోపాటు అందించే 'చతుర ప్రపంచం', 'చతుర కతలు' కేవలం 'చతుర' పాఠకులకే సొంతం.

ఆసక్తికి అర్థం చెబుతూ నెలనెలా నవ్వుతూ పలుకరించే 'చతుర' అంటే అందరికీ ఇష్టమే! అందువల్లే నెలనెలా 'చతుర' ఆకర్షణ పెరుగుతోందంటే మీరు ఒప్పుకుంటారు కదూ!

# రెండున్నర రూపాయలే

# విచిత్ర ప్రపంచం

## సైంటిస్టుల కథలు

ఇంగ్లండులోని బుక్‌బైండింగ్ షాపులో పనిచేసే ఓ కుర్రవాడికి శాస్త్రవిజ్ఞానమన్నా, శాస్త్రజ్ఞులన్నా ఎంతో ఇష్టం. లండన్‌లోని రాయల్ సొసైటీ ఎన్నో సైన్సు సెమినార్లు నిర్వహించేది. ఒకసారి ప్రఖ్యాత శాస్త్రవేత్త సర్ హంఫ్రీడేవి ఆ సొసైటీ మీటింగుల్లో వరుసగా కొన్ని లెక్చర్లు ఇవ్వవలసి ఉంది. ఆ విషయం విన్న కుర్రవాడు ఎలాగైనా ఆ సెమినార్‌కి వెళ్ళాలని నిర్ణయించుకుని అడ్మిషన్‌పాసు సంపాదించేడు. ఆ మీటింగులకి వెళ్ళి అన్ని లెక్చర్లనీ కడుశ్రద్ధగా విన్నాడు. వింటూ వాటి నోట్సు రాసుకుని ఇంటికొచ్చాక ఆ నోట్సుకు ఫెయిర్‌కాపీ రాశాడు. దాన్ని పుస్తకం లాగా చక్కగా బైండు చేసి సర్‌డేవీకి పంపించాడు. ఆ పుస్తకంలోనే చిన్న ఉత్తరం రాసిపెట్టాడు. తనకు రాయల్ సొసైటీలో ఏదైనా చిన్న ఉద్యోగం ఇప్పించమని దాని సారాంశం. సర్‌డేవి ఆ సొసైటీలో కెమిస్ట్రీ శాఖాధిపతిగా ఉన్నాడు. ఈ కుర్రవాడు పంపిన పుస్తకమూ, ఆ ఉత్తరం చదివి ఎంతో ప్రభావితుడైనాడు. ప్రతిభావంతుడైన ఆ కుర్రవాడికి ఏదో విధంగా సాయపడి ప్రోత్సహించాలని నిశ్చయించుకుని వెంటనే ప్రత్యుత్తరం రాసి ఇంటర్వ్యూకి ఫలానాతేదీన రమ్మని పిలిచాడు. ఇంటర్వ్యూకి హాజరైన కుర్రవాడికి విషయాలు చెబుతూ సైన్సు రీసెర్చిలోగల కష్టనిష్ఠూరాలు వివరించాడు. ఆ కుర్రవాడు అన్ని సమస్యల్నీ ఎదుర్కొంటానని ధైర్యంగా చెప్పటంతో అతన్ని వెంటనే ఉద్యోగంలోకి తీసుకున్నాడు. మొదట ఆ కుర్రవాడికి ఊడ్చేపనీ, లాబ్‌లో పరికరాలను కడిగేపనీ అప్పగించారు రాయల్ సొసైటీ అధినేతలు. అలా ఉద్యోగం నిర్వహించుకుంటూ చదువుకుని, శాస్త్రవిజ్ఞానం పెంపొందించుకుని క్రమేణా తనే ఓ గొప్ప శాస్త్రజ్ఞుడయ్యాడు. ఇంతకీ ఆ కుర్రవాడెవరోకాదు.... సర్ మైఖేల్ ఫారడే.

## నవీన గాంధారి

నేడు ఆఫ్ఘనిస్తాన్‌గా పిలువబడుతున్న నాటి గాంధారదేశం నుండే మహాభారతంలోని గాంధారి వచ్చింది. నేటి ఆధునిక గాంధారి "ధీరా" స్వస్థలం పశ్చిమబెంగాల్‌లోని బర్ద్వాన్ జిల్లా. ఒకానొక ప్రకటనను చూసి బీహార్‌లోని ఆరా జిల్లాకు చెందిన అంధుడైన ఓ ప్రొఫెసర్‌ను వివాహమాడ నిశ్చయించుకుంది అభినవ గాంధారి. ఆమె నిర్ణయం విన్న తండ్రి- "అతన్ని నీవు పెళ్ళిచేసుకుంటే నాకు అభ్యంతరంలేదు. కానీ, నీవు మహాభారతంలోని గాంధారిలా వుండాల్సి వస్తుంది" అన్నాడు. ధీరా ఆ మాటల్ని ఏనాడూ మరువలేదు.

భరత్ మిశ్రా పందొమ్మిది నెలల పసివాడుగా వున్నప్పుడే చూపు కోల్పోయాడు. అప్పటి నుండీ అతని జీవన సమరం ప్రారంభమైంది. ఆయన అనుభవించే మానసిక క్షోభ చదువు



పైన పడనీయకుండా శ్రద్ధగా చదువుకున్నాడు. పాట్నా యూనివర్శిటీ నుండి ఎం.ఎ. పొలిటికల్‌సైన్సులో పాసయ్యాడు. తరువాత న్యూస్‌పేపర్లో తన వివరాలు రాసి వివాహనిమిత్తమై ప్రకటన ఇచ్చాడు. ఎందరో ప్రతిస్పందించి తిరుగుటపాలో తమ వివరాలు వంపారు. కానీ ధీరా రాసిన ఉత్తరమే మిశ్రాని ఆకర్షించింది. ఫలితంగా వారి వివాహమైపోయింది. ఆ రోజుల్లో ధీరా కాల్నా కళాశాలలో సంస్కృత విద్యార్థిని. ప్రస్తుతం ఆరాలోని బాలికల పాఠశాలలో టీచరు. ఇవుడు మిశ్రా, ధీరా దంపతులకి ఇద్దరు కొడుకులు. వారికి తండ్రి అంధ వారసత్వం ఏమాత్రం రాలేదు మామూలుగా స్కూల్లో అందర్లాగే చదువుకుంటున్నారు.

ఎం.ఎ. తరువాత పి.హెచ్.డి. పూర్తిచేసి జాతీయ అవార్డును గెలుచుకున్నాడు మిశ్రా. మహారాష్ట్రకు చెందిన టి. రాజేంద్రవ్యాస్ పద్మశ్రీ అవార్డును పొందిన మొట్టమొదటి అంధుడు. రెండవవాడు మిశ్రా. ఢిల్లీలో రాష్ట్రపతి జైల్‌సింగ్ నుండి ఈ బహుమతిని మిశ్రా స్వీకరిస్తున్నపుడు ప్రముఖుల కరతాళ ధ్వనులతో హాలంతా మార్మోగిపోయింది. యావత్ భారతదేశంలోని 70 లక్షల అంధులు ఆ క్షణంలో వారి మనసులో మెదిలారు. వారిలో రెండుశాతంమందే విద్యాగంధం అలవరచుకున్నారు. ప్రతిరాష్ట్రంలోనూ అంధ బాల, బాలికలకు ప్రత్యేక పాఠశాలలుండాలని మిశ్రా అభిలాష.

భర్త సాధించిన గౌరవాన్ని గొప్పగా చెప్పుకుంటుంది ధీరా. మిశ్రా అడుగుజాడల్లో నడుస్తూ అతనికి చేయూతగా ఆధారమై ఆనాటి గాంధారిని తలపిస్తోందామె.



# నీటిపై తేలుతున్న గ్రంథాలయం

మంగళూరురేవువద్ద "డౌలోస్" అనే ప్రపంచంలోనే అతి పెద్దదైన పుస్తక ప్రదర్శన ఏర్పాటుచేసి గత సంవత్సరం మార్చి 31 నుండి ఏప్రిల్ 6 వరకు ప్రదర్శించారు.

పశ్చిమ జర్మనీకి చెందిన ఒక ఛారిటీ ట్రస్టువారు- "అందరికీ మంచి పుస్తకాలు" అనే పథకంకింద ఈ పుస్తక ప్రదర్శన ఏర్పాటు చేశారు.

72 ఏళ్ల నాటి ఓ పాత ఓడలో 40 దేశాలకు చెందిన 300 మంది యువకులు ఈ గ్రంథాలయ ప్రదర్శనలో సిబ్బందిగా పని చేశారు. ఈ సంస్థ ప్రదర్శించిన పుస్తకాల్లో పిల్లలకు సంబంధించినవీ, వంటలకు సంబంధించినవీ, సాంకేతికపరమైనవీ, పత్రికలూ, బైబిళ్ళు అన్నీ కలిపి సుమారు నాలుగు వేల అంశాలకు చెందిన గ్రంథాలు వున్నాయి. వీటిలో స్కూళ్లకు, జైళ్లకు, ఆస్పత్రులకు, చర్చిలకు సంబంధించినవీ వున్నాయి. ఆ ఓడలోనే రాత్రిపూటల్లో ఫిలింషోలు కూడా ఏర్పాటుచేశారు.

ఈ ప్రదర్శనను ఉదయం పదిగంటల నుండి ఒంటిగంట వరకు, మూడుగంటల నుండి రాత్రి ఎనిమిదిన్నరగంటల వరకు నిర్వహించారు. ఆదివారాల్లో మధ్యాహ్నం రెండుగంటల నుండి ఎనిమిదిన్నర వరకు తెరిచి వుంచారు. పోర్టుట్రస్టువారు ఒక్కోమనిషి లోపలికి ప్రవేశించబోయేముందు వారివద్ద అయిదు రూపాయలు వసూలుచేశారు. మరో ద్వారంగుండా తిరిగి వెళ్ళిపోయేముందు వారి అయిదు రూపాయల్ని ఒక పాకెట్‌బుక్ రూపంలో తిరిగి ఇచ్చేశారు. ★



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన కొన్ని ముఖ్యాంశాలు:

1. మీ **"చతుర సమీక్ష"** అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

## కూపన్

**ఆగస్ట్ 'చతుర' నవల: ప్రమదావని**

**సమీక్షకుని పేరు:** ................................................

**చిరునామా:** ................................................

................................................

................................................

................................................




సింధు ఆదర్శ భావాలుగల ఓ జర్నలిస్ట్

పాఠకుల బలహీనతల్ని రెచ్చగొట్టేవిధంగా వస్తున్న రచనలంటే ఆమెకు అసహ్యం.

అలాంటి సాహిత్య ప్రభావానికిలోనై, కేవలం పుస్తకాలు చదివి థ్రిల్లింగ్ కోసం యువత నేరాలకి పాల్పడటం కళ్ళారా చూసింది.

తన రచనలు పెడదారి పట్టించేవిధంగా ఉన్నాయని ఆ రచయిత చేతే ఒప్పిస్తుంది.

మంచి రచనల్ని మాత్రమే ఆదరించాలని జనాన్ని ఉత్తేజితుల్ని చేసిన ఆమె

ఓ పేరున్న రచయితని ఎలా ఎదుర్కొంది? ఎదుర్కొని ఏ విధంగా తన లక్ష్యం సాధించింది?

నేటి నవలాలోకపు తీరుతెన్నులపై వక్కలంక పద్మావతి విమర్శనాత్మక రచన 'గ్రహణం' సెప్టెంబరు నెల 'చతుర'లో చదవండి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasund. ara Publications; Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad- 500482

